*Issued on 26—11—1956*






# The Andhra Legislative Assembly

# DEBATES

## OFFICIAL REPORT

*MONDAY, 19th MARCH, 1956.*

VOLUME V — No. I.

## CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Monday, the 19th March,* 1956.

The House met in the Assembly Hall, Kurnool, at half past eight of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. QUESTIONS AND ANSWERS.

## STARRED QUESTIONS.

*Bridge work over Paleru River.*

567—

* 743 Q.—SRI B. V. SUBBA REDDI Will the Hon. the Deputy Chief Minister be pleased to state :

(a) the cost of the estimate for the bridge work over Paleru River in 7/1 mile of Koilakuntla-Nossam Road ;

(b) when the work was started and by whom the foundation stone was laid ,

(c) the stage at which the work stands ; and when it is likely to be completed , and

(d) whether it is a fact that a representation was made to His Excellency the Governor by the people of Jammalamadugu for the early completion of the work and if so, the action taken thereon by the Government ?

THE HON. SRI N. SANJEEVA REDDI .—

(a) Rs. 1,60,000.

(b) The work was commenced on 4—3—1950. The foundation stone was laid by me.

(c) The work in respect of the eigth span is in progress and the entire work is likely to be completed by June 1956.

(d) Yes. The Additional Chief Engineer (Highways)

[19th March 1956

instructions to the executive staff fixing up a programme for the completion of the work. The progress on the work is being closely watched by him.

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, Public Works Departmentలో పనులు తొందరగా జరుగుతూయుండగా Highways departmentలో Bridges, Roads, వగైరా పనులంతా ఇంత ఆలస్యంగా జరగడానికి కారణం ఏమిటో మంత్రిగారు సెలవిస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—ఈ విషయంలో మాత్రం నాకు తెలిసినది చెబుతాను. దీనికి 6 ఏళ్ళక్రితం నేను foundation stone వేశాను. పాపం ఎవరో పల్లెటూరాయన దీనికి contractor. ఈ contract విషయం ఆయనకు తెలియకపోవడం వల్ల చాలా నష్టపడినాడు. ఆయన చాలామట్టుకు నాశనమైపోయాడు. నన్నువదలి పెడితే చాలునని నమస్కారాలు పెడుతున్నాడు. ఆయనకే time ఇచ్చి ఆయనచేతే పనిపూర్తిచేయించాలని అనుకోవడం వల్ల కొంచం ఆలస్యమైనది. 3, 4 నెలలలో పని పూర్తి అవుతుంది. అప్పారావుగారు ఫాలకొండ దగ్గర కడుతున్న submersion bridge ని మనస్సులో పెట్టుకుని అడుగుతున్నారు. ఆవిషయంలో contractor తో ఏవో కొద్దిగా పేచీలు వచ్చాయి. ఈ మధ్య Chief Engineer కి పని అతిత్వరలో పూర్తిచేయవలసినదిగా instructions ఇచ్చాం. కొన్ని నెలలలోపల పూర్తిచేయిస్తానని చెప్పారు.

SRI S. VEMAYYA :—ఈ లక్షా అరవైవేలు original ఎస్టిమేటా ? లేక revised ఎస్టిమేటా ? ఇది కాకపోతే అసలు original estimate ఎంత ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఇదే original estimate. తరువాత ఇంకా revised estimate ఏమి వస్తుందో పని పూర్తి అయ్యాక తెలుస్తుంది.

*Lands to political prisoners in Siddhapuram Settlement.*

568—

* 987 Q.—SRI P. VENKATARAVANAPPA : Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether it is a fact that the Government have not yet assigned lands to political prisoners in Siddhapuram Settlement of Kurnool district : and

19th March 1956]

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) and (b) : Out of a total extent of 726 acres reserved for assignment to political sufferers, an extent of 630·73 acres has already been provisionally assigned to them and pattas have been issued in eight cases covering an extent of 120 30 acres The assignment in respect of the remaining extent is in progress after clearing the tree growth.

SRI E. AYYAPU REDDI :—Political sufferers కి సిద్ధాపురం settlement లో House sites allot చేయలేదనిన్నీ, అట్లా House sites allot చేయకపోతే వారు భూమిని ఉపయోగించుకోడానికి వీలులేకుండా ఉందనిన్నీ ప్రభుత్వానికి ఏమైనా representation వచ్చిందా? వస్తే Political sufferers కు House sites allot చేయడానికి ఏలాంటి ప్రయత్నం చేశారు ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇదివరకు ఒకపర్యాయం అయ్యపరెడ్డిగారే ఈ House sites ని గురించి నాతో మాట్లాడినట్లు నాకు జ్ఞాపకం ఉన్నది. అదిగాక ఏదో representation కూడా వచ్చింది. ముందు ఇక్కడ assignment లోనే కొన్ని చిక్కులు వచ్చాయి. Shrubs అవీ ఉండడంవల్ల ఇవన్నీ clear చేయడమో, auction చేయడమో ఏదో చేయవలసియుంది. ఇవన్నీ ఐనతరువాత ఆ question ఆలోచిస్తాం.

SRI N. K. LINGAM :—అధ్యక్షా ! ఈ Political sufferers కు భూములిస్తామని చెప్పి ప్రభుత్వం order జారీ చేశారు. ఒక తేది నిర్ణయించారు. ఆ తేదిలోపల ఈవ్యక్తులందరూ దరఖాస్తులు పంపించారు. కాని Revenue Office లో అది ఏ కారణంవల్లనో ఆలస్యం జరిగి దాని మూలంగా వాళ్ళకు భూములివ్వకుండా చాలామంది బాధపడుతున్నారు. ఈ ఆలస్యం అంతా ప్రభుత్వానిదే కనుక వాళ్ళది ఏమీ తప్పులేదు కనుక వెంటనే అది తనిఖీచేయించి వారందరకూ భూములిచ్చుటకు ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఈ Political sufferers కు భూములు ఒక తేదీలోపల పూర్తికావాలని చెప్పిన మాట నిజమే. ఐతే కొన్ని చిక్కులవల్ల అక్కడ వీరు పెట్టుకున్నటువంటి భూములు ఇవ్వడానికి వీలులేనికారణాలవల్ల కొంత ఆలస్యమయింది. ఐతే అంత మాత్రాన ఇప్పుడు ఈ పెట్టుకున్నవారికి గాని, ఇదివరకు ఇవ్వనివారికిగాని ఇవ్వం అని చెప్పి ప్రభుత్వం

19th March 1956]

*Harijan Hostel at Sidhout, Cuddapah District.*

569—

* 825 Q.—SRI P. VENKATASUBBAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state .

(a) whether the Harijan Hostel at Sidhout, Cuddapah District, is functioning properly , and

(b) whether there is a cook and Warden in the Hostel ?

THE HON. SRI G. LATCHANNA .—

(a) Yes, sir.

(b) There is a Woman cook for the hostel. But no warden has been appointed as the strength of the Hostel is only 10.

(a) ఔనండి.

(b) అక్కడ ఒక ఆడమనిషి వంటపని చేస్తున్నారు. అది 10 మంది విద్యార్థులతో నిర్వహింపబడుతున్న Hostel అవడంచేత Warden ను appoint చేసే అవకాశం లేదు.

*Project affected lands in Krishna District.*

570—

* 635 Q.—SRI PRAGADA KOTAIAH : Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) the extent of waste lands classified as project affected, in the District of Krishna ;

(b) whether specific instructions have been issued to assign those lands to the sivoijamadars , and

(c) if so, the extent of lands assigned to them as on 30th November 1955 ?

THE HON. Sri K. CHANDRAMOULI :—

(a) No waste lands stand classified in the Revenue

the extent of project affected lands in Krishna district would be about 50,000 acres.

(b) No specific instructions have been issued for assignment of these lands to sivoijamadars. However, sivoijamadars are granted these lands wherever they are eligible for their assignment under the existing rules.

(c) An extent of Acres 602-79 was assigned to sivoijamadars as on 30—11—1955.

SRI P. SREERAMULU :—Political sufferers కి గాని, ఇతరులకు గాని Rules ప్రకారం Assign చేయడానికి అనువుగా ఉన్న Lands కూడా ఈ Project affected areas లో assign చేయడానికి వీలులేదని చెబుతున్నారు. ఈ Lands ఎక్కడెక్కడ ఏఏ Project క్రింద affect ఐనదో definite గా చెప్పడానికి ప్రభుత్వానికి ఎంతకాలంపడుతుంది ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ప్రస్తుతం ఈ Project affected areas లో భూములు ఇవ్వడం ఆపుదల చేయబడినమాట నిజమే కాని, ఆ విషయాన్ని గురించి కొంత ఆలోచన జరుగుతోంది. సాధ్యమైనంత తొందరలోనే ఏఏ భూములు ఎట్లా ఇవ్వడానికి వీలుంటుందో, లేక ఇవ్వడానికి వీలుండదో ఆ విషయం నిర్ణయించబడుతుంది.

SRI V. KURMAYYA:—అధ్యక్షా! Project affected areas అంటున్నారు. Krishna జిల్లాలో ఇదివరకే Project ఉంది. ఈ 50 వేల ఎకరాలూ కూడా క్రొత్తగా రాబోయే ఏదైనా Project లో affected areas క్రింద వస్తాయా ? అల్లాగైతే ఇదివరకు శివాయి జమాదార్లకు Assign చెయ్యాలని Rules ఉన్నవి. ఆ Rules ఎందుకు Enforce చెయ్యడం లేదో చెబుతారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—కూర్మయ్యగారికి కృష్ణా జిల్లాలో ఏ Project లున్నాయో కూడా తెలియకపోవడం విచారకరమైన విషయం. Kirshrna barage project ఉన్నది. Ramapadasagar Project ఉన్నది. Nagarjunasagar అనే Project ఉన్నది. వాటిక్రింద ఈ భూములువస్తాయి.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Project affected areas అంటే ఏమిటి ? ఆ Project కి గాని, కాలవలకుగాని ఎన్నిమైళ్ల దూరంలో ఉన్నటువంటిభూమి ? కృష్ణాజిల్లాలో అది ఏఏ తాలూకాలలో

THE HON. SRI K. CHANDRAMOUKI :—ఒక్కొక్క Project క్రింద ఇన్ని మైళ్ళదూరంలో ఉన్న భూములని లెఖ్ఖ ఉంది. వేరే ప్రశ్న వేస్తే చెప్పడానికి అభ్యంతరం ఉండదు. దానికి కావలసిన కాలవల క్రింద, Project క్రింద మునిగిపోయే రైతులభూములకు బదులుగా ఇవ్వటానికి వసతులు చూపించబడుతున్నాయి.

THE HON. " N. SANJEEVA REDDY :—The point is "

SRI PILLALAMARRI VENKATESWARLU :—అది ఆధారం చేసుకుని ఈనాడు శివాయి జమాదార్లు ఏ Petition పెట్టుకున్నప్పటికీకూడా Revenue departrment వారు ఇవ్వడంలేదన్న విషయం మంత్రిగారి దృష్టికి వచ్చిందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆ ప్రశ్నకూ దీనికీ ఏమీ సంబంధంలేదు. శివాయిజమాదార్లకు 602 ఎకరాలు ఇచ్చారని ఇందాకా చెప్పాను.

SRI S. VEMAYYA :—అధ్యక్షా ! Project affected areas అనే పేరుతో మంజూరు చెయ్యడం ఆపేసేదానికన్న ఇప్పుడున్న Rules ప్రకారం తాత్కాలికంగానైనా వాళ్లకి పట్టాలివ్వడానికి ప్రభుత్వానికి ఏమి ఇబ్బంది ఉందండి?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఈ సమస్య తేలనిదే ఇప్పుడు భూములు ఇవ్వడానికి వీలులేదు.

SRI N. SRINIVASA RAO :—అధ్యక్షా ! ఈ Project నుంచి వచ్చే నీటివల్ల Affect కాకముందే, ఇతర ప్రాంతాలుకూడా Project affectd areas గా జమకట్టి అప్పుడే Taxes వేయడం, వ్యవహారాలన్నీ చేస్తున్నారు. అందుచేత ఆ Affect కాని Areas లో ఉన్న ఈ Defects సరిచేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI:—అటువంటివి ఇంత వరకూ మా Notice కు ఏమీరాలేదండి.

SRI S. VEMAYYA :—ఈ Project affected అనడంలో క్రొత్తగా Project క్రింద నీరుపారేటటువంటి భూములనా ? లేక అంతకుముందే పాత Project ల క్రింద నీరుపారుతున్నవికూడానా ? ఈ పాత Project క్రింద ఉన్న భూములను ఇవ్వడానికి ప్రభుత్వానికి అభ్యంతరం ఏమిటి ?

THE HON. SRI K. CHANDRA MOULI:—పాత Project ల క్రింద

project లక్రింద inprovements కోసం, ఇతరత్రా అయ్యేఖర్చు లెక్కలోకి తీసుకుని, ఎక్కువగా Inprove అయ్యేటట్లయితే వాటినికూడా Project lands తీసుకుంటాం.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఉప ముఖ్య మంత్రిగారు చెప్పినట్లు ప్రాజక్టు క్రింద సాగు అగుతుంది అది ప్రాజక్టు ఏరియా ప్రాజక్టులు వస్తుందని అనుకునే Offective area క్రిందకు వస్తుందని G.O. లో declare చేసినారు. అది ఏమైనా ఇప్పుడుం చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇప్పుడు సూచిస్తున్న ప్రాజెక్టులు క్రిందకూడాను మీదుగా ఈకాలువలు పోతవి. ఈ ఊళ్లు ఉన్నవని కూడా వివరములతో ఉన్నది.

SRI V. KURMAYYA :—Project affected area అనే వాటిని గురించి ఈ ప్రభుత్వం వచ్చిన తరువాత ఈ rule తీసుకుకొని వచ్చారు. శివాయి జమాదార్లు 25 సంవత్సరాలుగా ఈ భూములు చేస్తున్నారు కొబట్టి ఈ పాజక్టులు ఏరియా అనే వివక్షత లేకుండా ఈ రూలు తీసిపారవేసి శివాయి జమాదార్లకు ఈ భూములు ఇస్తారా ? అని సూటిగా అడుగుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—ఈ ప్రభుత్వం కొత్తగా తెచ్చినది ఏమీలేదు. ఇదివరకుకూడా శివాయి జమాదార్లకు కొంత భూమి ఇచ్చేరు. ఇప్పుడు ఒక నిర్ణయం అయ్యేవరకు ఇవ్వడను అవుదల చేసినారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈనాడు సాగులోకి తెచ్చి ప్రాజక్టులు area క్రింద ఉన్నప్పటికీ వారికి పట్టాలు ఇస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI:—శివాయి జమాదార్లకు ఈ భూములలో కొంత ఇవ్వడానికి అవకాశము ఉన్నదేమో ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

### *Repairs of the breached tank of Peddannavaripalli of Kadiri taluk.*

571—

***833 Q.—SRI K. V. VEMA REDDI : Will the Hon. the Deputy Chief Minister be pleased to state .**

**(a) whether the estimates for the repairs of the breached tank of Peddannavaripalli, Kadiri taluk, Ananta-**

pur District were prepared in 1952 during the composite State of Madras , and

(b) the stage at which the matter stands at present ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) Yes.

(b) The estimate was subsequently revised and the Collector's remarks on the revised proposals are awaited.

*Transfer of poramboke unobjectionable lands to 'Ayan' in the State*

572—

* 899 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state :

whether there is any restriction now to transfer poramboke unobjectionable lands to 'Ayan' in the State ?

THE HON. SRI K. CHANDRAMOULI :—The transfer of poramboke lands which are ordinarily intended for communal purposes into ayan, is prima-facie derogatory to public interest The Government have, therefore, suspended the transfer of porambokes to ayan till 30—10—1957, except in cases where assignment is already made to political sufferers ,

SRI S. VEMAYYA :—Communal Porambokes ను ayan గా మార్చడం suspend చేసినాము అన్నారు. దానిని lift చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI .—Communal purposes కు వినియోగపడవని కలెక్టరు చెపితే release చేస్తాము.

***Audit of Krishna Co-operative Central Bank Limited.***

**573—**

*** 236 Q.**—SRI V. VISWESWARA RAO : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) the important defects pointed out in the audit reports for 1951–52, 1952–53 on the administration of the Krishna Co-operative Central Bank Limited, Masulipatam;

(b) how far they were got rectified ;

(c) whether the Government will place copies of the audit reports on the Table of the House , and

(d) whether there were any cases of misappropriations of funds and if so, by whom and the action taken thereon ?

The Hon. Sri D. SANJIVAYYA :—

(a) and (b) : The accounts of the Krishna Co-operative Central Bank Limited, Masulipatnam were audited by the departmental staff and also by the Deputy Registrar of Co operative Societies, Masulipatnam, during 1951–52 and 1952–53 and certain defects were pointed out by them. Some have already been rectified and action is being pursued by the Bank for the rectification of the remaining defects. It is not desirable that the affairs of a Banking institution should be discussed openly.

(c) No, Sir. The Audit Reports of the Co-operative Societies are intended for their members and they are not public documents.

(d) No, Sir.

Sri PILLALAMARRI VENKATESWARLU :–కొన్ని defects Point out చేసినారన్నారు. వానిలో కొన్నింటిని rectify చెయ్యడానికి చర్య తీసుకొన్నాము అన్నారు. కొన్నింటిని rectify చెయ్యడానికి చర్య తీసుకొనలేదని మంత్రిగారు చెప్పారు. ఇప్పటికి ఏవేవి rectify చేశారు? Rectify కాకుండా ఉన్నవి ఏవేవి?

The Hon. Sri D. SANJIVAYYA :—వెంకటేశ్వర్లుగారు సరిగా వినలేదు నేనిచ్చిన జవాబు.

"Some have already been rectified and action is being pursued by the bank for the rectification of the remaining defects". So it is not as though I am sleeping over the matter.

SRI PILLALAMARRI VENKATESWARLU :—నా question మీరు follow కాలేదు. కొన్ని defects rectify చేసేము అంటే కొన్ని చెయ్య లేదని అర్థం స్ఫురిస్తుంది. చేయనట్టి వాటినిగురించి ఏమి చర్య తీసుకుంటారు.

THE HON. SRI D. SANJIVAYYA :—ఇంకో విషయం It is not desirable that the affairs of a Banking Institutions should be discussed openly అని నేను సమాధానము ఇచ్చినాను. మిగతవి తగు రీతిగా కఠినమైన చర్యలు అన్ని బ్యాంకుల మీద తీసుకున్నట్లు ఈ బ్యాంకు మీదకూడా తీసుకున్నాము.

SRI V. KURMAYYA :—ఆడిటు వారు Point out చేసిన gross defects ఏవో తెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—రూ. 12,500 ఇచ్చి ఒక car కొన్నారు. అది అమ్మివేశినారు. కారు కోసము గారేజి కట్టించారు. దానికి కూడా President pay చేసినారు.

SRI P. VENKATASUBBAYYA :—1951-52 ఆడిట్టు రిపోర్టులో కనుగొనబడిన defects సవరణ చెయ్యకుండా ఇంతకాలం ఉంచడానికి కారణము ఏమిటో తెలియచేస్తారు. ఈ defects అలాగే ఉన్న కారణముచేత Bank ను ఎందుకు supersede చెయ్యకూడదో తెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—సూపరుసీడు చెయ్యడానికి ఉండవలసిన ప్రబలమైన కారణాలు ఏమీలేవు. పెద్ద పెద్ద వన్నీ rectify చేసినాము. చిన్న చిన్న వాటి విషయం pursue చేస్తాము.

Sri B. APPA RAO :—ప్రెసిడెంటుగారు. కారుకొన్నారు డబ్బు చెల్లించుకొన్నారని చెప్పేరు. వారిమీద action ఏమైనా తీసుకున్నారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—Bank కోసము ఒక car కొన్నారు. కారు ఉండవలసిన అగత్యంలేదని తెలుసుకున్న తరువాత కారును అమ్మి వేసినారు అని చెప్పాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—కొన్ని విషయాలు ఉన్నవి అవి బహిరంగముగా చెప్పడానికి వీలులేదు అన్నారు. శాసనసభ్యులకు ఆ తప్పులు ఏమిటో circular గానైనా ఇస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఇక్కడ Confidential Private Circular కు అగత్యం కాదు.

19th March 1956]

SRI S. VEMAYYA :—ఈ కారు ఎంతకు కొన్నారు, ఎంతకు అమ్మారు ఎంత నష్టంవచ్చిందో తెలుసుకొనవచ్చునా ?

THE HON. SRI D. SANJIVAYYA :—12,500 కు car కొన్నారు అని చెప్పాను. ఎంతకు అమ్మినది నాకు తెలియదు.

SRI P. VENKATA SUBBAYYA:—బ్యాంకు ఆధీనములో ఉన్నప్పుడు అధికారులు అనధికారులుకూడా ఉపయోగించుకున్నారని ఆడిటు రిపోర్టులో చెప్పబడిందా ఏమైనా ?

THE HON. SRI D. SANJIVAYYA :—లేదండి.

*Special staff for assessing the collection and surcharge on Land Revenue.*

574—

* 1168 Q.—SRI P. GOPALU REDDI : Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) whether the Government propose to employ special staff for assessing the collection and surcharge on Land Revenue now levied for Fasli 1356 ; and

(b) if so, the probable additional expenditure to be incurred and the percentage of the same in the estimated income under surcharge ?

THE HON. SRI K. CHANDRAMOULI:—

(a) The levy of surcharge is for fasli 1365. The Government have sanctioned the employment of one "section writer" to be attached to each of the Revenue Inspectors in the State for a period of one month from the date of appointment.

(b) The expenditure on account of the special staff is estimated at about Rs. 45,000, which will constitute about 1 per cent of the estimated revenue under the Surcharge Act.

SRI S. VEMAYYA :—ఈ సెక్షను writer లకు జీతము ఇస్తున్నారా రోజువారీ భత్యమా తెలుసుకొనవచ్చునా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—సెక్షను రైటర్లకు నెలకు 40/- జీతము అలవెన్సుకలిపి.

SRI N. C. SESHADRI :—సర్ చార్జి వసూలు చేసే సందర్భములో విలేజి ఆఫీసర్లకు అడిషనలు రెమ్యూనరేషను ఏమైనా ఇచ్చారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అది ఏమీ ఇవ్వ లేదండి.

SRI S. VEMAYYA :—ఈ సెక్షను రైటర్లను అపాయింటు చేసేకన్న ఈ చిన్న విలేజి ఆఫీసర్లకు రెమ్యూనరేషను ఇచ్చి పని సాగించడానికి ప్రభుత్వం ఎందుకు ఆలోచించకూడదు?

THE HON. SRI K. CHANDRAMOULI :—సెక్షను రైటరు అంటే గుమస్తా. ఒక గుమస్తా ఈ పని అంతా చెయ్యలేనప్పుడు additional గా ఇంకొకరిని వెయ్యడము జరుగుతుంది.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— Village Officer లకు remuneration ఇప్పించవలెనని Officers ఏమైనా వ్రాసినారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అది ఏమో మాకు తెలియదు.

### *Construction of a Bridge over the Yeleru river at Yerravaram.*

575—

*654 Q.—SRI P. GURRAJU: Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) whether there is any proposal to construct a bridge over the Yeleru river at Yerravaram, East Godavari District ; and

(b) if so, when the work will be taken up ?—

THE HON. SRI N. SANJEEVA REDDI :

(a) and (b).—The construction of a bridge across the river Yeleru at Yerravaram has already been sanctioned and the work is in progress.

SRI S. VEMAYYA :—దీని estimate ఎంతో తెలుసుకొనవచ్చునా?

THE HON. SRI N. SANJEEVA REDDI :—శానా చరిత్ర ఉంది చెప్పవలసివస్తే. ఇది 1947లో ప్రారంభము అయినది. వరదలకు ఈ Bridge కొట్టుకుపోయింది. తరువాత National Highways క్రిందకు వచ్చింది. తరువాత మారింది. మళ్ళీ ఇప్పుడు Highways క్రిందకువచ్చింది. లక్ష 20 వేలతో ప్రారంభించి ఆ స్థలం repair చేదామనుకొన్నాము. తరువాత examine చెయ్యడములో పూర్తి Bridge కట్టవలెనని అనుకొన్నారు. ఆ 15000 1951 లో estimate చేసినారు. 1954 వచ్చేటప్పటికి 7,10000 అన్నారు. 1955 లో పూర్తిఅయ్యేసరికి 7,27000 అయినది. ఇది అంతా మనదికాదు. సెంట్రలు గవర్నమెంటువారి డబ్బు, వారే ఈ estimate approve చేసినారు.

*Extent of registered ayacut under Pidathapolur village.*

576—

* 98 Q.— SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state :

(a) the extent of the registered ayacut under Pidathapolur village of Nellore taluk and district ,

(b) whether the village tank serves any purpose now ; and

(c) if not, whether the Government give them to the poor ryots for cultivation ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) 643 acres.

(b) The answer is in affirmative.

(c) Does not arise.

SRI S. VEMAYYA :—ఈ చెరువువల్ల ఏమీ ప్రయోజనం లేదని దానిని తీసెయ్యాలని అక్కడ ఆందోళన జరుగుచున్నది. ప్రభుత్వం దీన్ని గుర్తించి abandon చేయటానికి చర్య తీసుకుంటుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇంతవరకు ఈ చెరువు వల్ల ప్రయోజనంలేదు అనేటటువంటి భావంలేకపోగా దానిక్రింద 643 ఎకరాలు సాగు అగుచున్నదని చెప్పి Public Works Department వారు చెపుతున్నారు.

SRI B. RAMA REDDI :—అధ్యక్షా! రాష్ట్రంలో సాగుకులాయకు లేకుండా తెగిపోయిన చెరువు లనేకము ఉన్నాయే వాటిని హరిజనులకు ఇవ్వమని, పట్టాలకు పెట్టుకోగా, Prohibitory Order Book లో ఉన్నదని నిరాకరిస్తున్నారే వీటిని గురించి action తీసుకొని హరిజనులకు అవుసరంలేని చెరువులను ఇప్పించే ఏర్పాటు చేస్తారా ?

THE HON SRI K. CHANDRAMOULI :—అటువంటివి కొన్ని చెరువులు ఉపయోగకరంగా ఉంటాయి అనుకొంటే వాటిని మళ్ళీ మరామత్తుచేసి సక్రమమైన పద్ధతికి తేవడం, పనికిరాదు అని abandon చేయటం, రెంటిలో ఏదో ఒకటి జరుగుతుంది.

SRI S. VEMAYYA :—ఇప్పుడు ఈ చెరువు తట్టులో సాగుబడియేదైనా ఉందా ? సాగుబడి ఉంటే ఎంతకాలంనుంచీ, ఎంతవిస్తీర్ణము సాగవుతుంది ?

THE HON. SRI K. CHNDARAMOULI :—నేను ఇప్పుడే చెప్పాను. P. W. D. వారిలెక్కల ప్రకారం 643 ఎకరాలుఅని, అంతవరకు సాగవుతుందని అనుకోవాలి. ఇప్పుడు నాదగ్గర లెక్కలు లేవు.

SRI B. RAMA REDDI :—బద్వేలు తాలూకాలో బద్వేలు సమీపంలో రూపరాజుగుంట అని ఒకAbandened tank ఉన్నది. దాని ఉపయోగంలేదని P. W. D. వాళ్లు సిఫారసుకూడా చేసారు. దాన్నిగురించి Revenue authorities మాత్రం జాప్యంచేస్తున్నారు. ఏమైనా Action తీసుకొంటారా మంత్రిగారు ?

SRI P. VENKATASUBBAYYA :—కొన్నిచెరువులురిపేరు చేయడానికి వీలులేకుండా వదలివేస్తున్నామన్నారు. ఆ చెరువు గర్భంలోనుండు భూమిని అచ్చుకట్టుగామార్చి హరిజనులకైనా assign చేస్తారా ?

THE HON. SRI K. CHNDRAMOULI :—అలాంటి Waste lands యేమైనాఉంటే తప్పకుండా పేదప్రజలకు యిస్తూనేఉంటారు.

SRI S. VEMAYYA :—ఈ చెరువు ఎప్పటినుంచి రిపేరులేకుండా ఉన్నదో ప్రభుత్వానికి తెలుసా ? తెలుస్తే అది ఎప్పుడు రిపేరుచేశారు. Last గా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఆ విషయం తెలియదు. కాని వేమయ్యగారి Infermation కొరకు విడతపోయారుటాంకు పెన్నారుకెనాలు system క్రిందఉన్నది. కృష్ణాపట్టణం కాలువద్వారా దీనికి నీరుసప్లైయిఅవుతుంటుంది. ఈ నీటివల్ల దీనిక్రిందఉన్న భూములు irrigate చేయబడుతున్నవి.

SRI S. VEMAYYA :—అధ్యక్షా! పెన్నారు రిజర్వాయరుక్రిందనే సాగుబడి అవుతుందని మంత్రిగారు ఇప్పుడు చెప్పారు. అలాంటప్పుడు ఈ చెరువు అవుసరంలేకుండానే పెన్నారునుండి నీరు పారడానికి వసతిఉంది కాబట్టి దీనిని Abandon చేయడానికి ప్రభుత్వంక్రిందకు ఉత్తరవులు పంపించి దర్యాప్తు చేయిస్తారా ? అని అడుగుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—కాలువద్వారా ఈ చెరువుకు నీరువస్తుందని చెప్పాను. Tank abandon చేయటానికి అగత్యంలేదు.

*Amount collected towards the surcharge on buses.*

577—

* 869 Q.—SRI V. VISWESWARA RAO : Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state :

(a) how much amount from each district, has been collected for the year 1954-55 and upto the end of December, 1955 towards the surcharge on buses ; and

(b) whether the collection of surcharge was exempted or waived in the case of any bus owner or owners during this period ?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) The particulars are furnished in a statement * placed on the Table of the House.

(b) The answer is in the negative.

SRI S. JAGANNATHAM :—అధ్యక్షా, ఇప్పుడు బస్సులమీద కట్టుతూన్నట్టి నెలవారి సర్‌చార్జి ఏనెలది ఆ నెలలోనే వసూలుచేయడం జరుగుతుంది. అట్లా కాకుండా Juarterly tav తో కట్టమని R. T. O. గారు Intimate చేసి ఉన్నారు. అలాగు ప్రభుత్వం ఏమైనా ఆర్డరు మంజూరుచేసిందా ? అలా చేసినట్లయితే ఆపరేటర్సుకు కట్టడం చాలా కష్టంగాఉంది. దాన్ని మార్పు చేయడానికి ప్రభుత్వం చర్యతీసుకొంటుందా ?

---

* Vide appendix at page infra.

19th March 1956]

THE HON: SRI D. SANJIVAYYA :—ప్రయత్నం చేస్తామండీ.

SRI P. RANGA REDDI :—ఇదివరలో వసూలు చేసినటువంటి Sur Charge లో కొంతభాగం అక్రమంగా వసూలుచేయబడ్డది అని High court ఇచ్చిన తీర్పువలన విశదమయింది. దానిని తిరుగ వాపసుయివ్వమని మోటారు ఆపరేటర్సును కోరడం జరిగిందా ? జరిగిఉంటే దానిపైన మంత్రిగారుగానీ, ప్రభుత్వం గానీ ఏమిచర్య తీసుకొంది ?

THE HON. SRI D. SANJIVAYYA :—కోరడం జరిగిందండీ. ఆ విషయంలో ఆలోచనకూడా చేస్తున్నాము.

SRI S. NARAYANAPPA :—ఇది ఎంతకాలంలో పరిష్కారం చేస్తారు మంత్రిగారు సెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—త్వరగా, ఒక 15 రోజుల లోనో, ఒక నెలరోజులలోనో, పరిష్కారం చేయజూస్తాము.

SRI N. K. LINGAM :—ఎక్కువ వసూలుచేసినటువంటి మొత్తం వాపసుచేస్తామని చెప్పుతున్నారే, ఇప్పుడు ప్రభుత్వం వాపసుచేయదలచుకొంటే ఎంత మొత్తం వాపసుచేయవలసివస్తుందో సెలవిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఇందులో నేనున్నది ఎంత ఎంతమొత్తం వసూలుచేసింది. వాపసుచేస్తామని చెప్పలేదు. ఇది ఎక్కువగా వసూలు చేయలేదు. మామూలుగా చట్టరీత్యానే వసూలుచేస్తే ఆ చట్టాన్ని సరి కాదని High court చెప్పినటువంటి కారణంగా ,దీన్ని వాపసుఇవ్వమని కోరు తున్నారు. ఆ విషయంలో ప్రభుత్వం ఆలోచనచేస్తుంది,

SRI P. VENKATASUBBAYYA :—ఈ Surcharge కట్టేటప్పుడు ఆపరేటర్సు మొదట Treasury లోకట్టి Chalans ను R. T. O. కు పంపాల్సి ఉంది. అట్లాకట్టేటప్పుడు చెలాన్సురాకుండాఉన్న కారణంచేత బస్సులను suspend చెయ్యడం జరుగుతూఉంది. ఆ విధంగా కాకుండా ఈ R. T. O. రసీదులుఇచ్చేసి వసూలుచేసుకోవడానికి ఆఫీసులో ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అది ఇంతవరకు ఆలోచించ లేదండి. R. T. Os. కి ఈ అధికారంఇస్తే మరి ఆ డబ్బునంతా అక్కడ నిలువ చేసుకోవడం, దాని బాధ్యత, తనిఖీ దీనికంతా అదనంగా Staff కావాల్సి వస్తుంది ? ఇప్పుడు తాలూకా office లో జరుగుతూ నేఉన్నది.

19th March 1956]

SRI N. SRINIVASA RAO :—అధ్యక్షా! మంత్రివర్యులు త్వరగా అంటే 15 రోజులు అని చెప్పారు. లేదా నెలఅన్నారు. మిగతా మంత్రులుకూడా ఈ విషయాన్ని 15 రోజులక్రింద, నెలక్రింద ఉండేటట్టు ఆదర్శంగా తీసుకొంటారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అది మిగతా మంత్రులకు ప్రశ్న వేయాలి.

SRI B. APPA RAO :—మంత్రిగారు ఆలోచన చేస్తామన్నారు. ఈ ఆలోచన ముఖ్యమంత్రిగారితో కలిసి చేస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అవునండి. ఇది ఆర్థిక విషయానికి సంబంధించింది కాబట్టి ముఖ్యమంత్రిగారు ఆర్థిక మంత్రిగా ఉన్నందువల్ల వారితో కలిసి చేయవలసియుంది.

SRI P. BASI REDDI :—High Court డబ్బును వాపసు ఇవ్వాలని చెప్పి చాలాకాలం అయింది. ఇప్పుడు ప్రభుత్వం ఆలోచన చేస్తామంటున్నారే ఇది ఏవిధంగానైనా వాపసు చేయకుండా ఉండాలని ఏమైనా మార్గాల న్వేషిస్తున్నారండీ ?

THE HON. SRI D. SANJIVAYYA :—వాపసు చెయ్యకూడదని కాదు. High Court తీర్పు ఏమిటంటే ఈ చట్టం చెల్లదన్నారు. ఆ చట్టాన్ని ఉపయోగించి వసూలు చేసినాము. చట్టం చెల్లనప్పుడు, ఆ చట్టం క్రింద వసూలు చేసింది న్యాయమైందా ? దానిని వాపసు ఇవ్వాలనా? లేదా? అనే ప్రశ్న ఒకటున్నది. ఒక చట్టం చెల్లదు అని ఒక తేదీన చెప్తే ఆ తేదినుంచి తరువాత వసూలుచేయ కూడదు అని కొంతమంది న్యాయవాదులు, న్యాయ శాస్త్రం చదువుకొన్నవారు చెప్పుతున్నారు. తరువాత ఆ తేదికి పూర్వం వసూలుచేసిన దానిని వాపసు ఇవ్వాలనా లేదా అనేదానికి voluntary గా ఇచ్చిఉంటే వాపసుచేయకూడదని. Coercion ఉపయోగించి వసూలుచేసి ఉంటే దాన్ని వాపసు ఇవ్వాలని ఇటువంటివన్నీ తర్జన భర్జనలు జరుగుతున్నాయి. అన్నీ పరిశీలించి ఒక నిర్ణయానికి వస్తాం.

SRI A. KALESWARA RAO :—ఈ బస్సు ఓనర్సు దగ్గరనుంచి సీటుకు ఇంతా అని ప్రజా అవుసరాలనుబట్టి వేసేటప్పుడు అది High Court వారు వేయకూడదు, మీరు చట్ట ప్రకారం చేయలేదు అనగా మీరు ఇంకొక చట్టం పెట్టి దానిని retrospective effect తో కూడా ఉండేటట్లు, ఈడబ్బు అంతా మన Government కు ప్రజలకుండేటట్టు చేస్తే బాగుంటుందేమో ప్రభుత్వం ఆలోచిస్తారా?

[19th March 1956

THE HON. SRI D. SANJIVAYYA :—ఆ retrospective effect ఇవ్వడం మంచిదికాదని అందరి భావన అనుకుంటాను. అందువల్ల మన ముందు జరిగేదానికే చట్టం చేసింది.

SRI A. KALESWARA RAO :—Retrospective effect ఇవ్వకూడదు అనే భావం నాది మాత్రం కాదని మనవిచేస్తున్నాను.

SRI S. VEMAYYA :—ఇక్కడక్కడ exemption ఏదీ ఇవ్వలేదన్నారు. ప్రస్తుతం ఉన్నటువంటి రూల్సులో exemption చేయడానికి ఏమైనా వీలుందా?

THE HON. SRI D. SANJIVAYYA :—Exemption చేయడానికి ఇప్పుడు రూల్సు లేవు కానీ ఏదైనా అవకాశం ఉంటే చూస్తాం.

SRI P. GUNNAYYA :—అధ్యక్షా ఈ surcharge లు గురించి ఏదో మంత్రిగారు సెలవిస్తున్నారు. గ్రామాల్లో నున్నటువంటి రైతాంగం కూలీలు, బస్సుల్లో రావటానికి చార్జీలు చాలా ఎక్కువగా ఉన్నాయి. ధరలన్నీ పడిపోయాయి. ఆ బస్సు చార్జిలు పాసింజర్లమీద తక్కువ చేయటానికి ప్రభుత్వం వారేదైనా తగు చర్య తీసుకొంటారా?

MR. SPEAKER :—వేరే ప్రశ్న వెయ్యండి.

*Jamabandi allowances to the village officers.*

578—

*894 Q.—SRI S. VEMAYYA : Will the Hon. Minister for Revenue be pleased to state :

The reason for not having paid the jamabandi allowances to the village officers within a distance of 5 miles and below now ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

No jamabandi allowance is paid to village officers of villages within a radius of 5 miles from the jamabandi camp, as they would not ordinarily have to halt at night at the jamabandi camp and would not therefore have to incur any expenditure in connection with their journeys.

SRI S. VEMAYYA :—అయిదు మైళ్ళలోపలున్నటువంటి గ్రామాధికార్లు Head Quarters లో ఆగరని ప్రభుత్వానికి ఏవిధంగా తెలుసును ?

19th March 1956]

THE HON. SRI K. CHANDRAMOULI :—సామాన్యంగా జరుగుతుంది కాబట్టి.

SRI S. VEMAYYA :—5 మైళ్లునా 3 మైళ్లునా జమాబంది అయినంత వరకు తప్పకుండా అక్కడుండవలసిన పరిస్థితులున్నాయి కాబట్టి వాళ్లకుకూడా జమాబంది allowance ఇవ్వడానికి చర్యలు తీసుకుంటారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—మామూలుగా 5 మైళ్ల లోపలున్నట్లయితే వెళ్లివస్తూవుంటారు. లేక అక్కడ ప్రత్యేక పరిస్థితులలో వున్నప్పుడు allowance ఇవ్వడానికి ఆలోచిస్తాం.

SRI P. SREERAMULU :—బస్సు రూటు లేనటువంటి గ్రామాల నుండి నడిచివచ్చిన వారికి daily allowance ఇవ్వడం న్యాయం అని ప్రభుత్వం భావిస్తుందా లేదా?

THE HON. SRI K. CHANDRAMOULI :—నడిచేవాళ్ల కెందుకండీ?

SRI P. KODANDARAMAYYA :—మంత్రిగారు అవసరమైతే 5 మైళ్ల లోపల ఏర్పాటు చేస్తాం అన్నారు. అలాగ జమాబంది officers కు instructions యిప్పిస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—సామాన్యంగా ఎప్పుడైతే జమాబంది officer కరణంనుగాని మునసబునుగాని ఉండమని కోరలేదో అప్పుడు తప్పకుండా ఇస్తారు.

SRI N. K. LINGAM:—అధ్యక్షా, ఈ జమాబందిలు సర్వసాధారణంగా ముందు వేసవికాలంలో మొదలవుతూవుంటాయి. ఈ జమాబందీ జరిపేటటువంటి ఆఫీసర్లు సర్వసాధారణంగా ఉదయం 6 గంటలనుంచి సాయంత్రం 4 గంటలవరకు వాటిని conduct చేస్తారు కనుక Village Officers ఉదయం 6 గంటలనుంచి సాయంత్రం 4 గంటలవరకు వుంటారు. 8-10 గంటల రాత్రవుతుంది. ఇది సరైనటువంటి పద్ధతికాదు. వీరికికూడా allowance ఇచ్చుటకు ప్రభుత్వం వెంటనే ఏర్పాటుచేయవలసినదని కోరుతున్నాను.

THE HON. SRI K. CHANDRAMOULI :—పద్ధతేమో సరైనదే. కాని అటువంటిదీ ఏదయినా ప్రత్యేక పరిస్థితులువచ్చి officers అక్కడుండవలసి వచ్చినా ప్రత్యేకమైనటువంటి ఖర్చులవుతేనే అటువంటి వారి స్థితి ఆలోచిస్తాం అని చెబుతున్నాను.

SRI S. VEMAYYA :—జమాబంది ఆఫీసరు ఉండమన్నట్లయితే ఇవ్వమని చెబుతానన్నారు. జమాబంది ఆఫీసరు సామాన్యంగా చెప్పరు. హెడ్మమాస్తాలు చెబుతారు. వాళ్లు చెప్పినా జమాబంది ఆఫీసరు చెప్పినట్లు భావించి యీ allowance ఇవ్వడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా?

THE HON. SRI K. CHANDRAMOULI :—అటువంటి దేదైనా చెప్పినపుడు జమాబంది ఆఫీసరును అడుగవచ్చు. తప్పులేదు, అడుగుతే ఉండమంటే అటువంటి వారి విషయం ఆలోచిస్తారు. అంతేగాని ఎవరో జవాను చెప్పారంటే కాదు. బాధ్యత గలిగినవారు చెప్పాలి.

SRI M. SATYANARAYANA RAJU :—Village officers ను రాత్రి ఉండమనిచెప్పి allowance కూడా యివ్వనట్లు ప్రభుత్వానికి తెలుసునా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—అటువంటి case లుంటే యిస్తున్నారు. Notice కు తెస్తే విచారిస్తాం.

SRI N. C. SESHADRI :—5 మైళ్లలోపలుంటే Night halt చేసే పనిలేదు కాబట్టి జమాబంది allowance యివ్వలేదని చెబుతున్నారు. అదే ప్రకారంగా యితర Revenue officers కుకూడా 5 మైళ్లలోపల గ్రామాలకుపోయి Night halt చేస్తే allowance లేకుండా చేయడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తుందా.

THE HON. SRI K. CHANDRAMOULI :—M.T.A. Rules లో అటువంటిది వున్నదండి:

SRI P. GUNNAYYA:—అధ్యక్షా, 5 మైళ్లలోపలున్నటువంటి Village officers కు T. A. లేదని శెలవిస్తున్నారు. 5 మైళ్లపైనున్న Village మునసబులకు T. A. మైలు కెంతరోజు కెంత యిస్తున్నారు ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇక్కడ కరణం మునసబుల విషయంలో Mileage question లేదండి. రోజుకు కరణంగారికి 1-0-0 యిస్తున్నారు. 5 రోజులవరకు వారుండడానికి అవకాశంవున్నది. మునసబుగారికి 1-0-0 యిస్తున్నారు, వారు ఒకరోజుమాత్రమే ఉండాలి.

SRI P. RAMACHARLU :—అధ్యక్షా, ఈ జమాబంది చాలా Out of date అయినది. అక్కరలేదని భావిస్తున్నారు. ఈ జమాబందిపద్ధతి తీసివేసే దానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—కావాల సేవారుకూడా ఎక్కువమందివున్నారు. అందువల్ల జమాబంది Abolition question లేదు.

SRI P. RAMACHARLU :—అయినప్పుడు ఈ జమాబందికి ఎక్కడో Head quarters కు వచ్చేదానికంటె దగ్గర ఇద్దరు, ముగ్గురు ఆఫీసర్సు చేరి 4, 5 గ్రామాలు కలిసేదగ్గర అక్కడచేస్తే ఎవరికీ యిబ్బంది వుండదు కనుక ఆ పద్ధతి గవర్నమెంటు చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇప్పుడున్నటువంటి విధానం మంచిదికాదని అభిప్రాయం కలుగుతే దాన్లో మార్పులు చేయడానికి ప్రభుత్వం ఎప్పుడూ సిద్ధంగానే వుంటుంది.

SRI T. GOPALAKRISHNAYYA GUPTA .—జమాబందికిగాను గ్రామోద్యోగస్తులకు ఒకటూపాయి allowance యిస్తాంఅని అంటున్నారు. జమాబంది Department revenue department లో వుండేటటువంటి గుమాస్తాలను ఆఫీసర్లను అందరినికూడా జమాబందికాలంలో సాకేభారం వారికి సరఫరా భారం గ్రామోద్యోగస్తుల మీదుంటుంది కొబట్టి దినం ఒక్కంటికి కనీసం 5 రూపాయలైనా ఒక గ్రామోద్యోగస్తునికి allowance యిచ్చేటటువంటి ప్రయత్నం చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఒక officerను యింకో officer సాకడండి. ఎవరినివారే సాకుకోవాలి.

SRI G. SURYANARAYANA :—ఈ జమాబందికిపోయే గ్రామ పోలీసులకు allowance యిస్తున్నారా ? ఎంతయిస్తున్నారు ?

THE HON. SRI K. CHANDRAMOULI :—జమాబంది allowance 2-0-0 వాళ్లకు, Menials కు కూడా యిస్తున్నారు. వారుండవలసినదే.

SRI S. VEMAYYA :—రాత్రుళ్ళు అక్కడ Halt చేయరు కొబట్టి గ్రామాలకు వెళ్లతారు. అందువల్ల యివ్వం అని చెబుతున్నారు. ప్రస్తుతం జరిగేటటువంటి జమాబంది విధానం రాత్రిళ్లుకాక మామూలుగా పగలే జరుగాల్నంటే గ్రామస్తులకు గ్రామోద్యోగస్థులకు యిబ్బంది కలిగేరీతిగా రాత్రి 9 గంటలు 10 గంటలవరకు Conduct చేస్తున్నారు. అందుచేత Night halt తప్పకుండా వుండవస్తుంది కొబట్టి allowance ఎందుకు యివ్వరాదు ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇదివరకే చెప్పాను. అటువంటిదిఉంటే తప్పకుండా యిస్తాం.

SRI P. VENKATASUBBAYYA :—ఈ Village officers కు officers అనే పేరు దర్జాగా నేవుందిగాని వాళ్లు కూర్చోడానికి బెంచీలయినా లేక నేలమీద వరాండాలలో కూర్చుంటున్నారు కనుక బెంచీలయినా ఏర్పాటు చేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—అటువంటిది ఆలోచనలో లేదు.

SRI S. VEMAYYA :—ఇప్పుడు నేనడిగిన ప్రశ్నకు సమాధానం రాలేదు. రాత్రి 9-10 గంటలవరకు Conduct చేస్తున్నారే రైతులకు యిబ్బంది కలిగేరీతిగా ఆ విధంగా జరుగకుండా Schedule time లో Conduct చేసేదానికి ఉత్తర్వులు జారీచేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఒకవేళ పని Heavy గా వున్నప్పుడు ఉండవలసివస్తే యిస్తాంఅని చెబుతున్నాను. తరువాత పనికూడా తొందరగా కావాలి కనుక యిన్నిగంటలని Fix చేయడానికి వీలులేదు.

[Note.—An asterisk* At the commencement of a speech denotes revision by the member.]

## II. POINT OF INFORMATION re:

### Absence of Ministers during budget debates.

SRI P. NARASIMHAPPA RAO :—మంత్రులసంఖ్య ఎంతో తెలియదు. మంత్రులందరూ Budget session లోనైనా ఒకేసారి కూర్చోడం అలవాటులేదా ? S. R. C. రిపోర్టు Chief secretary గారికి Chief minister గారికి వచ్చాయా ? సభ్యులకు అందచేస్తారా ?

MR. SPEAKER :—I will ask the Hon. Deputy Chief Minister to reply.

THE HON. SRI N. SAJEEVA REDDI :—మంత్రులెందరో నేను లెక్కపెట్టలేదు. 8 మంది అనుకొంటాను. నరసింహప్పారావుగారు ఇన్నాళ్లు సభ్యుడుగావున్నా ఆయనకు ఆ విషయం తెలియకపోవడం ఆశ్చర్యం. కొన్ని విషయాలు తెలియకపోయినా బయటికి చెప్పడం మంచిదికాదు. పొరపాటున చెప్పారు కొబట్టి చెబుతున్నాను. మంత్రుల సంఖ్య 8 అనుకొంటాను. S. R. C. Report 17 వతేదీని post చేసినారు, ఇంకా ఎవరికీ అందలేదు. రేపుదయం Chief Minister గారు వస్తారు. మంత్రులు tour లో పోతున్నారంటే అత్యవసరమైన పనులుంటాయి కనుక పోతారు. రాజమండ్రి కాకినాడలలో ముఖ్యమైన పనులు

19th March 1956]

చూసుకొనుటకు ఓబులరెడ్డిగారుకూడా పోయినారు. నాగేశ్వరరావు గారు వస్తారను కుంటాను. అసెంబ్లీకి ఇబ్బంది కలుగకుండానే బయటికిపోతున్నారు.

SRI N. K. LINGAM :— ఇప్పుడు అసెంబ్లీ జరుగుతున్నప్పుడు మంత్రులు పర్యటనకుపోతున్నారు. అదేవిధంగా శాసన సభ్యులుకూడా అత్యవసరమైన పను లున్నప్పుడు తమ నియోజకవర్గాలకు వెళ్లినప్పుడు ఆరోజు బత్తాలు తీసేస్తారు. వారికి కూడా బత్తాలిచ్చే అవకాశం ఏర్పాటు చేస్తారా?

MR. SPEAKER :— అది ఆలోచనలో వున్నది.

THE HON. SRI N. SANJEEVA REDDI :— మంత్రులు tour పోయినప్పుడు బత్తా వస్తుంది గాని, వున్నదిపోదు.

SRI A. C. SUBBA REDDI :— అధ్యక్షా, మంత్రులకు బడ్జెటు కంటే కూడా ఎలిమెంటరీ స్కూళ్లను తెరవడము, fish ponds ను తెరవడము ముఖ్యమా అండి?

SRI A. KALESWARA RAO :— అధ్యక్షా, ఈ బడ్జెటు సమావేశం చాలా ప్రాముఖ్యమైనది గనుక, ఇది యావత్తు ప్రభుత్వముయొక్క పాలసీని నిర్ణయించేది గనుక, ఈ పాలసీకంతకు బాధ్యత వహించినటువంటి ప్రధానమంత్రిగారు, మొదటనుంచి చివరకు కూర్చోవడము అవసరము. అట్లాగా ప్రతి డిమాండుకు సంబంధించిన మంత్రులుకూడా ఉండడం చాలా ముఖ్యం. అందువల్ల ఈ విషయాన్ని ప్రభుత్వం బాగా ఆలోచించవలసినదిగా కోరుతున్నాను.

## III. PRIVILEGE MOTION re :

**Publication of Select Committee Report on the Madras Estates Land (Andhra Amendment) Bill, 1955.**

MR. SPEAKER : The hon. Member Sri Vavilala Gopalakrishnayya has sent in a privilege motion which reads as follows :

"శాసనసభకే సరాసరి అందచేయబడవలసిన మద్రాసు ఎస్టేటు ల్యాండు (ఆంధ్రసవరణ) బిల్లు 1955 యొక్క సెలెక్టుకమిటీ రిపోర్టును శాసనసభకు, సభ్యులకు అందచేయకుండగనే ఆంధ్రగెజిటులో ప్రకటించినందున కలిగిన శాసన సభహక్కుల భంగపాటును విచారించి నిర్ణయించుటకు ఈ విషయాన్ని శాసన సభహక్కుల సంఘానికి పంపడమయినది."

I wish to point to Mr. Gopalakrishnayya the rule relating to this. Rule 92 says: "The report, the minutes of the proceedings of the Committee as approved by the person presiding and, if the Bill has been amended, the Bill as amended by the Committee, shall be printed and copies furnished to each member of the Assembly. The report, and if the Bill has been amended, the Bill as amended or such portion thereof as may have been amended shall also, unless otherwise directed by the Select Committee, be published in the Fort. St. George Gazette in the languages in which the original Bill was published."

SRI VAVILALA GOPALAKRISHNAYYA: On a point of personal explanation, Sir.

MR. SPEAKER No explanation is necessary. I am explaining. The Select Committee in its report has stated: "The Committee decided that the Bill as re-drafted need not come before the Select Committee and authorized the Chairman to sign the report on behalf of the members and send it for publication so that it could be taken up in this session." Also, for the information of the hon. Member I may state that the publication in this case was made, not by the Committee or by the Government, but under the authority of the Legislature Secretariat. If the hon. Member sees the concerned Gazette, he will find the publication is made under the signature of the Secretary to the State Legislature. So, there is no breach of privilege in this case and I rule the motion out of order.

IV. MOTION UNDER RULE 11 OF THE ASSEMBLY RULES.

SRI M. SATYANARAYANA RAJU · Sir, I move :

"That under Rule 11 of the Assembly Rules leave of absence be granted by this House to Sri Gottumukkala Jagannadha Raju, Member, Andhra Legislative Assembly for his absence during the last session from 3—2—1956 and during the present meeting till 19th March, 1956."

MR. SPEAKER : The question is. "That under Rule 11 of the Assembly Rules leave of absence be granted by this House to Sri Gottumukkala Jagannadha Raju, Member, Andhra Legislative Assembly for his absence during the last session from 3—2—1956 and during the present meeting till 19th March, 1956."

The motion was carried and leave was granted.

## V. BUDGET FOR THE YEAR 1956-57

### Voting of Demands Discussion—(Contd.)

### DEMAND VIII-IRRIGATION.

### DEMAND XXXIV-CAPITAL OUTLAY ON IRRIGATION.

### DEMAND XXXVIII-CAPITAL OUTLAY ON MULTI-PURPOSE RIVER SCHEMES.

THE HON. SRI N SANJEEVA REDDI . Sir, on the recommendation of the Governor, I move :

"That the Government be granted a sum not exceeding Rs. 1,38,65,400 under Demand No. VIII-Irrigation."

"That the Government be granted a sum not exceeding Rs. 5,17,29,600 under Demand XXXIV-Capital Outlay on Irrigation."

"That the Government be granted a sum not exceeding Rs. 1,80,00,000 under Demand No. XXXVIII-Capital Outlay on multi-purpose river schemes."

అధ్యక్షు మహాశయా, Irrigation Demand లో కొంత ప్రత్యేకత ఉన్నది. ఇందులో ప్రజలకు సంబంధించిన విషయాలు, రైతులకు సన్నిహితంగా ఉండే విషయాలు ఉన్నాయి. అందువల్ల వారు ఈ విషయములో ఆదుర్దాతో పరిశీలన చేస్తారు. ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలవారు తమకు నీటిపారుదల వసతులు కల్పిస్తారో లేదో అనే ఆదుర్దతో యెదురుచూస్తూ ఉంటారు. మనం కొద్ది మాసములకు పూర్వమే ఒక బడ్జటు డిమాండును ప్యాసుచేసుకొన్నాము. మరల ఇంత త్వరలో నూతన పథకములను తయారుచేసి అమలు జరుపడము చాలా కష్టము. ఎప్పుడు అయినా ఒక పథకాన్ని ప్రారంభిస్తే పూర్తి చేసుకోవడానికి కొన్ని యేండ్లు పడుతుంది. ప్రతి

సంవత్సరము మనము నూతనంగా పథకాలను తయారుచేసి ప్రారంభించడం చాలా కష్టము. ఆంధ్ర రాష్ట్రము ఏర్పడిన తరువాత మనం ప్రారంభించిన పనులు ఎన్నో ఉన్నాయి. అందులో కొన్ని పూర్తి అయినవి, కొన్ని కొద్ది మాసములలో పూర్తి అవుతాయి. ఇంకా పెద్ద ప్రాజెక్టులు ఉన్నాయి. అవి ప్రారంభించిన కొన్ని యేండ్లకు గాని పూర్తికావు. నాగార్జున సాగరు, తుంగభద్ర, వంశధార ప్రాజెక్టులు కొన్ని యేండ్లకు గాని పూర్తికావు. వాటి విషయమే పలుమారులు చెప్పుకోవలసి ఉంటుంది. అవి పూర్తి అయ్యేవరకు వాటికిగాను ప్రతి సంవత్సరము బడ్జటులో కేటాయించవలసి ఉంటుంది. కాబట్టి నేను గత పర్యాయము చెప్పినదానికంటే కొత్తగా చెప్పవలసిన విషయములు ఏమీ లేవనుకొంటాను. కాని పాత విషయములనే పునర్విమర్శ చేసుకుంటే, ఆంధ్రరాష్ట్రము వచ్చిన తరువాత మనం చేసుకొన్న కార్యక్రమాలు చెప్పుకోదగినంత ఘనంగానే ఉన్నవని మాత్రము నేను విశ్వసిస్తున్నాను.

రెండవ పంచవర్ష ప్రణాళికలో పెద్ద స్కీములు మాత్రమే చేర్చబడ్డాయిగాని, సాధారణమైన medium schemes, minor schemes హెచ్చుగా తీసుకునేందుకు అవకాశము లేకపోయిందన్న విషయము రెండవ పంచవర్ష ప్రణాళిక ముసాయిదాను చూస్తే, మీకే బోధపడుతుంది. ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత 5 కోట్ల రూపాయలు ప్రత్యేకంగా అప్పు తెచ్చి 17 కొత్త మీడియము స్కీములు ప్రారంభించిన విషయము సభ్యులందరికీ తెలిసినదే. వాటిల్లో 15 స్కీములు 3, 4 నెలలోనే పూర్తికాగలవు. కడప-కర్నూలు కాలువ, నారాయణపురం ప్రాజెక్టు పనులు మాత్రం 1957 జూన్ నాటికి పూర్తికాగలవని నేను విశ్వసిస్తున్నాను. మిగిలిన 15 స్కీములు ఈ సంవత్సరం జూన్ నెల నాటికే పూర్తిచేసి, వాటిద్వారా సరఫరా అయ్యేనీటితో కొన్నివేల ఎకరాలు సాగులోకి తేవడానికి అవకాశము ఉన్నది.

ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత మరొక ముఖ్య విషయము జరిగినది. కృష్ణానదిపైన రోడ్డు రెగ్యులేటరు బ్రిడ్జి పని ప్రారంభించిన విషయము సభ్యులందరికి తెలుసు. పని ప్రారంభించడమే కాదు, చురుకుగా పూర్తి అవుతున్నది. దానికిగాను ఇంతవరకు ఎంతో ధనం ఖర్చుపెట్టాము. ఇంకా ఖర్చుపెట్టవలసి ఉన్నది. ఈ సంవత్సరము ఇంకా కొన్ని లక్షలు అదనంగా ఖర్చుపెట్టి 1957 సంవత్సరము, జూన్, జూలై నెలలనాటికి దీని పనిని పూర్తి చేయాలని, తద్వారా కలిగే ఫలితాన్ని అనుభవించాలని ప్రభుత్వము ఆశిస్తున్నది. ఆ ఆశ ఇప్పుడు జరుగుతున్న పనినిబట్టి నెరవేరుతుందని అనుకొంటున్నాను. ఈ సంవత్సరపు బడ్జటులో కృష్ణా బారేజికి 82.39

లక్షల రూపాయిలు ప్రత్యేకించబడిన విషయం మీరందరూ చూచేయుంటారు. వీటన్నింటికంటే ముఖ్యమైనది నాగార్జున సాగరు ప్రాజెక్టు.

నాగార్జునసాగరు పనిని మనము ప్రారంభించినాము. అది మనము చెప్పుకోతగినంత ఘనకార్యము. ప్రాజెక్టు ప్రారంభించడమే కాదు, పునాదులు వేశాము. దానికిగాను కొన్ని లక్షలరూపాయలు అప్పుడే ఖర్చుఅయినాయి. గతసంవత్సరమే, తాత్కాలిక షెడ్లుకట్టడము, రోడ్లు వేసుకోవడము ఇలాంటి కార్యక్రమములకు కొన్ని లక్షలరూపాయలు ఖర్చుపెట్టడము, జరిగింది. రానున్న సంవత్సరంలో దానికి 80 లక్షలరూపాయలు బడ్జటులో కేటాయించాము. హైదరాబాదు ప్రభుత్వము కూడా కొన్నిలక్షలు కేటాయించి ఉంటారు. ఇవన్ని ఈ సంవత్సరము ఖర్చుపెట్ట దలుచుకున్నాము.

ఇప్పటికప్పుడే కృష్ణానదిపై బ్రిడ్జినిర్మించుటకుగాను tenders పిలిచారు. Tenders వస్తున్నాయి. పని ప్రారంభించబడుతుంది. దానికి ఎడమవైపున కాఫర్ డాము నిర్మిస్తున్నారు. అదికూడ చురుకుగానే సాగుచున్నది. ఎక్కువ విద్యుచ్ఛక్తి సరఫరా చేయడం మొదలైన కార్యక్రమమంతా చురుకుగానే సాగుతున్నది. పని తొందరగా జరుగుటలేదని కొందరు వ్యాఖ్యానిస్తున్నారు. పత్రికలలో ప్రకటిస్తు న్నారు. ఇది చాలా విచారకరమయిన విషయం. పని సక్రమంగా జరుగు తున్నది. ఇది రెండు ప్రభుత్వాలకు సంబంధించిన విషయం. ఒక Board ఉన్నది. ఆ Board లో ఢిల్లీ ప్రభుత్వప్రతినిధులున్నారు. పని యిక్కడ medium size projects కట్టినంత తొందరగా వీలుకాకపోవచ్చును. కోట్లకొలది రూపా యలు ఖర్చుఅవుతున్న ప్రాజెక్టు చాలా పెద్దప్రాజెక్టు దానికి జాగ్రతగా డబ్బు ఖర్చుపెట్టాలి. ప్రత్యేకమయిన సిబ్బందిని, కమిటీలను, ప్రత్యేకమైన బోర్డులను చేయడం జరిగింది. పని తొందరగానే జరుగుతోంది. విశాలాంధ్ర ఏర్పడడంతో రెండు ప్రభుత్వాలతో సంప్రదించి రెండుబోర్డులముందుకు ఖర్చు పంపించవలసిన అవసరంఉండదు. ఒకేప్రభుత్వం, ఒక Board వుంటే ఇప్పటికన్నా తొంద రగా పనిజరుగుటకు వీలుంటుంది. ఇప్పుడున్న పరిస్థితులలో రెండు రాష్ట్రప్రభు త్వాలకు సంబంధించిన కార్యక్రమం జరగవలసినంత తృప్తికరంగా జరుగుతున్నం దుకు మనం సంతృప్తిపడవలసియున్నది. తుంగభద్ర high level canal కు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 9 కోట్ల రూపాయలు ప్రత్యేకించినసంగతి ప్రజలకు తెలుసును. బళ్లారి, సిరిగుప్ప, హోస్పేటప్రాంతాలు మనకు వస్తాయనుకున్నాము. అప్పుడు ఎగువకాల్వ విషయంలో తగినంత శ్రద్ధవహించి అనుకున్న కాలంలోనే అతిత్వరగా దీనిని పూర్తిచేయుటకు వీలుంటుందని ఆశించినాము.

Sri N. Sanjeeva Reddi] [19th March 1956

ఇప్పుడు S. R. బిల్లును చూసినట్లయితే ఈ 3 తాలూకాలు మనకు రాకుండానే ఆ ప్రాజెక్టులను కట్టడానికి వీలుందని అఖిలభారత ప్రభుత్వంవారు అభిప్రాయపడుతున్నట్లు తేలింది. నాకుమాత్రం అంతవిశ్వాసంలేదు. కాని మనం కేంద్రప్రభుత్వంవారికి, ప్లానింగ్ కమిషన్‌వారికి పంపించినటువంటి స్కీము కేంద్ర ప్రభుత్వంవారు అంగీకరించినందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. ఇంక తుంగభద్ర ప్రాజెక్టుద్వారానే ఈ కార్యక్రమాన్ని చురుకుగా కొనసాగించాలని అనుకొంటున్నాను. దీనిని Budget లో చేర్చకపోయినాసరే ఈ సంవత్సరము పని ప్రారంభించుటకు ఏమీ అభ్యంతరంఉండదు. వీలయినంతత్వరలో ప్లానింగు కమిషన్ వారిదగ్గరనుంచి డబ్బుసేకరించి తప్పకుండా ఈ కార్యక్రమాన్ని అమలు పరచగలమని నేను సంపూర్ణంగా విశ్వసిస్తున్నాను. వంశధారకు తుంగభద్ర ఎగువ కాల్వకుఉన్నన్ని ఇబ్బందులులేవు. ఒరిస్సా ప్రభుత్వాన్ని ఒప్పించవలసిన బాధ్యతఉన్నది. వంశధార ప్రాజెక్టు విషయమై మేము ప్లానింగుకమిషన్‌వారికి ఇచ్చిన plans, estimates వారిదగ్గరనే ఉన్నాయి. 2 కోట్ల రూపాయలు ప్రత్యేకంగా దానికి కేటాయించారు. ఈ ప్రాజెక్టును ఈ సంవత్సరం ప్రారంభించలేకపోయినా రానున్న సంవత్సరంలో అనగా 2 వ పంచవర్ష ప్రణాళికలోనైనా పని ప్రారంభించడానికి అవకాశం ఉంటుందని నేను ఆశిస్తున్నాను. దీనికి ఏలాంటి యిబ్బంది ఉండదనుకొంటాను. ఒరిస్సాలో చాలా కొద్దిప్రాంతమే నీటిలో మునుగుతుంది. 250 ఎకరాలుంటుందని మనం అనుకొంటున్నాము. 450 ఎకరములని ఒరిస్సావారు అంటున్నారు. వారు ఏమన్నప్పటికి కొద్ది ప్రాంతమే కనుక ఈ project విషయంలో ఒరిస్సా ప్రభుత్వం త్వరలోనే అంగీకరిస్తుందని ఆశిస్తున్నాను. అది ప్రారంభించుటకు ఎటువంటి ఆక్షేపణఉండదు. పెద్ద పెద్ద ప్రాజెక్టులు ఎక్కడకట్టినా అవి కొన్ని తాలూకాలకు, కొన్నిజిల్లాలకు మాత్రమే ఉపయోగించగలవు. చాలా తాలూకాలకు ఉపయోగపడుటకు medium irrigation schemes ద్వారా చేయగలుతాము. మైనర్ స్కీములనే పేరుతో 10 ప్రాజెక్టులు గతసంవత్సరంలో ప్రారంభించి పూర్తిచేసుకొంటున్నాను. వివిధ తాలూకాలకు ఉపయోగపడడేటట్లు చేసుకున్నాము. ఈ రెండవ పంచవర్ష ప్రణాళికలో డబ్బు ఎక్కువగా కేటాయించపోవుటవలన కొంత నిరుత్సాహంగాఉంది. మనం medium schemes కు 2 సం॥ ల లోపల 5 కోట్ల రూపాయలపైబడి ఖర్చు పెడితే ఇప్పుడు 5 ఏండ్లలో 2 కోట్ల రూపాయలు మాత్రమే ఖర్చుపెట్టాలని కేటాయించారు. అందువల్ల తద్వారా ఏపని చేయడానికీ అవకాశంలేదనే నిరుత్సాహం నాకు లేకపోలేదు. నందికొండ, వంశధార, తుంగభద్రలాంటి పెద్ద ప్రాజెక్టులకు డబ్బు కేటాయించడంవల్ల medium schemes అమలు పరచుటకు అవకాశం

లేకపోతుందని, అవి ఇప్పుడు ప్రారంభిస్తే ఈ రెండుకోట్లరూపాయలు మొదటి సంవత్సరమే ఖర్చుపెట్టుటకు సరిపోతుందని మిగిలిన 4 సంవత్సరములు ఒకస్కీము అయినా ప్రారంభించుటకు అవకాశంలేదని అనుకున్నాము. అందుచేత ఈ సంవత్సరం ఈ medium size schemes అన్నీ ప్రారంభించడము అనవసరమనుకుంటాను. కేంద్రప్రభుత్వానికి 13 స్కీములు పంపించినాము ఇంకా కొన్ని స్కీములున్నాయి. వీటన్నింటినీ కేంద్రప్రభుత్వానికి పంపి వీలయినంత హెచ్చుధనాన్ని సంపాదించడానికి మనమంతా కృషిచేస్తే ప్లానింగుకమిషన్‌వారు అంగీకరించి scarcity areas కు 2, 3 కోట్ల రూపాయలు ఇస్తారేమోననే ఆశ ఉన్నది. Medium size schemes విషయమే కాక, మైనరుస్కీములకు కూడా 2 కోట్ల రూపాయలను మాత్రమే కేటాయించినారు. రెవిన్యూ Demand మీద చంద్రమౌళిగారు మాట్లాడినపుడు ఈ medium schemes కుగాను 2 కోట్లరూపాయలు ప్రత్యేకించినారని చెప్పిఉన్నారు.

ఇది Revenue పద్దుక్రింద కాక Agriculture పద్దుక్రింద ఉన్నది. ఈరెండు కోట్ల రూపాయలు filter points, bore wells మున్నగు వాటికై ఏర్పాటు చేశారు. Agriculture Department వారు 25 లక్షల రూపాయలు ప్రత్యేకంగా minor irrigation tanks కు, supply channels మొదలయిన చిన్న చిన్న వాటియొక్క మరమ్మతులకు 175 లక్షలరూపాయలు irrigation department ద్వారా వెచ్చించడానికి పథకాన్ని తయారుచేశారు. పాత జమీందారీ ప్రాంతంలో minor irrigation sources కు, రాయలసీమ ప్రాంతంలోనూ, ఇతర మెట్ట ప్రాంతాలలోను తెగిపోయినటువంటి చెరువులు, supply channels, యిలాంటివన్నీ రు. 175 లక్షల ఖర్చుతో బాగుచేయించుటకు మనం పూనుకోవాలి. ఇది ఎంతవరకు సాధ్యమౌతుందో తెలియకుండా ఉన్నది.

5 సంవత్సరములలో ఇంత చిన్న మొత్తమును ఖర్చుపెట్టి ఇంత బ్రహ్మాండమయిన కార్యక్రమాన్ని ఎట్లా పూర్తిచేయగలుగుతామో నాకు అర్థం కావడంలేదు. అందుచేతనే జమీందారీ ప్రాంతాలలో తెగిపోయిన చిన్న చిన్న చెరువులను మరమ్మతు చేయడానికి 50 లక్షల రూపాయలైనా ప్రత్యేకంగా ఇవ్వవలసిందని Planning Commission వారికి, కేంద్ర ప్రభుత్వంవారికి వ్రాసినాము. దానికి ఇంకా సమాధానంరాలేదు. ఆ 50 లక్షలు వస్తే కొంత ఉపయోగపడుతుంది. జమీందారీ ప్రాంతాలలో చిన్న చిన్న చెరువులు, కుంటలు ఉన్నాయి. వీటికి సరియైన sluices లేవు. నీరు బయటకు రావడానికి వీలు లేకుండా ఉన్నది. చిన్న చెరువు త్రవ్వకోడము నీరు కావలసివచ్చినపుడు చెరువుకట్టలు తెగగొట్టి నీరు ఉపయోగించుకోవడం,

మళ్లా చెరువుపూడ్చి వేయడం ఇలాంటి పురాతన పద్ధతులన్నీ ఉన్నాయి. వీటి నన్నింటిని సరియైన పద్ధతిలో బాగుచేయించి, తూములు పెట్టించి వరదకాలువలు త్రవ్వించి ఏమైనా ఏర్పాటు చేయగలిగితే దేశంలోని వెనుకబడిన ప్రాంతాలను, జమీందారీ ప్రాంతాలను బాగుచేయడానికి అవకాశాలుంటాయి. కనుకనే జమీందారీ ప్రాంతానికి ప్రత్యేకమైన అప్పు ఇవ్వమని ప్లానింగ్ కమిషనువారిని కోరినాము. వీటన్నింటికన్నా ముఖ్యమైనవి Flood Control Boards. Planning Commission వారు ఎన్నో పద్దుల క్రింద అప్పులు ఇస్తున్నారు. Flood Control schemes కు minor schemes కు, వేరే ఇచ్చినారు. Scarcity areas లో medium schemes కు 40 కోట్ల రూపాయలు ప్రత్యేకంగా కేటాయించినారు. Multi-purpose schemes అని చెప్పి నాగార్జున సాగర్ లాంటివి పెట్టినారు. ఇంకా spill over schemes అని తుంగభద్ర, రాళ్ళపాడు, భైరవానితిప్ప మొదలైన స్కీములను చేర్చినారు. ఇవన్నీ చూసుకుంటే ఆంధ్ర దేశంలో ఒక బ్రహ్మాండమైన కార్యక్రమం జరుగుతున్నదని తెలుస్తోంది ఈ స్కీములవలన ఎంత percentage of return వస్తుంది అని అనుకున్నప్పుడు రాళ్లపాడులాంటి స్కీము గాని, Upper Pennar లాంటి స్కీముగాని మనం percentage of return లెక్క వేస్తే అవి చాలా కష్టమైన స్కీములని తెలుస్తున్నది. కట్టినందుకు ఎక్కువ ఉపయోగం ఉందని చెప్పుకోడానికి వీలులేదు. Percentage of return లెక్క వేసుకోనకుండా ప్రజా శ్రేయస్సు దృష్ట్యా, చూచినట్లయితే నష్టంవచ్చినప్పటికీకూడా ఈ స్కీములు చాలా అవసరమని ప్రభుత్వం భావించింది. అందు చేతనే రాళ్ళపాడు, భైరవాని తిప్ప, పెన్నారులాంటి స్కీములు ప్రారంభించడం జరిగింది. Flood control schemes లేనివో మన రాష్ట్రానికి ఇంకా ఎక్కువ డబ్బు కేటాయించుటకు అవకాశా లున్నాయని తెలుసుకొన్నాము. వరదలవల్ల పాడైపోతున్న ప్రాంతమును బాగుచేయడానికి బుడమేరువంటి ప్రాజెక్టులు మనరాష్ట్రంలో కడుతున్నాము. మన రాష్ట్రంలో flood control schemes క్రింద 25 కోట్ల రూపాయలు కేటాయించవలసినదిగా కేంద్ర ప్రభుత్వంవారికి వ్రాసినాము, అక్కడ మొన్న జరిగిన సమావేశంలో నేనుకూడా పాల్గొన్నాను.

అప్పుడు వారు ఏరాష్ట్రానికి ఏస్కీముకు ఎంత sanction చేసినది తెలియ చేయలేదు. All India Irrigation Minister గారు అక్కడ జరిగిన సమావేశంలో మనము పంపినరిపోర్టును అంగీకరించి 20 కోట్లరూపాయలు కోరకపోయిన 12 కోట్ల రూపాయలైనా ప్రత్యేకించగలమనే సూచనను మనకు అందజేశారు. ఈ 12 కోట్ల రూపాయలలో ఒక్కొక్క scheme కు ఎంతెంత ప్రత్యేకించాలనే

బుడమేరు స్కీము విషయమై వెంటనే కార్యక్రమానికి పూనుకోండి అని డబ్బును కేటాయించారు. దాదాపు 10 రోజులకు పూర్వము బుడమేరు Diversion Scheme ను sanction చేయుడం జరిగింది. 38 లక్షల రూపాయలఖర్చుతో బుడమేరునీటిని కృష్ణలోకలిపి వరదవల్ల నష్టమౌతున్న పైరులను రక్షించుటకుగాను ప్రభుత్వము తీర్మానించింది. బుడమేరు scheme ను త్వరలోనే ప్రారంభించి అతిత్వరలో పూర్తిచేయాలనీ మా అభిలాష. బుడమేరుపైన Reservoir scheme ఒకటిఉన్నది. Reservoir కట్టుస్థలం Diversoin scheme కు 7, 8 మైళ్లు పైనఉన్నది. Reservoir కట్టినట్లయితే బుడమేటినీరు 7, 8 గంటలసేపు ప్రవహిస్తే Reservoir నిండిపోతుంది.

ఒక్కరోజులో 7, 8 గంటలలో నిండిపోయే Reservoir, flood ను యే మాత్రము control చేయలేదని పరిశీలనద్వారా తెలుస్తున్నది. Flood control scheme గా మాత్రమే దీనిని తీసుకోవాలంటే Diversion schemeను ప్రారంభించి తద్వారా రైతులకు కొల్లేటిముంపువల్లకలిగే నష్టాన్నుంచి రక్షించుటకుగాను ఈ diversion scheme ను మొట్టమొదటగా sanction చేశాము. కొల్లేటి ప్రాంతంలోని పైరులను రక్షించాలంటే తమ్మిలేరు, ఎఱకాలువ మొదలైన schemes లను ప్రారంభించడము, ఉప్పుటేరును వెడల్పు చేయడం మొదలైన పథకాలన్నీ పూర్తిచేసినపుడు కొల్లేరు ప్రాంతాన్ని కొంతవరకు రక్షించుకోగలుగుతాము. బుడమేటినీటిని కృష్ణలో కలిపినందువల్ల కొల్లేటికి ఎక్కువ లాభకరంగా ఉండదు. బుడమేరుద్వారా కొల్లేరుకు నీరు రావడానికి వీలులేదు. అయినప్పటికి చాలా చిన్న percentage లో నీరుమాత్రం తగ్గుతుంది. ఎఱ్ఱకాలువ, తమ్మిలేరు మొదలైన పథకాలను పూర్తిచేసినపుడు కొల్లేరు ప్రాంతాన్ని వరదలనుంచి రక్షించడానికి వీలవుతుంది. గోదావరిపైన కట్టే ప్రాజెక్టునుకూడా వరద స్కీములలో లెక్కవేయవలసిందని కేంద్రప్రభుత్వానికి వ్రాసినాము. సోమశిల విషయంలోకూడా అట్లాగే వ్రాసినాము, ఈ రెండూ major ప్రాజెక్టులు. గోదావరి పెద్ద ప్రాజెక్టు. సోమశిల అంతపెద్ద ప్రాజెక్టు కాకపోయినప్పటికి దానినికూడా పెద్ద ప్రాజెక్టుక్రిందనే లెక్కవేసుకోనలసిఉంది. ఈ రెండు స్కీముల విషయమే మాకేమి సమాధానంరాలేదు. ఇవేగాక, ఏలేరు, తాండవ, పంప మొదలైన స్కీములనుకూడా flood control schemes క్రిందచేర్చి పైరులను రక్షించడానికి, కొన్నివేల ఎకరాలను సాగులోకి తీసుకురావడానికిగాను వీటినికూడా sanction చేయించవలసిందని ఢిల్లీప్రభుత్వానికి వ్రాసినాము. ఈ విషయం పరిశీలనలో ఉన్నది. ఇదివరకు rough గా ఇన్ని లక్షలు అవుతుందని వ్రాసినామేగాని detailed estimates వేయలేదు. ఇప్పుడు detailed plans తయారుచేస్తున్నాము. ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన తరు

వాత ఈ ప్రాజెక్టుల పథకాలను తయారుచేయుటకుగాను special staff ను ఏర్పాటుజేసినాము. వారు పనిచేస్తున్నారు. గడచిననెలలో నేను సామర్లకోట ప్రాంతానికి వెళ్లినపుడు అక్కడున్న ఇంజనీర్లు ఏలేరుపై ప్రాజెక్టుకట్టడానికిగాను plans, estimates తయారుఅవుతున్నాయి, వాటిని వెంటనే పంపుతామని కూడా చెప్పారు. అది Chief Engineer గారికి అంది Secretariat కు వచ్చి ఇక్కడ పరిశీలన అయినతరువాత ఢిల్లి ప్రభుత్వానికిపంపి ద్వితీయ పంచవర్ష ప్రణాళిక రెండో సంవత్సరములోనైనా వాటిని ప్రారంభించడానికి ఏర్పాటు చేసుకోగలిగితే చాలా సంతోషిస్తాము. అందులో minor schemes, medium flood control schemes మొదలైనవి ఉన్నాయి. Medium schemes అనేవాటిని దాదాపు scarcity areas లో కట్టాలనే మా ఉద్దేశ్యము. Medium schemes కు ప్రత్యేకించిన 2 కోట్లు, minor schemes కు ప్రత్యేకించిన 75 లక్షల రూపాయలను ఎట్లా వినియోగించాలి, ఏ ప్రాంతాలకు వినియోగించాలి, అనే సమస్య వచ్చినపుడు ఏ జిల్లాలకైతే Major schemes ఉపయోగపడవో ఆ ప్రాంతాలకు ఈ డబ్బును వినియోగించాలని నిర్ణయించినాము. ముఖ్యమంత్రిగారుకూడా దీనిని అంగీకరించారు. ఏ ప్రాంతాలకైతే నందికొండ, తుంగభద్ర ఎగువకాలువ, వంశధార ప్రాజెక్టులు ఉపయోగపడవో అలాంటి ప్రాంతాలైన విశాఖపట్టణం, చిత్తూరు, మొదలైన జిల్లాలలోని మెట్టప్రాంతాలలో ఆ డబ్బును వినియోగించాలని నిర్ణయించినాము. పెద్ద ప్రాజెక్టులు ఉపయోగపడనటువంటి మెట్టప్రాంతాలలోనైనా medium schemes కు ప్రత్యేకించిన 2 కోట్ల రూపాయలను, minor schemes కు ప్రత్యేకించినటువంటి 1 కోటి 75 లక్షల రూపాయలను, వినియోగించాలని అనుకొన్నాము. ఎక్కడ ఏ ప్రాజెక్టుకు ఎంతఖర్చుపెట్టాలో యింకా నిశ్చయం కాలేదు. ఈ ప్రాజెక్టులయొక్క ప్లానులు estimates తయారైన వెంటనే వాటిని ఢిల్లీ ప్రభుత్వానికి పంపుతున్నాము. ఈ ప్రాంతంలో చేయాలని, ఈ ప్రాంతంలో చేయకూడదనే అభిప్రాయం మాత్రములేదని నేను ప్రభుత్వం తరఫున మీకు మనవిచేస్తున్నాను. వెనుకబడిన ప్రాంతాలలోకూడా ఎక్కడ ఏ ప్రాజెక్టు ప్రారంభించడానికి వీలవుతుందో అక్కడ ఆ ప్రాజెక్టును వెంటనే ప్రారంభం చేస్తాము. పెద్ద ప్రాజెక్టులు ఉపయోగపడని ప్రాంతాలలో ఈమొత్తాన్ని ఖర్చుపెట్టాలనే ఉద్దేశ్యంతో వాటిని పరిశీలనచేస్తున్నాము. పథకాలన్నీ తయారైన వెంటనే వాటిని ప్రారంభించాలనే అభిప్రాయం ప్రభుత్వానికి ఉన్నది.

ఒకసంవత్సరం ఆలస్యమైనప్పటికి ఫరవాలేదు. మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టు లకు కేటాయించినది కొద్దిమొత్తం అగుటవలన జాగ్రత్తగా పరిశీలనచేసి అవసరమైన ప్రాంతాలలో మాత్రమే ఖర్చుపెట్టాలనే ఉద్దేశ్యంతో ఈసంవత్సరం వాటిని ప్రారం

భించలేదు. వివిధప్రాంతాలలో అమలుచేయవలసిన ప్రాజక్టుల జాబితా నాదగ్గర ఉన్నది. బుడమేరు, తాంపేరు, రాళ్లపాటు ప్రాజక్టులకు ఎంత ఖర్చు అవుతూంది అనే estimates కూడా నాదగ్గర ఉన్నాయి. కాని వీటన్నిటిని నేను చెప్పవలసిన అవసరం లేదనుకుంటాను. పలుమారు సభ్యులు నన్ను ఈవిషయమై అడుగుతూనే ఉన్నారు. శాసనసభలో నేను పలుమారులు సమాధానం చెపుతూనే ఉన్నాను. ఇవన్నీ Budget estimates లోకూడా ఉంటాయి. ప్రస్తుతం పని చాలా చురుకుగా సాగుతోంది. శక్తివంచనలేకుండా ఇంజనీర్లు పనిచేస్తున్నారు. వారుకూడా ఇటువంటి ప్రాజెక్టులు కట్టగలిగినామనే ఆనందంపొందాలనే అభిప్రాయంతో చాల ఉత్సాహంగా చురుకుగా పనిచేస్తున్నారు. ముఖ్యంగా యువకులు, క్రొత్తగా promote చెయబడినటువంటి ఇంజనీర్లు-చాలాదీక్షతో పనిచేస్తున్నారని చెప్పడానికి చాలా సంతోషంగాఉంది. Department అంతా ఒక్కసారి purify అయిందని గాని, లేక ఆంధ్రఉద్యోగులందరూ హరిశ్చంద్రులైపోయారనిగాని నేనుచెప్పడంలేదు. లోటుపాటులేకపోలేదు. అక్కడక్కడ అవకతవకలు లేకపోలేదు. ప్రారంభించిన bridges 6 ఏండ్లవరకు పూర్తి కాకుండాపోవడం, లక్షరూపాయలతో ప్రారంభించిన మరమత్తులకు 2 లక్షలు ఖర్చుపెట్టాల్సిన అవసరం లేకపోలేదు. Over-estimates, under-estimates, revised estimates ఇటువంటివన్నీ జరుగుతూనేఉన్నాయి. కానీ ఎక్కడో ఒకచోట జరిగినదే మీదృష్టికి వస్తుంది. ఎక్కడైతే అవకతవకలు జరిగి ఆపుచేయబడుతారో అవే ప్రజలందరి దృష్టికితరచు వస్తాయి. ఇటువంటివే పత్రికలో ప్రచురింపబడుతూ ఉంటాయి. పని బాగా జరుగుతూ సవ్యంగా పని పూర్తయిన ప్రాజెక్టులు ఎన్నో ఉండగా ఎక్కడో ఒకచోట అవకతవక జరిగితే దానినిబట్టి Public Works Department వారు చేస్తున్నపనిని నిదర్శనంగా తీసుకోవద్దని నేను మిమ్మలను ప్రార్థిస్తున్నాను. General గా satisfactory గానే ఉన్నదని అనుకొంటున్నాను. Chief Engineer మొదలైన technical men ఎంతో కష్టపడుతున్నారు. అంతేకాకుండా non-technical men ను కొన్ని ప్రాజెక్టులు చూచుటకుగాను వేయాలని అనుకొంటున్నాము. సాధారణంగా technical men estimates పంపుతారు. అయితే కొంతమంది non-technical officers—I. C. S. ఉద్యోగులు — estimates లో revision కావాలన్నప్పుడు అటువంటి revision ఎందువల్ల అవసరం అన్నే విషయాన్నిగురించి పరిశీలన చేస్తున్నారు. Finance Secretariat లో గాని P.W.D. Secretariat లో గాని ఎక్కడైతే మార్పులు జరగడానికి అవకాశం ఉంటుందో ఆ మార్పులను పరిశీలనచేసి నాకు పంపవలసిందిగా ఉత్తర్వులు జారీచేసినాము. ఏదో తప్పుజరిగితే పట్టుకోవాలనే ఉద్దేశ్యంతో గాక, ప్రభుత్వ

యొక్క డబ్బు ప్రజలడబ్బు ఏమైన వృధా అవుతున్నదా, ఎందుకు వృధా అవుతున్నది, ఈ వృధాకాకుండా రక్షించుకోవడానికి మార్గాలు ఏమిటి, మొదలగునవి పరిశీలనచేయుటకుగాను వారు పోవుచున్నారు. రాళ్లపాడు ప్రాజెక్టును హెచ్చుగా ఖర్చు అయినదనే భావించుకొంటున్నాము. Budget సమావేశం అయిపోయినతరువాత తీరికగా ఉన్నప్పుడు వీరిద్దరు కడపజిల్లాలోని "ఫించా" ప్రాజెక్టును చూచి ఒక report ను submit చేయవలసిందిగా ఉత్తర్వులు జారీచేసినాము. అనవసరమైన ఖర్చులు తగ్గించుకోవడానికి ఏమైన అవకాశాలు ఉంటే వాటన్నిటి పరిశీలన చేయాలి. మీరేమైన సలహాలు ఇవ్వగలిగితే అంటే విమర్శనాపూర్వకంగాను, ఎవరో ఏదో తప్పుచేస్తే దానిని పట్టుకోవడానికి లేకుండా నిర్మాణాత్మకమైన సూచనలు ఇస్తే ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిస్తున్నాము. తప్పులున్నట్లయితే శిక్షిస్తున్నాము. Police constables విషయంలో 27 ఏండ్ల service ఉండి retire అవుతున్నవారిని dismiss చేశారని శ్రీనివాసరావుగారు చెప్పారు. retire అయినవాళ్లకు pension ఇవ్వకుండా dismiss అయినవారు Public Works Department లో కొంతమంది ఉన్నారని నేను చెప్పుతున్నాను. ఏదో చిన్న ఉద్యోగస్థులు, overseers వంటివారినికాదు. Executive Engineers, Assistant Engineers retire అయినవాళ్లకుకూడా pension ఇవ్వకుండా పూర్తిపరిశీలనచేసి dismiss చేయడంకూడా జరిగింది. ఎవరైన corrupt man ఉన్నట్లయితే వాళ్లను రక్షించాలనే ఉద్దేశ్యము secretariat లో గాని, Chief Engineer గారికిగాని మాకుగాని లేదు. అలాంటి cases ను మాదృష్టికితెస్తే వాళ్లను శిక్షించడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉన్నదని మనవి చేస్తున్నాను. ఇలాంటి వారిని కొద్దిమందినైనా P. W. D. నుండి తగ్గించి department ను purify చేయడానికి అవకాశాలు ఉన్నాయని చెపుతున్నాను.

గౌరవ సభ్యులు చిన్న చిన్న చెరువులు మొదలగువాటి విషయము చెప్పుతారని నాకు తెలుసు. మా నియోజక వర్గములో ఈ చెరువులు బాగలేవనో, లేక ఆ sluices బాగలేవనో, లేక ఈ supply channels ను repair చేయలేదనో ఈవిధంగా ఉపన్యాసాలు ఇస్తారు; ఇవన్నీ చేయించాలనే ప్రభుత్వముయొక్క ఆశకూడ. కాని ఇవన్నీ ఎట్లా చేయటానికి సాధ్యమవుతుంది? వీటన్నిటికి ఎంత డబ్బు కావలసియుంటుంది? ఈడబ్బు ఎక్కడనుంచి తెమ్మన్నారు? ఈ రెండుకోట్ల రూపాయలతో ఏమేమి చేయడానికి వీలవుతుందో మీరే చెప్పండి. డబ్బును మీరు హెచ్చు చేసుకోవాలి అని చెప్పవచ్చు. ఎందుకు మనము Planning Commission వారిని ఎక్కువ డబ్బు అడగకూడదు అనవచ్చును ; అడుగుతాము, అందుకు నాకేమి ఆక్షేపణ లేదు. ఇంకా 4,5 కోట్లు అదనంగా ఇవ్వవలసిందని అడుగుతాము, జమీందారీ

areas కు ప్రత్యేకంగా 50 లక్షల రూపాయలు ఇవ్వమని అప్పుడే అడిగాము, ఇంకొక 50 లక్షల రూపాయలు అడుగుతాము. అక్కడనుంచి డబ్బు కేటాయించబడి వస్తే ఇక్కడ పనులు చేయడానికి ఏలాటి ఆక్షేపణలేదు. Engineering Staff కూడ మనకు చాలా తక్కువగా ఉన్నది. చాలా త్వరత్వరగా promotions ఇస్తున్నాము. మేము retire అయ్యేలోగా అయినా మాకు Executive Engineer గా promotion వస్తుందో లేదో అని అనుమానంపడే పరిస్థితులలో ఉన్న Assistant Engineers ను 4,5 ఏళ్ళ service లోనే ఈనాడు వారికి Executive Engineers గా promotion ఇస్తున్నాము. నాలుగైదేళ్లు Executive Engineers గా ఉన్న వారిని Superintending Engineersగా అవకాశము ఇస్తున్నాము. ఇప్పుడు promote చేయడానికి, కనీసం 4 ఏళ్లు Executive Engineers గా ఉన్నవాడుకూడ లేడు మనరాష్ట్రములో అటువంటి వారు ఇద్దరో, ముగ్గురో ఉంటే. వారిని నాగార్జునసాగర్ కు పంపవలసివచ్చింది. అక్కడికికూడ యువకులను పంపిస్తున్నాము. మంచివాళ్లు, శక్తివంతులు, అనుకొనే వాళ్లను అక్కడికి పంపిస్తున్నాము. ఇక్కడ మన పనులు తగ్గుతాయి, అక్కడ నాగార్జున సాగర్ కు ప్రత్యేక బోర్డు ఉన్నదికదా అనుకొని దానిని neglect చేయడంగాని, లేదా second grade officers ను అక్కడికి పంపడంగాని కాదు. అదిగూడ మన ప్రజలకు సంబంధించినటువంటిదే. ఆ డబ్బుకూడ ప్రజానీకము తీర్చవలసిన అప్పే. కనుక అదికూడ మనము ప్రత్యేకమైన శ్రద్ధతో పరిశీలించవలసియున్నది. కాబట్టే ఉన్నవారిలో మంచివారినే అక్కడికి పంపుతున్నాము. మనకు staff position చాలా critical గా, చాలా కష్టంగా యున్నది. అయినా ఇప్పుడున్న Engineers Technical Knowledge లో Experts కాకపోవచ్చు. కాని శక్తివంచన లేకుండా మాత్రము బాగా కృషి చేస్తున్నారు. దగ్గరగా ఉన్న సభ్యులుకూడ అప్పుడప్పుడు ఆ projects కట్టే చోటికి పోయి ఏవిధంగా అక్కడ పనులు జరుగుతున్నాయో, వారు ఏవిధంగా పని చేస్తున్నారో అదంతా చూస్తూ తమ సహకారము, ప్రోత్సాహము ఇస్తారని ఆశిస్తున్నాను.

ఇక శ్రీకాకుళంలో ప్రత్యేకంగా గత సంవత్సరం ప్రారంభించిన ప్రాజెక్టులు చాలా ఉన్నాయని మనకందరికిని తెలుసు. ఈమధ్యనే నేను ఆపని తనిఖీచేయడానికి పోయి ఉంటిని. అక్కడ చాలా ప్రాజెక్టులు కావాలని అంటున్నారుగాని, అందుకు ప్రజలు శ్రద్ధవహించకుండా ఉండడం చాలా విచారకరంగా ఉన్నది. అప్పారావుగారు ఇది ఒప్పుకోక పోవచ్చు. పాపారావుగారు దీనికిగాను విచారాన్ని వెల్లడించవచ్చు. నేను personal గా పోయి అక్కడిపనులు inspect చేశాను. కంట్రాక్టర్లు,

వారికి అక్కడ కూలీలు దొరకకుండుటచే గుంటూరునుంచి పిలుచుకొని రావలసిన పరిస్థితులున్నాయన్నారు.

SRI P. NARASIMHAPPA RAO :—వీరు మామూలుగా బాగా పనిచేయగల Contractors ను నియమించకుండా Lowest tender accept చేయాలని ఎవరికో Contract ఇస్తే పనులు ఆ విధంగానే ఉంటాయి. తక్కువ డబ్బుతో ఎక్కువపని కావాలంటారు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—తక్కువ టెండర్లనే ఒప్పుకోవాలి. లేకపోతే చాలా ప్రమాదపరిస్థితులు ఏర్పడతాయి. ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత నేను ఒకే Principle చెప్పాను. తక్కువ tender ను ఒప్పుకోవలసిందని. ఒప్పుకోలేనటువంటి ప్రత్యేక పరిస్థితులు ఏవైనాఉంటే ప్రభుత్వానికి చెప్పాలి. లేకపోతే ఎంతప్రమాదము, ఎంత Mischief జరుగుతుందో ఆలోచించండి. తక్కువ Tender ను ఒప్పుకోవలసిన అవసరంలేదు అన్నట్లయితే, పై Tenders 40, 50 వేలు difference తో ఉండేటప్పుడు, వాటిని ఒప్పుకొనే అవకాశమిస్తే ఎంతప్రమాదము వస్తుందో, ఎన్నిలక్షల నష్టానికిగురి అవుతామో ఆలోచించండి. ప్రతివాళ్లు ఏదో ఒక కారణంచెప్పి పై టెండరును Accept చేయించుకోవడం జరుగుతుంది. కాబట్టి తక్కువ టెండరును ఒప్పుకోవాలి అనేది చాలా మంచి Principle, Healthy principle. దాన్ని మార్చడం మంచిదికాదు. ఎక్కడైనా ప్రత్యేకపరిస్థితులుఉండి, ఇతను ఒకరిని ఏడ్పించడానికి, ఇంకొకరిపై ఈర్ష్యతో ఈ విధంగా పెడుతున్నాడు, నిజంగా పనిచేయడానికికాదు అని ప్రభుత్వానికి తెలిసినప్పుడు తప్ప, సాధారణ పరిస్థితులలో తక్కువ టెండరునే ఒప్పుకోవడం మంచిది. ఆ ఉద్దేశంతోనే శ్రీకాకుళంలోఉన్న ప్రాజెక్టులన్నిటికి తక్కువ టెండర్లు ఒప్పుకోవడం, ఆ ప్రకారంగా Contractors క్రిష్ణా, గుంటూరు జిల్లాలనుంచి రావడంజరిగింది. అక్కడ ఈ Contractors పని చేయడానికి సిద్ధంగా ఉన్నారు. కాని వారికివచ్చిన ఇబ్బందల్లా అక్కడ కూలీలు దొరకడం లేదు. కూలీలనుగూడ గుంటూరునుంచి తీసుకురావలసిన పరిస్థితులున్నాయని చెప్పారు. శ్రీకాకుళం Backward area అని అనుకొంటున్నాము. అక్కడ చాలాపనులు చేయవలసిన మాటనిజమే కాని కూలీలుకూడ అక్కడ దొరకకుండా గుంటూరునుంచి పిలుచుకురావలసిన అవసరమేర్పడుతున్నదంటె- చాలా విచారకరంగాఉన్నది. అక్కడ ప్రజలు సహకరించడంలేదు. ఈ ఇబ్బందివల్లనే చాలా చోట్ల చిన్నచిన్న ప్రాజెక్టుల విషయంలో కంట్రాక్టర్లు మధ్యలో పనులు విడిచిపెట్టి పారిపోయ్యారు. అటువంటి పనులుఅన్నీ తరువాత Department వాళ్లే తీసు

కాని పూర్తిచేస్తున్నారు. Department కు కొంతడబ్బు ఎక్కువకావచ్చు. ఏమైనా సరే, మన ప్రాజెక్టులు మనము పూర్తి చేసుకోవడం ముఖ్యము. అంతేగాని, పారిపోయిన కంట్రాక్టర్లను వెతికి తెచ్చుకోవడం ముఖ్యంకాదు.

SRI V. C. CHUDAMANI DEO :—Agency areas లో కుమ్మడి గడ్డ, పొట్టిగడ్డ, మందగడ్డఅని చిన్న చిన్న గడ్డలుఉన్నాయి. వాటిని ఈ సంవత్సరమే Take up చేస్తారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—నేను ఈ విషయం ఇదివరకే చెప్పాను. Medium schemes కు, Minor schemes కు కొద్ది డబ్బుమాత్రమే కేటాయిస్తాము. ఈ సంవత్సరమే పూర్తిగా తీసుకోలేము, కాని వచ్చేసంవత్సరం, అనగా Second year of the Second Five year Planలో, ఇవన్నీ తీసుకోడానికి ప్రభుత్వము కృషిచేస్తుందని చెప్పాను. వీటికన్నిటికి Estimates తయారుచేస్తున్నారు. పొట్టిగడ్డ వగైరా పేర్లన్నీకూడ ఈ List లో ఉన్నాయి. అవి వచ్చేసంవత్సరం తీసుకోగలుగుతామేమో అనుకొంటాను. ఎందుకు ఈ ఆలస్యం జరుగుతున్నది అంటె, Last year of the First Five year Plan లో ప్రారంభించిన Schemes ఇంకా పూర్తికాలేదు. అవి ఇప్పుడిప్పుడే పూర్తి అవుతున్నాయి. ఇంకొక సంవత్సరములో పూర్తిఅవుతాయి. ప్రారంభించిన 18 Schemes లో శ్రీకాకుళంజిల్లాలో ఉన్నటువంటి 5, 6 Schemes ఇంకా పూర్తికాలేదు. ఈ జూలై ఆ ప్రాంతాలలో పూర్తికావచ్చునని, ఆశిస్తున్నాము. ఇంక, నారాయణపురములాంటి ప్రాజెక్టులు Next year కు పూర్తిఅవుతాయి. అవి పూర్తికాగానే కొత్తవి ప్రారంభించవచ్చు. ఈ నాగార్జునసాగర్ కు కొంతమంది ఇంజనీర్లు, Medium schemes కు కొంతమంది ఇంజనీర్లు, Minor schemes కు కొంతమంది ఇంజనీర్లు, Investigation కు Special Division, ఈ విధంగా వందలకొలది సంఖ్యలలో ఈ Staff పెరిగిపోయింది. ఈ రెండేళ్లలో కనుక ఇప్పుడే ఇంకా కొత్తపనులుకూడ తీసుకోవాలంటె, Inview of the Nagarjunasagar మనము తినలేనిదానికంటె ఎక్కువగా తినడానికి ప్రయత్నించినట్లు అవుతుందేమో, అనుకొంటాను. చాలా ప్రమాదాలకు గురిఅవుతాము. కాబట్టి ఈ సంవత్సరమే అన్నీ ప్రారంభించలేము. Estimates, schemes తయారు చేసుకొంటున్నాము. Second year of the Second Five year Plan లో అవి తీసుకోడానికి వీలుంటుందని అనుకొంటాను. అప్పుడు ఏవేవి ప్రారంభిస్తాము అంటె, అది ఇప్పుడు చెప్పలేను. అన్ని ప్రారంభించడానికి ప్రయత్నిస్తాము. అన్ని అంటె రాష్ట్రములో ఉన్నవన్నీ కాదు. రెండుకోట్లు మాత్రమే, నాలుగుకోట్లకైనా

పనులు మనము సాధించుకోగలుగుతామేమో అనుకొంటాను. ఆ ప్రయత్నం ఎంత వరకు జయప్రదమవుతుందో, ఏమి చేయగలుగుతామో నేను ఇప్పుడు ఏమిచెప్పలేను. మొత్తానికి ఈ మూడు Demands క్రింద, డబ్బును ఎట్లా బాగా ఖర్చుపెట్టడానికి వీలుఅవుతుందో దాన్నిగురించి మీ సలహాలుఇస్తూ ఈ Demands ను ఏకగ్రీవంగా అందరు ఆమోదించవలసిందిగా కోరుతున్నాను.

MR. SPEAKER : Motion moved :

"That Government be granted a sum not exceeding Rs. 1,38,65,400 under Demand No. VIII—Irrigation."

"That Government be granted a sum not exceeding Rs. 5 17, 29,600 under Demand No. XXXIV—Capital Outlay on Irrigation."

"That Government be granted a sum not exceeding Rs. 1,80,00,000 under Demand No. XXXVIII—Capital Outlay on Multipurpose River Schemes."

SRI S. VEMAYYA :—Sir, I beg to move

| | Rs. |
|---|---|
| To reduce the allotment of Rs. 1,38,65,400 for irrigation by ... | 100 |

(For the abnormal delay to promote L.C.Es. to the Upper Grade in the State).

SRI S. VEMAYYA :—Sir, I beg to move:

| | |
|---|---|
| To reduce the allotment of Rs. 1,38,65.400 for Irrigation by ... | 100 |

(To urge Government to take up the excavation of Kanupur and Kavali canals now).

SRI PILLALAMARRI VENKATESWARLU :—Sir, I beg to move :

| | |
|---|---|
| To reduce the allotment of Rs. 1,38,65,400 for Irrigation by ... | 100 |

(To discuss the failure of the Government to make provision for the execution of Tungabhadra High level Canal Scheme).

SRI P. NARASIMHAPPA RAO :—Sir, I beg to move :

(To reduce the allotment of Rs. 1,38,65.400 for Irrigation by ... 100

(నందినివాడ ప్రాజక్టు, చాయన్నఛానల్ పనులు వెంటనే ప్రారంభించవలెనని.)

SRI M. SATYANARAYANA RAJU : Sir, I beg to move :

To reduce the allotment of Rs. 1,38,65,400 for Irrigation by ... 100

(For the failure of the Government to implement Irrigation facilities to Cheepurapalli Taluk).

MR. SPEAKER : The cut motion (No. 389) given notice of by Sri Vavilala Gopalakrishnayya need not be moved as it is covered by the cut motion (390) of Sri Pillalamarri Venkateswarlu. He can speak on it.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Sir, I beg to move :

To reduce the allotment of Rs. 1,80,00,000 for Capital Outlay on Multipurpose River Schemes by ... 100

(To discuss the failure of the Government to make adequate provision for the execution of Nagarjuna Sagar Project.)

SRI M. NAGI REDDI : Sir I beg to move :

To reduce the allotment of Rs. 1,80,00,000 for Capital Outlay on Multipurpose River Schemes by ... 100

నాగార్జునసాగరు ప్రాజెక్టును, ఒకే దశలో తీసుకొనుటకు, కుడి కాలువ ఖోస్లా కమిటీ సూచించినట్లు, నెల్లూరు, గుంటూరు జిల్లాలలో అత్యధికభూమి సాగులోకి వచ్చునట్లు చేయుటగురించి చర్చించుటకు.

Mr. SPEAKER . The main Demands and the cut motions are now before the House for discussion.

Sri M. SATYANARAYANA RAJU :—అధ్యక్షా, ఉపముఖ్యమంత్రి గారు నీటి తీరువపద్దును ప్రవేశపెట్టుతూ, సభ్యులు మాట్లాడబోయే విషయాలను గురించి వారు ముందుగానే మాట్లాడారు. దీనినిబట్టివారికి thought reading ఉన్నదేమోనని నేను అనుకుంటున్నాను. అందుకు నాకు చాలా సంతోషము. సభ్యులు ఏఏ సంగతులను గురించి మాట్లాడదలచుకున్నారో ఆ విషయాలనే వారు తెలుసుకోగలిగారు. ఎందుకంటే, వారు చేయించవలసిన పనులు చేయలేదు కాబట్టే, వాటినిగురించి ముందుగానే మంత్రిగారు సెలవిచ్చారు. నీటి తీరువలను గురించి వారు అనేక రకాలుగా శెలవిచ్చారు. మొట్టమొదట పెద్ద పెద్ద ప్రాజెక్టుల విషయమును గురించి మాట్లాడదలచుకున్నాను. కాని వీటికే ఎక్కువ ప్రాధాన్యము యిస్తున్నామని మంత్రిగారు చెప్పారు. ఈ విధముగా ముందు పెద్ద ప్రాజెక్టులకు ప్రాధాన్యము ఇచ్చినందువల్ల ప్రయోజనము ఏమీ కన్పించటములేదు. పెద్ద పెద్ద ప్రాజెక్టులవల్ల ప్రయోజనము ఉంటే ఉండవచ్చు కాని దానియొక్క ఫలితములు long range లో కనబడతాయి. మైనరు ఇరిగేషనులు మనరాష్ట్రములో ప్రతి జిల్లాలోనూ ప్రభుత్వము తలబెట్టుతున్నది. కాని వీటికే ముందు ప్రాధాన్యము యిస్తే, ఫలితము తొందరలో రాగలదు. పెద్ద ప్రాజెక్టులకన్న మైనరు ఇరిగేషనులకే ఎక్కువ విలువ ఉంటుంది. ప్రజలుకూడ తమకు దేనివల్ల ఫలితము ముందుగా వస్తుందో, వాటికే విలువ యిస్తారనిగూడ గుర్తించాలి. అయినప్పటికి, పెద్దపెద్ద ప్రాజెక్టులకు ప్రభుత్వము ముందు ప్రాధాన్యము యిస్తున్నారంటే, యిది దేశములో ఒక advertisement గా ఉపయోగిస్తుందేకాని, ప్రజలకు మాత్రము ఫలితము వెంటనేరాదు. ప్రస్తుతము మనకు నాగార్జున ప్రాజెక్టు తలపెట్టారు. దీని తరువాత నాగావళి వస్తున్నది. ఇవి పూర్తిఅయి ఫలితము వచ్చేటప్పటికి ఎన్నో సంవత్సరాలు పడుతుంది. అందువల్ల పూర్తి ఫలితము రావటానికి చాలా ఆలస్యము జరుగుతుంది. ఈ ప్రాజెక్టులు పెద్దవి కావడమువల్ల, పూర్తి కావటానికి ఆలస్యము జరుగుతుంది కాబట్టి, ప్రజల అవసరములకు ఇవి వెంటనే తోడ్పడవు. ఈ ప్రాజెక్టులు రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో తప్పకుండా వస్తాయా అనిగూడా మనము నమ్మలేకుండా ఉన్నాము. ఇవి పూర్తిఅయి వచ్చేటప్పటికి, దాదాపు ఏ 20

సంవత్సరాలో పట్టుతుంది. అంటే ప్రజలు యీ ప్రాజెక్టుల ఫలితాలకొరకు ఇరవై సంవత్సరాలు నోర్లు తెరచుకొని కూర్చోండి అని ప్రభుత్వము చెబుతున్నదన్నమాట: ఆకలి ఉన్నవాడికి వెంటనే ఆకలి తీర్చాలిగాని, ఆలస్యము అయితే, చచ్చిపోతాడు అనే సంగతి మరచిపోకూడదు. ఇరవై సంవత్సరాలదాకా ఆగవలసిఉంటే, రైతాంగము ఎంతో నష్టమునకు గురికావలసిఉంటుంది. అందువల్ల వెంటనే ఫలితమునకు వచ్చే చిన్నచిన్న ప్రాజెక్టులు ముందు తీసుకోవాలని అంటున్నాను. ప్రభుత్వము తలపెట్టిన పెద్ద ప్రాజెక్టులకు ఏనాలుగు అయిదువందల కోట్లో ఖర్చుచేయవలసి ఉన్నప్పుడు, అందులో ఫలితముగూడ ఏ ఇరవై సంవత్సరాలకోగాని రానప్పుడు, చిన్నచిన్నవి అంటే medium size projects, minor projects కు ఏ రెండు మూడు కోట్లో ఖర్చుచేస్తే ముందుగా ఫలితము వస్తుందిగదా. ప్రజలకుగూడ తొందరగలో ఫలితము అందటానికి అవకాశము ఉంటుంది గదా! ఈ లెక్కలు అన్నీ ఉపముఖ్యమంత్రిగారికి తెలుసును. ఇవిగాక జమీందారీ ఏరియాలలో చాలా చోట్ల supply channels అయితే నేమి. అక్కడక్కడ అడ్డకట్టలు అయితే నేమి ఏర్పాటు చేయబడియున్నవి. ఇవి రానురాను, వరదలువచ్చినప్పుడు అన్నీ కొట్టుకొని పోయినందున, నీరు బొత్తిగా నిలవడములేదు. ఇప్పుడు వాటిని మరమ్మతు చేస్తే పంటలకు చాలా ఉపయోగముగా ఉంటుంది. ఈఖర్చు ఎకరమునకు దాదాపు యాభైగాని, నూరు రూపాయలుగాని, అంతకన్న ఎక్కువ ఖర్చుచేయనక్కరలేదు. ఆమాత్రపు ఖర్చుచేస్తే, యీ channels, అడ్డుకట్టలు చాలావరకు బాగుపడుతాయి. ఫలితముకూడ హెచ్చుగా రావటానికి అవకాశము ఉంటుంది. ఇటువంటివి ప్రజలకు ఎంతో త్వరలో ఉపయోగించాలి. వెనుకబడవేసి ప్రభుత్వం ఉపేక్షించడము, సభ్యులు ఎవరైనా అడిగితే, కేంద్ర ప్రభుత్వమువారు వీటికి హెచ్చుగా డబ్బు కేటాయించలేదని చెప్పడం, జరుగుతున్నది. పోని, కేంద్ర ప్రభుత్వమువారు అయిదు సంవత్సరాలకు ఇచ్చిన కేటాయింపు డబ్బులోనుంచి ఒక సంవత్సరము డబ్బు అయినా తగ్గించి, వీటికి ఉపయోగిస్తే యీ Minor Irrigation Schemes కొంతవరకైనా మరమ్మతుచేసి అభివృద్ధి చేయటానికి వీలవుతుంది. ప్రజలకుగూడ ఎంతో ఉపయోగిస్తాయిగదా! తక్కువ ఖర్చుతో ఎక్కువ ఫలితము తొందరలో ప్రజలకు అందజేయటానికి అవకాశము కలుగుతుంది. ప్రభుత్వము యీవిధముగా ఎందుకు చేయడము లేదో అర్థము కావడములేదు.

తరువాత medium and minor projects విషయములో గతములో major ప్రాజెక్టులకంటె, ఇవి చాలా తక్కువగా కట్టబడినవి. మా జిల్లాలో అక్కడక్కడ గెడ్డలు ఉన్నవి. అందులో ఒకదానికి ఆనకట్ట తొందరపడి, ఆలోచించకుండా

ఎగువన కట్టవలసినదానికి బదులు దిగువన కట్టారు. దానివల్ల ఫలితము ఎక్కువ రావడము లేదు. ఉదాహరణ చెప్పాలంటే మా జిల్లాలో నారాయణపురం ప్రాజెక్టు అని ఒకటి కట్టుతున్నారు. ఈ ప్రాజెక్టునే ఎగువన ఉన్న నందివాడవద్ద కట్టినట్లయితే, దానికి దగ్గరగా ఉన్న మెట్ట ప్రాంతాలకుగూడ నీరు పారుదల కావటానికి అవకాశాలు ఉంటవి. హెచ్చు ఫలితముగూడా వస్తుంది. అలాంటిది నారాయణపురం వద్ద కట్టుతామని అంటున్నారు. ఇది ఎక్కువగా ఉపయోగించదని నాఅభిప్రాయము. ఇదేవిధముగా సాలూరు దగ్గర కదిరివలసకట్ట అనేది ఉన్నది. దీనిని మరొక రెండు మైళ్ళు ఎగువన కట్టినట్లయితే అక్కడ చుట్టు ప్రక్కన ఉన్న ప్రజలు ఎక్కువ ఫలితము పొందటానికి వీలుగా ఉండేది. అక్కడ మెట్ట ప్రాంతాలుకూడ సాగు చేయడానికి అవకాశము ఉండేది. కాని ప్రభుత్వము ఏకారణముచేతనోగాని, దీన్ని దిగువన కట్టారు. ప్రజలకు ఇది నష్టముగానే ఉన్నదికాని, దీనివల్ల ఎక్కువ ఫలితము పొందలేకపోతున్నారు. ఇప్పుడు ఉపముఖ్యమంత్రిగారు నారాయణపురం ఆనకట్ట తయారుఅయిన తరువాత నందివాడదిగూడ మొదలుపెట్టుతాము అని అంటున్నారు. కాని నారాయణపురం తరువాత నందివాడది కట్టుతామని అంటే, యీ నందివాడది ఎప్పుడు వస్తుందో ఎవరుగూడ చెప్పలేకుండా ఉన్నాము. ఏది ఎట్లా అయినప్పటికినీ ముందే నందివాడ దగ్గర ఆరంభించినట్లయితే ముందుగానే నారాయణపురం ఆనకట్ట కన్నా ఎక్కువ ఫలితములు రావటానికి వీలుఅయ్యేది. ప్రభుత్వము మాత్రము యీ విషయములో ముందు వెనుకలు ఆలోచించకుండా, ఎదో ఇంజనీర్లు చెప్పారని, ఆరంభించడము, సరియైనదికాదనే చెప్పవలసివున్నది. ఎందుకంటే, నారాయణపురం ఆనకట్టవల్ల, ఇదివరకు నీరుపారుదల అవుతున్న భూములకు మాత్రమే నీరుపారుదల అవుతోంది కాని కొత్త ప్రాంతాలకు నీరు వెళ్లదు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—సత్యనారాయణరాజు గారివద్ద ఉన్న information సరియైనదికాదనుకుంటాను. ఇప్పుడు దాని particulars నాదగ్గర లేవుకాని, ఒకవిషయముమాత్రము చెబుతున్నాను. వాటికి స్కీములు ఉన్నవి. వీటిని ఇంజనీరింగు డిపార్టుమెంటువారు బాగా examine చేసినతరువాతనే, ముందు నారాయణపురము ఆనకట్టకట్టితే, దీనివల్ల చీపురుపల్లి తాలూకాకుగూడ నీరువెళ్లటానికి వీలవుతుంది. అక్కడగూడ ఉపయోగిస్తుందని ఇంజనీర్లు సలహాయిచ్చారు. అంతేకాని, నారాయణపురమువద్ద కట్టితే, నందివాడ వద్దకట్టకూడదు అనేది యేమీలేదు. దానికి నీరులేదనికాదు. కావలసినంతనీరు ఉంటుంది. నాగవళిలోని నీరు నారాయణపురమునకు కొద్ది పర్సెంటేజిమాత్రమే వాడుకుంటాము. నారాయణపురము కట్టినందువల్ల నాగావళికి నీరు ఉండదు అని కాదు, ఇందులో ముందు ఏది కట్టాలి అనే ప్రశ్న వచ్చినప్పుడు పైనవున్నవారు

పైనదాన్ని కట్టమంటారు, దిగువవున్నవారు దిగువున కట్టమని చెప్పారు. ఈవిధముగా ఒకరిమీద ఒకరు పోటీలు పెట్టుకుని, మాదిముందు అంటే, మాదిముందు అని అంటే దానికి ప్రభుత్వముమాత్రం యేమిచేయగలదు ? దానికి ఇంజనీరింగు డిపార్టుమెంటు వారిని బాగావిచారించమని చెప్పాము. వారియొక్క సలహామీదనే ప్రభుత్వము ఆరంభించింది. అంతేగాని పైవారు పైన అని, క్రిందివారు క్రింద అని, ఆ తాలూకా అని, యీతాలూకా అని అంటే, ఇందులో ఏదిఅని సమాధానము చెప్పటము కష్టము.

SRI M. SATYANARAYANA RAJU :—ఇప్పుడు నారాయణ పురము ఆనకట్ట, ప్రభుత్వమువారు తలంచుచున్నట్లుగా, చీపురుపల్లి తాలూకాప్రజలకు ఏమాత్రము ఉపయోగించదు. ఎందుకంటే, ఆతాలూకాలో ఎంతవరకు ఉన్న దంటే, శ్రీకాకుళం town వచ్చేవరకూ ఉన్నది. ఆఏరియానంతట అంటిపెట్టుకుని ఉన్నది. అట్లా కాకుండా నందివాడవద్ద కట్టినట్లయితే ఒక్క చీపురుపల్లి తాలూకాకే అధికభాగము రావటానికి అవకాశము ఉన్నది. అది కేవలం మెట్టప్రాంతం అని మంత్రిగారికికూడ తెలుసును. ఆతాలూకాకే అధికభాగము వస్తుంది. తరువాత పాలకొండ తాలూకాలో దక్షిణఖండమునకుకూడ రావటానికి అవకాశము ఉన్నది. కాబట్టి నందివాడవద్ద కట్టినట్లయితే ఆతాలూకాకంతటికినీ ఉపయోగపడుతుంది. ఇది గాకుండా చీపురుపల్లి తాలూకాలో Shermuhammadapuram firka లో గూడ నీరుసప్లయి కావటానికి అవకాశము ఉంటుంది. (interruption)

ఇది యేదో రాజకీయ కక్షలతో చెబుతున్నానని అంటున్నారు కాని అది నిజము కాదు. మంత్రిగారు వెళ్లి స్వయముగా చూడవచ్చును. నిజానిజములు తెలుసు కోవచ్చును.

THE HON. SRI N. SANJEEVA REDDI :—నారాయణపురం అని, నందివాడ అనేవాదనలో, యీప్రాజెక్టును నిర్ణయించడము అయింది. అందుకు ప్రారంభించవలసివచ్చింది. ఏదో ఒకటి ఆరంభించాముకదా ! అది పూర్తికానివ్వండి. అంతేకాని దానిని ఇప్పుడు మానివేసి, యీ పోటీలు అన్నీ తీర్చుతూ కూర్చుంటే, యీ రెంటిలో ఏదీగూడ రాకుండాపోవడము తటస్థిస్తుంది. ఈ తగాదాలవల్ల ఒక సారి యీ నారాయణపురము ఆనకట్టకు ప్రమాదమువచ్చింది. దానిని ఏదో విధముగా తప్పించుకోగలిగాము. కాబట్టి ఇప్పుడు నారాయణపురము కట్టు తున్నారు కాబట్టి ఇక నందివాడ రాదు అని అనుకోనక్కరలేదని అంటున్నాను. నారాయణపురము పూర్తికాగానే, నందివాడకూడ వస్తుంది.

SRI M. SATYANARAYANA RAJU :—నందివాడ వస్తుందని మంత్రిగారు చెబుతున్నారు. చాలా సంతోషము... తరువాత [illegible]

కెనాల్‌నుగురించి ఒకవిషయము చెప్పదలచుకున్నాను. ఈకాలవలో సిమెంటు కాంక్రీటు అనేది సుమారు మూడుకోట్లు ఖర్చుపెట్టి ప్రభుత్వముచేయిస్తున్నది. ఇది చేయించవద్దని నేను చెప్పడములేదుకాని, యీ సిమెంటుకాంక్రీటు ఎంతవరకు నిలుస్తుంది అనేది ప్రభుత్వము గుర్తించినట్లులేదు. ఇంత ఖర్చుపెట్టి యీ సిమెంటు కాంక్రీటు చేయించేబదులు పెద్దపెద్ద నదులలోఉండే బంకమట్టి అంటే alluvial soil ను యీ కాలువలో వేయించినట్లయితే water perculation కొంతవరకు తగ్గుతుంది, నీరుకూడ వృధాగాపోదు. ఈమట్టి మామూలుగా నూరుగజములకుగాని, రెండువందలగజాలకుగాని ఒకచోట protected walls కాలవలో కట్టినట్లయితే, యీ walls మధ్య అక్కడక్కడ యీ మట్టిని కుంభించినట్లయితే, water perculation తగ్గుతుంది. నీరుకూడ వృధాగా యింకిపోదు. ఈ విధముగా చేస్తే చాలా ఉపయోగముగా ఉంటుంది. కాబట్టి ప్రభుత్వము యిక మీదటనైనా యీ కాలవలో నేను చెప్పినవిధముగా చేయించటానికి ప్రయత్నించవలసిందని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఆ విధముగాచేస్తే, డబ్బుకూడ చాలా తక్కువ అవుతుంది. ఇప్పుడు వేసిన ఎస్టిమేటు ప్రకారము ఎంతోడబ్బు మిగులు-తుందిగదా!

తరువాత minor irrigation ను గురించి చెప్పాలంటే, మా జిల్లాలో మెట్టప్రాంతాలకు నీరు పారుదలకావటానికి నారాయణపురమునకు, క్రిలసకుకట్టిన కట్టల విషయములో యివి ఒకదానినుంచి ఒకటి చాలా దూరముఅయిపోయినవి. ముఖ్యంగా జమీందారీ ప్రాంతాలలో యిదివరకు కట్టిఉన్న కట్టలుఅన్నీ పోయినవి. వాటి రిపేరుకుగాను మేము యిదివరకే ఎన్నో విధములుగా మంత్రిగారికి చెప్పాము. ఎస్టిమేట్లు 1950-1951 నుంచిగూడ తయారుచేయబడినవి. అవి ఎంతవరకు శాంక్షను అయినవో తెలియదు. మా జిల్లాలో అక్కడక్కడ కొన్ని గడ్డలుకట్టబడిఉన్నవి. అవిగాక, అడసాకచానల్ అని ఒకటివున్నది. ఈ గడ్డలు సుమారు 20 సంవత్సరాలక్రింద కట్టబడినవి. అప్పుడప్పుడు పెద్ద పెద్ద వరదలు రావడమువల్ల ఆ గడ్డలు అన్నీకొట్టుకొనిపోయినవి. నీరు నిలవడములేదు. పంటలకు నీరులేక రైతులు నష్టపడుతున్నారు. మేము యీ విషయము ప్రభుత్వము యొక్క దృష్టికి ఎన్నోసార్లు తీసుకునివచ్చాము. కాని నలభైవేల రూపాయలకు estimates తయారైనప్పటికినీ యింతవరకు ఆ గడ్డ రిపేరుచేయించలేదు. తయారు కానూలేదు. ఈ గడ్డమీదనే ప్రభుత్వము కొంతసొమ్ముఅయినా ఖర్చుచేస్తే బాగుం టుంది. ఇదివరకు యీ గడ్డలు ఎందుకు కొట్టుకొనిపోయినవి అనేది విచారించలేదు. దానికి నివారణోపాయముగూడ ప్రభుత్వము ఆలోచించలేదు. ఎందుకంటే అడపాక ఛానల్ అనేది చాలా ముఖ్యమైనది. దానిక్రింద 2,500 ఎకరాలుసాగు కావటానికి

అవకాశము ఉన్నది. ఈ ఛానల్ మరమ్మతుచేస్తే, యీ 2,500 ఎకరాలు సాగుఅవుతుంది, ఈ ఒకటిఅయినా ఉన్నది అని ఆలోచిస్తే, వరదవచ్చినప్పుడల్లా మాటిమాటికి కొట్టివేస్తున్నది. ప్రభుత్వముఅయినా దీనికి కారణముయేమిటిఅని విచారించిందాఅంటే, అదికూడ కన్పించదు. దీనిమీద గడకంఛర అని ఒకటిఉన్నది. వానిమీదనైనా ఒకకట్టకట్టినట్లయితే, పైనుంచివచ్చే నీరుకు force తగ్గిపోయి, నీరు నిలవటానికి అవకాశము ఉంటుంది. హెచ్చుభూమికికూడ నీరుపారుదల కావటానికి అవకాశము ఉంటుంది. ఈ విషయము ఎన్నోసార్లు ప్రభుత్వానికి చెప్పాము. కాని డిపార్టుమెంటువారు ఉపేక్షచేస్తూ ఊరకున్నారు.

పులికిని నోటుపల్లిలో బిళ్లగడ్డ, కొండపాముగడ్డ అని రెండుగడ్డలున్నాయి. వీటికి 1951 లోనే 25600 అవుతుందని estimate లు వేయించారు అంచనా ఇదివరకేఉన్న కాలువమరమ్మతుచేస్తే వెయ్యి ఎకరాలు సాగవుతుంది. మేము deputation గా వెళ్లి చెబితే Public Works Department దగ్గరకు వెళ్లమంటారు. Public Works Department వారి దగ్గరకువెళ్లి చెబితే ఇంకా మాకు Orders రాలేదంటారు. చెప్పడమేకాని ఏమీపని జరగడంలేదు. దీనికి ఎకరం ఒకటింటికి లెక్కవేస్తే 25 రూపాయిలవుతుంది. ఇప్పుడు 1000 ఎకరాలమీద నీటితీరువా పోతోంది. వేగలియాగంగడ్డక్రింద 400 ఎకరాలు సాగవుతుంది. ఎకరం ఒకటికి 50 రూపాయిలు మరమ్మతు చార్జిక్రింద అవుతుంది. చీపురుపల్లిదగ్గర మందిరి వలపగడ్డఉన్నది. దానికి రమారమి లక్ష 50 వేల రూపాయిలు అవుతుంది. దీనికి వెర్లపాలెందగ్గర కట్టినట్లయితే 1500 ఎకరాలు సాగవడానికి అవకాశంఉంది. ఇవన్నీ పూర్వం ఉన్నవే. కాలవలు కొట్టివేసినవి. అవి మరామతు చేయమని చెబుతున్నాం. Government departments ని అడిగి ఆ లెక్కలుమీరు వేయించి చూడవచ్చును. లాపేరుఅని వెంకటాపురందగ్గర ఒకగడ్డ ఉన్నది. అది ఊటగడ్డ. నీరు ఎప్పుడూ పారుతూఉంటుంది. ఆ గడ్డకు కట్టినట్లయితే రమారమి 150000 రూపాయిలవుతుంది. రమారమి 2500 ఎకరాలు సాగవుతుంది. ఈ మెట్టప్రాంతాలలో పెద్ద ప్రాజక్టులు లేకపోయినప్పటికీ ఈ చిన్న చిన్న పనులు చేయిస్తే అక్కడి ప్రజలకు చాలా సదుపాయంగా ఉంటుంది. మేము అనేకసార్లు చెబుతున్నప్పటికీ Department వారు దానికితగిన దోహదం ఇవ్వడంలేదు. Minor irrigation కు Second Five year Plan లో రెండుకోట్లు ఇచ్చామన్నారు. గోదావరి, కృష్ణా. నాగావళి, వంశధార ఈ ప్రాంతాలుతప్ప, మెట్టప్రాంతాలు మూడూ, నాలుగు జిల్లాలకు సంబంధించినవి కేవలం ఈ Minor Irrigation మీదనే ఆధారపడినవి. ఈ 2 కోట్లతో ఇన్ని ప్రదేశాలకూ 5 సంవత్సరాలు ఎట్లా సర్దుతారో తెలియకుండాఉంది. ఇది ఒకజిల్లాకుకూడా చాలదు.

మొట్టమొదట minor irrigation కు ప్రాధాన్యతఇచ్చి, తరువాత Medium irrigation schemes కూ, తరువాత Major irrigation కూ ప్రాధాన్యత ఇవ్వాలి. ప్రభుత్వానికి ఖర్చుపెరగడమేకాని ఆదాయం తగ్గుతుంది. అందువల్ల ఈ మెరకప్రాంతాల అభివృద్ధికి ఈ Minor irrigation schemes కి 2 కోట్లు చాలవుకనుక 10 కోట్లయినా ఈ రెండో పంచవర్ష ప్రణాళికలో Allot చెయ్యాలని కోరుతున్నాను.

SRI PILLALAMARRI VENKATESWARLU:—అధ్యక్షా! రెండో పంచవర్ష ప్రణాళిక ననుసరించి ఈనాడు మన budget తయారుచేసుకోవడం జరిగింది. ఈ రెండో పంచవర్ష ప్రణాళికద్వారా మన స్కీములన్నిటికీ ఎక్కువడబ్బు కేటాయించబడుతుందని ప్రజలంతా ఆశించారు. కాని budget చూచేటప్పటికి దానికి విరుద్ధంగా కనిపిస్తోంది గతసంవత్సరం 7 కోట్ల 44 లక్షలు ఖర్చుపెట్టుకుంటే ఈ సంవత్సరం 5 కోట్లు 26 లక్షలుమాత్రమే మనం ఖర్చుపెట్టగలిగాం. దాన్నిబట్టి capital outlay లో ఎంతతగ్గిందో మనకు బోధపడుతుంది. పోనీ ఈ సంవత్సరం తక్కువఖర్చుపెట్టినా వచ్చే సంవత్సరమైనా ఎక్కువఖర్చు పెట్టగలమనే ఆశ ఎక్కడా కనిపించడంలేదు. ఎందువల్లననగా మన ముఖ్యమంత్రిగారు చెప్పిన ఉపన్యాసాలలో మన ఆదాయం బాగా పెంచుకుని మన project లకు ఖర్చుపెట్టుకునే స్తోమతు మన రాష్ట్రానికి వచ్చినప్పుడే మనం ఏమైనా చేసుకోగల్గుతాం అని అనేక సందర్భాలలో తెలియజేశారు. ఈ ఖర్చుపెట్టిన 5 కోట్ల 26 లక్షలు చాలా తక్కువ. ఈ అభిప్రాయం మన ఉపముఖ్యమంత్రిగారుకూడా వెలిబుచ్చారు. అందువల్లనే మన అభిప్రాయాలన్నీ కేంద్రప్రభుత్వానికి తెలియజేయవలసిన అవసరం ఉన్నది. కేంద్రప్రభుత్వం ఏవిధంగా ఆంధ్రరాష్ట్రాన్ని చిన్నచూపుచూచి నష్టం కలుగజేస్తున్న విషయంకూడా మనం కేంద్రప్రభుత్వానికి తెలియజేయవలసిన అవసరం ఉంది. మనం ఆర్థికంగా వెనుకబడియున్నాము. పారిశ్రామికంగా వెనుకబడియున్నాం. మనకి irrigation projects కట్టుకోడానికి ఎన్నో జీవనదులూ, నీటివనరులూ ఉన్నప్పటికీ వాటిని మనం ఉపయోగించుకునే ఆర్థిక స్తోమతు మనకు లేదు. నిజంగా చూస్తే దేశం అంతటికీ ఆహారపదార్థాలు ఒక్క ఆంధ్రదేశమే supply చేయగల స్థితిలోయున్నది. ఆంధ్రదేశానికి అంత నీటివసతియుంది. ఈ నీటివసతులన్నీ develop చేయడానికి కేంద్రప్రభుత్వం మనకు సహాయం చేయకుండా ఏదో నాగార్జునసాగరు వంటి ఒక project కు ఒకకోటి 80 లక్షలు ఇచ్చి మీరు project కట్టుకోండి అంటే ఇది ఎంతవరకూ చాలుతుంది. ఈడబ్బు ఒక 2 నెలలో 3 నెలలోనో ఖర్చయిపోతుంది. ఇది ప్రజలలో చాలా అసంతృప్తి కల్గజేసింది. కేంద్రప్రభుత్వంమీద తీవ్రమైన ఒత్తిడితీసుకువచ్చి మనవంతు ఎక్కువ కేటా

యించేటట్లు మనం ప్రయత్నం చేయవలసిన అవసరం ఉంది. తుంగభద్ర High level canalని గురించి ఉపముఖ్యమంత్రిగారు చెప్పారు. ఈమధ్య Mysore ప్రభుత్వం ఏదో ప్రకటించినట్లు పత్రికలలో పడింది. తప్పంతాకూడా ఆంధ్రప్రభుత్వంమీద మోపింది. దానికి సంజీవరెడ్డిగారు తమ సమాధానంలో జవాబుచెబుతారని ఆశిస్తున్నాను. ఏమైనప్పటికీ ఈ కాలువ నిర్మాణంపై పూర్తి అధికారం మనకు వచ్చేటట్లు bill లో provide చెయ్యాలని మనం demand చేయవలసిన అవసరం ఉన్నది. దాని నిర్వహణబాధ్యతకూడా ఆంధ్రప్రభుత్వానికే ఉండాలి. దానికి ఈ బడ్జటులో కేటాయించక పోయినప్పటికీ, supplementary demand ద్వారానైనా provide చేసి, ఆపని వెంటనే ప్రారంభించవలసిన అవసరం ఉంది. తుంగభద్ర High level channel యొక్క ప్రాముఖ్యత, ప్రాధాన్యత మనమే కాకుండా దేశమంతా గుర్తించింది. ఇది ఈ పాటికే పూర్తికావలసింది. ఇప్పటికీకూడా ప్రారంభించలేకపోయాం. ఏదో ఒకకోటి 80 లక్షలిచ్చి మనకళ్ళ నీళ్లుతుడవడానికి కేంద్రప్రభుత్వం చూస్తే, మన rights కోసం గట్టిగా నిలబడవలసిన అవసరం ఉంది. ఈబడ్జటు frame చేయడంలో ఈ irrigation sources, maintenance and repair కి చాలాతగ్గించడం జరిగింది. ఇదిచాలా ప్రమాదం. దుబారాఖర్చు తగ్గించుకోవాలిగాని, ఏ కాలవలు గండ్లుపడినప్పుడు మనం డబ్బులేదని మొదలకుండాకూర్చుంటే ఎంత హాస్యాస్పదమో మంత్రిగారు గుర్తించాలి. ఈ బడ్జటులో Irrigation Demand చూచినప్పుడు, major irrigationకూ, minor irrigation కూ కేటాయించిన మొత్తాలుమాస్తే, కొన్ని works ప్రారంభించారు budget లో amount of estimates అనివేశారు. వేసినతరువాత దాన్ని take up చేయలేదో మధ్యలో ఆపేశారోకూడా తెలియడంలేదు. ఈ సంవత్సరం ఏమీ provide చేయలేదు. దీనికి డబ్బు కేటాయించకుండా ఏ విధంగా ఖర్చుపెట్టగల్గుతారో నాకు బోధపడడం లేదు.

జిన్నూరు ఛానల్ రీ మాడలింగ్ స్కీముకు రూ. 23,000 శాంక్షను చేసి రూ. 4,501 ఖర్చు పెట్టినారు. ఏరవరం పంపింగ్ స్కీముకు, రూ. 5,550 శాంక్షన్ చేసినారు. అది give-up చేసినారేమో తెలియదు. అదేవిధముగా కలమపూడి భూములకు, ఇరిగేషన్-ఫెసిలిటీస్‌కుగాను లక్ష రూ. 1,70,000 ఖర్చు కావలెనన్నారు. రూ. 9,557 మాత్రం ఖర్చుచేశారు. ఆవిధంగా ప్రారంభించినది పూర్తి చెయ్యలేకుండా పోతున్నాం అని తెలుస్తుంది. అట్లాకాకుండా ప్రారంభించిన వాటిని పూర్తిచేయడానికి పూనుకొనవలెను. శాంక్షన్ మాత్రం ఉంటుంది గాని ఖర్చు పెట్టడం మాత్రం జరుగలేదు. 1954-55 లో గోరింకఛానల్, దాని బ్రాంచీలుకోసం రూ, 20,753 ఖర్చుపెట్టారు. నేను ఇప్పుడు చదివినది పాతవి

కాదు. 1950-51-52 వే. 1943 నుంచి అనేక స్కీములు లగుపడుతున్నవి. ఇప్పటి వరకు ఇరిగేషన్ ఫెసిలిటీస్ లేని ప్రాంతాలకు ప్రాముఖ్యం ఇస్తూ వచ్చాం. మేజరు మైనరు ఇరిగేషన్-స్కీములకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వవలెను. కృష్ణా జిల్లాలో నందిగామా తాలూకాలో కొజవరం 99 సంవత్సరాల లీజుకు తీసుకొన్నారు. 1945 నుండి పేచీగా ఉంది ఆగస్టు 11,1953లో రూ. 21,000 ఆనకట్ట రిపేరుకు గాను శాంక్షన్ చేశారు. ఇది చాలా చిన్న ప్రాజెక్టు. 400 గానీ, 500 గానీ, ఎకరాలు సాగుకావచ్చును, flood వస్తే భూములు కొట్టుకుపోతు ఉంటవని అనుకున్నారు. ఖర్చు మాత్రం వ్రాశారుగానీ పని ఏమీ జరుగలేదు. ఆనకట్ట రిపేరు కూడా చేయలేదు. 1953 అక్టోబరులో ఇందుకని రూ. 32,000 శాంక్షన్ చేశారు. 1955-56 లో బ్రిడ్జీలకు రూ. 10,000 చేశారు. అనకట్టు రిపేర్పు ఆగిపోయినవి. ఎందుకు neglect చేశారో తెలియదు. దీనిని వెంటనే మంత్రిగారు పరిశీలించవలెను. బడ్జెటులో లేకపోయినా చిన్న మొత్తం రూ. 50,000 కంటె ఎక్కువ ఉండదు కాబట్టి ఈ సంవత్సరం provide చెయ్యకపోవడం నిరుత్సాహంగా ఉన్నది. ఇది పరిశీలించవలెనని మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను. రెండు సంవత్సరాలలో ఐదుకోట్ల రూపాయలు ఖర్చుచేసినామని మంత్రిగారు చెప్పారు. కేంద్ర ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకువచ్చామన్నారు, గానీ మదరాసుకు ఇరిగేషన్ పద్దు క్రింద ఎక్కువ ఇచ్చారు. Capital outlay on irrigation పద్దు క్రింద సుమారు ఐదుకోట్ల తొంభై మూడు లక్షలు వారికిస్తే మనకు ఐదుకోట్ల నలభై లక్షలు మాత్రమే ఇచ్చారు. ఎలక్ట్రిక్ వర్క్సు విషయంలోకూడా తక్కువ ఇవ్వడం జరుగుతున్నది. దీనిని అరికట్టవలసిన అవసరం ఉంది. ఇది ఫైనల్ కాదు. కేంద్ర ప్రభుత్వంమీద ఒత్తిడి తీసుకువచ్చి ప్రాజెక్టులను పూర్తిచేసుకొనవలెనని చెబుతూ నేను విరమించుకొంటున్నాను.

SRI B. RAMAKRISHNA REDDI .—అధ్యక్షా, ఇరిగేషన్ గురించి కొన్నివిషయాలు తెలుపవలెనని అనుకొన్నాను. ఇరిగేషన్‌పాలసీగురించి ఏమి నిర్ణయం కనబడలేదు. లెజిస్లేటర్లను పిలిపించి వారిని ఇరిగేషన్ విషయములో కనుక్కొనవలసినదని అనుకొన్నాను. ఇది చాలా ప్రధానమైన విషయం కాబట్టి ప్రతి జిల్లా లెజిస్లేటర్లతోను ఈ ప్రకారముగా చేయవలెనని ఒక్కొక్క పాలసీ క్రింద నిర్ణయం చేసుకొనవలసిఉంటుంది. -మా రైతాంగము అని చెప్పుకోవడమే గానీ ప్రభుత్వం వారిని గురించి చాలా నిర్లక్ష్యంగానేఉంది. ఏవో నందికొండ మొదలైన పెద్ద ప్రాజెక్టులు ఏర్పాటుచేసినాము ; మీరు సరిపెట్టుకొనండి అంటే రైతాంగం సరిపెట్టుకోదు. ఒకే ప్రదేశానికి ప్రాజెక్టులు నిర్మిస్తే మిగతా ప్రదేశాలలో రైతాంగం తమకు ఇరిగేషన్ ప్రాజెక్టులు కావలెనని అంటూ ఉంటుంది, మన

గోపాలరెడ్డిగారి ప్రభుత్వం ఎంతసేపు stagnation అని అంటూఉన్నది; ఇరిగేషన్ క్రింద ఖర్చుఏమీ కనబడదు. పన్నులుమాత్రం వసూలుచేస్తున్నాము. సర్చార్జి వేస్తున్నాము. భరించవలెనని రైతులకు చెప్తున్నాం. అంతేగాని రైతాంగానికి చిన్న ఇరిగేషన్ స్కీములు చేస్తామఅనే ప్రశ్న కనబడలేదు. మా మా ప్రదేశాలలో మీరు ఏమిచేసినారు అనేదే ప్రధానప్రశ్నగాఉంది. మేము పర్యటనలకు పోయి నప్పుడు ఇరిగేషన్ పనులుగురించి ఏమిచేస్తున్నారని అడుగుతున్నారు. నిరుత్సాహ కరమైన situation గా ఉన్నది. మీ మీ ప్రదేశాలలో ఇది చేసినామని అన డానికి వీలు లేకుండాఉంది. పన్నులుమాత్రం ఎక్కువ వేస్తున్నాం. ఫలానా ఇరిగేషన్ పనలు చేయించినామని చెప్పడానికి వీలులేకుండాఉంది. ఇరిగేషన్ గురించి రెండుకోట్లు మీరు ఇచ్చారు. ఇది నిజముగా ఒకజిల్లాకుకూడా సరిపోదు. వెనుకబడిన జిల్లాలకు ఏమీ కనబడలేదు. మనము లెజిస్లేటర్లుగావచ్చి కూర్చొని సర్చార్జి మీనెత్తిన వేయమని చెప్పడానికిమాత్రం కూర్చున్నట్లు ఉన్నది. నేను ఆ వేదనతో ఈ విధముగా తెలియచేస్తున్నాను.

మా constituency లో 10 సంవత్సరాలనుంచి కరువుతో నిరుత్సాహంగా ఉన్నారు. ప్రజలు కొంతమంది వలసపోతున్నారు కావలి స్కీముఒకటివేసి నెర వేరుస్తామని అన్నారు. నిరుడు నిర్ణయంకూడా అయినది, జరగబోతూఉన్నదని అన్నారు. కానీ ఇది ఇంకా నెరవేరలేదు. మిగతా ప్రదేశాలలో చిన్న ఇరి గేషన్ పనులుఉన్నవి. ఇదంతా మనసులో పెట్టుకొని ఢిల్లీప్రభుత్వంనుండి కొంత డబ్బు తెచ్చుకొనవలెను. లేకపోతే రైతాంగం పదిలక్షలు ఐనా చెల్లించడానికి రెడీగాఉన్నారు. బెటర్మెంటు పన్నువేసినా చెల్లిస్తారు, రూ 150 వేసినా చెల్లిస్తారు. 10 సం॥ నుంచి రైతాంగం కష్టపడుతూఉన్నారు. మీరు ఏమిచేయలేక పోతూ ప్రభుత్వంలో కూర్చుని ఈ ప్రకారంగా వదులుబడి ఉన్నది, ఈ ప్రకా రంగా ఖర్చున్నది. కాబట్టి సర్చార్జి వేస్తున్నాము, భరించవలెనని అంటే ఇది ప్రజాప్రభుత్వం అని అనిపించుకొంటుంది అని చెప్పడానికి వీలులేకుండా ఉన్నది.

నాగార్జునసాగరుకు చేసేఖర్చులో, నిజంగా ఏ పదవవంతుఅయినా వెనుకబడిన ప్రదేశాలకు ప్రభుత్వం ఏర్పాటుచేసినట్లయితే 5 ఏండ్లకల్లా మన ఆంధ్రదేశం అంతా సాగుకులాయికై సస్యశ్యామలం అయిపోతుంది. మంత్రివర్గం ఎందుకు ఆ ప్రకారంగా ఆలోచించకుండా ఉన్నదో నాకు తెలియటంలేదు. Legislators పిలిపించి, "మీ కేమి చేయమంటారండీ, మీకేమైనా పనులున్నాయా" అ నేవికను క్కొని రెండులక్షలరూపాయలనుండి పదిలక్షల రూపాయలలో పూర్తయ్యే కొన్ని పనులను నెరవేర్చినట్లయితే Legislature కు, రైతాంగానికి ప్రభుత్వం ఎంతో

మేలుచేసినట్లు అవుతుంది. ఒకే ప్రదేశంలో ఒకస్కీముమాత్రం ఏర్పాటుచేసాము. అది పెద్దస్కీముఅని అంటే" మిగతా ప్రదేశాల వాళ్లుఅంతా "మీరు మాకు నిజమైన సహాయము చేశారా ?" అని అంటారు. మీరు ఒకప్రదేశానికి మాత్రం చేసినట్లవుతుందా ? అక్కడి ఉత్పత్తిఅయిన ధాన్యాదులను మిగతా ప్రదేశాలకు పంపిస్తారా ? Production కొరకే అయితే ఆ విధంగా ఏర్పాటు చేయవలసిందే కాని, రైతాంగానికి ఇది ప్రధానమైనదా ? అని అనిపిస్తుంది. చిన్న irrigation పథకాలైతే మా ప్రదేశాలకంతా మేలుచేశారనుకోవటానికి వీలుంటుంది. అలాచేసినట్లయితే రైతాంగం surcharge వేసినా భరిస్తారు, Betterment tax అయినా భరిస్తారు. అట్లాకాకుండా ఒకే ప్రదేశంలోమాత్రం ఏర్పాటు చేశాము, మీరు కొన్నిఏండ్లపాటు ఆగండి అని అంటే అది చాలా నిరుత్సాహమైనమాట. ఆ ప్రకారంగా వాళ్లు wait చేయలేరు. Big schemes అంతా కూడా ఏ 10 ఏండ్లకో యింకా పైననో, ఎప్పుడు పూర్తవుతాయో మనకు తెలియదు. చిన్నవైనట్లయితే 2 ఏండ్లకు పూర్తికావటమే కాకుండా రైతాంగానికి చాలా మేలు చేకూర్చగలవు అని నేను అభిప్రాయపడుతున్నాను. ఈనాటికి అయినా మన ప్రభుత్వం Legislator ను పిలిపించి, కనుక్కొని, Delhi ప్రభుత్వంవద్ద 10 కోట్లో 15 కోట్లో అడిగి ఏర్పాటుచేసినట్లయితే ఇది మనం నెరవేర్చినాము అని అనుకోవడానికి వీలుకల్గుతుంది. ప్రభుత్వం నిర్ణయప్రకారమే పనులకు పూనుకోవాలిఅంటే మన Legislators కు అది చాలా నిరుత్సాహకరమైనపని. నిజంగా కూడా తప్పు అనుకోనేవాడిని నేను. ప్రజాప్రభుత్వంలో Legislator ను కనుక్కోవడం, అంటే ఒకపార్టీఅని నేను అనను, అన్నిపార్టీల Legislator ను పిలిపించి Irrigation న్ను గురించి మీకేమి చెయ్యమంటారు." అని వారి అభిప్రాయాల సంగ్రహించి ఆ ప్రకారం పనులుచేస్తే మంచిది.

అల్లాంటి నిర్ణయానికిరాకుండా, గోపాలరెడ్డిగారు డబ్బు, డబ్బు అని అంటారు. డబ్బును ఎక్కడనుంచి తేవడం? డబ్బు ఉందనుకుంటే ఉంది లేదనుకొన్నట్లయితే, నిజంగా లేనేలేదు. రైతాంగం ఆడబ్బును అంతాకూడా భరిస్తుంది. Irrigation విషయమై మీకు డబ్బు లెక్కలేకుండా వస్తుందని నేను మనవిచేస్తున్నాను. డబ్బు ప్రస్తావనతో అన్ని పనులను నిలిపివేసి, మేము మా వీలునుబట్టి చూచుకొంటాము; ఏదో కొంత ఖర్చు చేస్తాము అంటే అది సక్రమమైన పద్ధతికాదు. డబ్బు ప్రస్తావన కన్నా, నెరవేర్చాలన్నది, "Push on" అని అనుకోవాలనేగాని, "డబ్బును మేము ఖర్చుపెట్టుకొంటాము. కొన్ని మరమ్మత్తులు మాత్రం చేస్తాం సరిపెట్టుకోండి అని అన్నట్లయితే రైతాంగం అంతా చాల నిరుత్సాహపడుతారనకొంటాను. ఇదికాక ఈ Irrigation వ్యవహారంలో corruption గురించికూడా కొంత తెల్పుప

వలసియున్నది. ఇప్పుడు corruption విశేషంగా ఉందనుకోవాల్సిందే. మన ప్రభుత్వంలో కొంత సర్దుబాటు అయిందనుకోవాల్సిందే కానీ మిగతా ప్రదేశాలలో దానిని ఇంతవరకు నిలుపడానికి ప్రయత్నాలు జరుగుతాయే ! ఇది మాత్రం పూర్తిగా నిర్మూలించాలి. Corruption న్ను తొలగించే దానికి Minister ను ఏర్పాటు చెయ్యాలని నేను భావిస్తున్నాను. Corruption ను తొలగిస్తేనే అది నిజమైన పరిపాలన అనిపించుకొంటుంది. Corruption పెట్టుకొని మనం పరిపాలనసాగిస్తే మనం ఖర్చుచేసే డబ్బు అంతా వృధా అయిపోతుంది. Corruption అన్నది collectorate లో ఉన్నది. అన్ని ప్రదేశాలలో ఉన్నది. ఏదో కొంత ఖర్చు చేస్తున్నామని అనుకోకుండా దీన్ని తొలగించటానికి ప్రత్యేక నిర్ణయం తీసుకోవలసింది ముఖ్యం అని నేను అభిప్రాయపడుతున్నాను.

Sri P. RAMASWAMY NAIDU :—అధ్యక్షా మహాశయా ! ఈ నీటి పారుదల విషయమైనటువంటి అభ్యర్థనలో Irrigation Demand ను నేను బలపరుస్తూ ఒకటి రెండు విషయాలు చెప్పదలచుకొన్నాను. ఈ నీటి పారుదల విషయంలో దీర్ఘకాలిక ప్రణాళికలు, అల్పకాలిక ప్రణాళికలు, (Long range schemes and short range schemes) అని రెండున్నాయి. వీటిలో దీర్ఘకాలిక ప్రణాళికల గురించి కోటాను కోట్లు లక్షోప లక్షల రూపాయల వ్యయము చేయడానికి పూనుకొనినట్లు ఆయవ్యయ పట్టికలో కనబడుచున్నది. అల్పకాలిక ప్రణాళికలకు అత్యల్ప ధనాన్ని కేటాయించినట్లు నిరూపణ అయి ఉన్నది. ముఖ్యంగా ఆలోచించవలసినది ఏమిటంటే ప్రస్తుతము, సద్యో ఫలితము కలిగేటటువంటి పనులను నిర్మాణంచేసి సాధ్యమైనంత త్వరలో పూర్తిచేయించడం, వాటి ద్వారా ప్రజలకు క్షేమం కల్గించడం ప్రభుత్వం ధర్మం. కనుక దీర్ఘకాలిక ప్రణాళికలకంటే అల్పకాలిక ప్రణాళికలను ముందుగా ఆచరణచేసి దేశానికి సౌభాగ్యం కల్గించడం ప్రభుత్వంయొక్క కనీస ధర్మమని నేను హృదయ పూర్వకంగా మనవిచేస్తున్నాను. లఘుమూలం మహోదయం రామాయణంలో వాల్మీకి వారు చెప్పిందేమిటంటే, భరతుడు శ్రీరామచంద్రమూర్తి దగ్గరికివచ్చినప్పుడు, శ్రీరామచంద్రమూర్తి ఆయనకు రాజనీతి బోధించే సందర్భంలో వారేమన్నారంటే కచ్చిదర్థం వినిశ్చిత్య లఘుమూలం మహోదయం క్షిప్రమారభసే కర్తుం నదీర్ఘయసి రాఘవ॥ భరతా నీవు లఘుమూలం, కొద్ది పెట్టుబడితో, మహోదయం ఎక్కువైనటువంటి లాభం కలిగించేటటువంటి పనులు చేస్తున్నావా లేదా ? అలాగు నిశ్చయించిన కార్యాన్ని త్వరగానే నీవు ప్రారంభించి ముగిస్తున్నావా, లేదా ?

మనం నేడు కొద్ది పెట్టుబడితో ఎక్కువ లాభం వచ్చేటటువంటి పనులను అమలుపరచి దేశానికి వెంటనే క్షేమం కలిగేటటువంటి ఉపాయం అన్వేషించడం పరమ ధర్మం కనుక యీ దీర్ఘకాలిక ప్రణాళికలకంటె అల్పకాలిక ప్రణాళికలు (short range schemes) నే ఆచరణలో పెట్టడం ప్రభుత్వంయొక్క పరమ ధర్మం అని నేను పదేపదే మనవిచేస్తున్నాను. ఇప్పుడు మన ప్రభుత్వం దీర్ఘకాలిక ప్రణాళికల క్రింద కోటాను కోట్లు వ్యయంచేయడానికి ఆయవ్యయ పట్టికలో సూచించివున్నది. ఎప్పుడో ఏనాడో మరి పదేళ్ళకో ఇరవై ఏళ్ళకో ఫలితం కలిగించే పనుల నాచరించడంకంటె నేను మొదట చెప్పినట్టుగా ఈ అల్పకాలిక ప్రణాళికలకే మనం ఎక్కువయినటువంటి ప్రాముఖ్యం యివ్వవలసినదని, నాగార్జున సాగర్ అనేటటువంటిది మహోత్కృష్టమైనటువంటిది, పెద్ద విషయంకాదని అనడానికి ఎవరూకూడా ఒప్పుకోరు, ఆ మహోత్కృష్టమైనట్టి పెద్ద పనులను కొంత సావకాశంగా ఉంచి యీచిన్న ప్రణాళికలనే గట్టిగా పరిశ్రమచేసినట్లయితే సద్యః ఫలితం కలుగుతుంది. High level channel అనేటటువంటి పెద్ద పెద్ద భగీరథ ప్రయత్నాలు చేయడం అనేట్టువంటిది చాలా కష్టసాధ్యమైనటువంటిది. అందులో మనరాష్ట్రంలో ఆర్థికంగా లోప భూయిష్టమైన యీ తరుణంలో మనకు డబ్బు లేనటువంటి యీ కాలంలో కోటాను కోట్లు లక్షోప లక్షలు వ్యయంచేసి దానికి అనేక బాధపడడంకంటె తక్కువ వ్యయంతోటి ఎక్కువలాభం కలిగే పనుల మీద నే దృష్టి కేంద్రీకరించవలసినదనీ నేను వినయ పూర్వకంగా మనవిచేస్తున్నాను. అసలు పూర్వం మనవారు ఏపని చేసినప్పటికీకూడా తక్షణ ప్రయోజనం కలిగేటటువంటివి చేసేవారు. అట్టిదానికే మనం పూనుకోవాలి. అల్పకాలిక ప్రణాళిక క్రింద మనం ఎక్కువగా పరిశ్రమ చేయడం అవసరం. అసలు నదీ మాతృకం అనీ, దైవ మాతృకం అనీ రెండురకాలు నీటిపారుదల, దైవ మాతృకం అంటే దేముడిచ్చిన వర్షరూపేణా వచ్చిన వాటిని ఉపయోగించుకునే పద్ధతి పూర్వం ఉండేది. నదీమాతృకమంటే నదులలోని నీటిని కాలువలద్వారా పారించి దానివల్ల నిశ్చయమైనటువంటి పంటలు పండించే రోజులివి. ఇప్పుడటువంటి అవకాశం వున్నది. అందరూ దానిని కోరుతున్నారు. కాని అన్ని ప్రదేశాలకు ఒకేసారి నీటిపారుదల చేయడం కష్టసాధ్యం. దాని కనేకకోట్ల రూపాయలు ఖర్చుచేయవలసి వుంటుంది. అవి క్రమేణా జరుగుతూవుంటాయి. ఇప్పుడు మనం చేయవలసినదేమిటంటే, Minor irrigation క్రింద చిన్న చెరువులు, వాగులు మరమ్మత్తులు చేయించి వున్నవానిని బాగుచేసుకుంటే చాలు. "మొదటిదానికి మొగుడులేదు, కడదానికి కళ్యాణం" అనట్టు మొట్టమొదటున్నటువంటిదానిని మనం బాగుచేసుకుని పునర్నిర్మాణంచేసి దానికి నీటి పారు

దలవున్నటువంటి సౌకర్యం మఱమ్మత్తుచేసి చెరువులు నింపించి దానిమూలంగా అక్కడున్న భూములకు నీరుపారించి సుభిక్షంగా దేశాన్ని చెసుకోవచ్చు. అందుకు మీయొక్క దృష్టిని కేంద్రీకరించమని ఉపముఖ్యమంత్రిగారిని ప్రార్థనచేసి చెబుతున్నాను. పూర్వం ఒక్కవానతోనే ప్రజలు సంతృప్తిపడేవారు. అయితే ఆనాటినుంచి రాజులు, జమీందారులు వుండేవారు, ప్రజారంజేతిరాజా, ప్రజలను రంజింపచేయువాడు రాజు అని శాస్త్రం. ప్రజలను రంజింపచేయునట్టివాడు రాజు సార్థకనామములైన రాజులు, చక్రవర్తులు, జమీందారులు సాగరములవంటి చెరువులు వాగులు త్రవ్వించి నీళ్లు కల్పించినారు. వారు. మంచిమంచి చెరువులు త్రవ్వించి ఉన్నారు. కాని నేడు ఆ చెరువులు, ఆక్షేత్రాలు నాశనం అయిపోయినాయి

SRI S. BRAHMAYYA.—ఇపుడా రాజులులేరు.

SRI P. RAMASWAMY NAIDU.—లేరనే చెప్పాను. ఇప్పుడు మన schemes ప్రణాళికలు చూస్తాంటే మెట్టప్రాంతాలలోకూడా పల్లపు వ్యవసాయం చేయడానికి పెద్ద పెద్ద ప్రణాళికలు వేసేప్రయత్నం చేస్తున్నట్టు కనపడుతుంది. ఏ వ్యవసాయానికి ఏది యోగ్యమో దానిని ఆలోచించి మనం పరిశ్రమించి నీటిని కట్టడానికి నిర్మాణంచేయాలి. మెట్టప్రాంతంలో వరి పండించాలి పల్లపు సాగువేయాలనే సంకల్పం వున్నదే అది అసహజమేమోనని నా అనుమానం. ఏ వ్యవసాయానికి ఏది అనుగుణమో ఏది పనికివస్తుందో ఆ ప్రాంతంలో ఆ పని చేయించినట్లయితే బాగుంటుంది కాని ప్రతిచోటా నీరు కావాలని నీరుచేతనే పల్లపు పంట పండించాలనే భావం పెట్టుకుంటే వరిపంట అత్యధికం అయినాయి—అతి సర్వత్రవర్జయేత్ అన్నట్లు—ఇప్పటికే 5 లక్షల టన్నుల ధాన్యం ఉత్పత్తి మన అవసరాలకు మించినది వున్నదని లెక్కలు బుజువుచేస్తున్నాయి. కనుక యీ వరి పంట ఎక్కువగా పండించి వాటికి ధరలులేకుండాచేసి రైతులకు గిట్టుబాటులేకుండా చేయడంకంటె ఈ మెట్టభూములలో సాధారణంగా ఈవాణిజ్య పంటలను—అనగా పసుపు, చెఱకు, గంటి, ఉల్లి, మిరప యిటువంటి డబ్బు వచ్చేపంటలను పండించి దేశానికి ధనం ఎక్కువవచ్చే పంటలను పండించితే బాగుంటుంది. కాని అన్నిచోట్ల వరిపంటలు పండించి దేశానికి సౌభాగ్యంలేకుండా చేయడం ధర్మంకాదనికూడా మనవిచేస్తున్నారు. అయితే ఒకప్పుడు మన ఉపముఖ్యమంత్రిగారు శ్రీకాకుళం వచ్చినపుడు బహిరంగసభలో చెప్పారు. ఒకవేళ కొందరు ఎవరైనా ప్రశ్నవేయవచ్చునని Project లు ఎక్కువయినప్పుడు పంటలెక్కువయినప్పుడు అత్యధికంగా ధాన్యాలుంటున్నప్పుడు ధరలులేక బాధపడలేరండీ అంటే వారు ఏమిసమాధానం చెప్పారంటే ప్రపంచంలో సుభిక్షంకావాలి; అందరికీ

కొనడానికే కాకుండా, మత్స్య పరిశ్రమకుకూడా బాగా ఉపయోగపడుతాయి. చాలా పెద్ద పెద్ద చెరువులు ఉన్నాయి. వాటిలో మత్స్యములను పెంచినట్లయితే ప్రతి గ్రామమునకు ఆ చెరువులమీద యేటా 4,5 వేలు ఆదాయము వస్తుంది. ఉపముఖ్యమంత్రిగారు కరుణించి ఈ చెరువుల మరమ్మతులు ఎంత శీఘ్రంగా చేయించినట్లయితే, వాటిల్లో మత్స్య పరిశ్రమకు అవకాశాలు కలుగజేసినట్లయితే, ఎంతకాలమునుంచో కలలు కంటున్నటువంటి గ్రామ స్వరాజ్యము అనేది సార్థకము అవడానికి అవకాశము ఉన్నదని మనవిచేస్తున్నాను. గ్రామ పంచాయితీలకు ఆ గ్రామంలో ఉన్న చెరువులమీద అధికారము ఇచ్చినట్లయితే ఎప్పటికప్పుడు వాటిని వారే బాగుచేయించుకోవడానికి అవకాశము ఉంటుంది.

ఇంతకుముందు మంత్రిగారు తమ ఉపన్యాసములో చెరువులన్నింటికి తూములు లేకపోవడమువల్ల, నీరు పారించుకొనటకు, చెరువుగట్లను త్రవ్వుతున్నారని అందువల్ల ఆ గట్లు పాడైపోతున్నాయని చెప్పారు. అది యదార్థమైన విషయమే. వాటిని బాగుచేయిస్తామనికూడా మంత్రిగారు సెలవిచ్చారు, అందుకు సంతోషించవలసి ఉన్నది. దీనిని అతి శీఘ్రంగా చేయిస్తారని నమ్ముతున్నాను.

5, 6 నెలల క్రింద Tank Restoration Schemes జిల్లాలలో కొన్ని division లలో పెట్టారు. అక్కడ పనిచేయుటకుగాను, ఒక ఇంజనీరును, 4,5 గురు ఓవర్సీర్సును వేస్తున్నారు. వారు ఆ చెరువులన్నీ తనిఖీచేసి ఆ చెరువు ఎంత నీరు పట్టడానికి అవకాశము ఉన్నది, దీని వాలు ఎట్లాయున్నది, దీనికి వచ్చే నీటి సరఫరా ఎంత ఉన్నది అదంతా వారు చూస్తారు. అది చాలా అల్పవిషయం. అయినప్పటికి బొబ్బిలి తాలూకా అంతా చేయవలయునంటే 100 యేండ్లకుకూడా వారు ఎట్టి మేటు చేయలేరు. ఎన్నో వేలకొలది చెరువులుఉన్నాయి. కాబట్టి ఆ సిబ్బందిని హెచ్చుచేసినట్లయితే ఆ స్కీము సార్థకము అవుతుంది.

ఉపముఖ్యమంత్రిగారి ఆధ్వర్యములో చేసిన పనులను గురించి నేను చెప్పలేదు. అది చెప్పుట నా విధ్యుక్త ధర్మము. వారు ఈ శాఖకు మంత్రిగాయుంటూ అనేక మహత్తరమైన పనులు చేస్తున్నారు. బ్రిటిష్ ప్రభుత్వములో 15 సంవత్సరములలో జరిగినటువంటి పని, సంయుక్త మద్రాసు రాష్ట్రములో 6,7 సంవత్సరములలో జరిగిన పని, వారు వచ్చిన తరువాత వాటిని 2 యేళ్లలో నిర్వహించారు కనుక వారి అభినందించవలసి ఉన్నది. ఎప్పుడూకూడా ఒకరిని ఒకరు విమర్శించడం తేలిక. పని చెప్పడం చాలా సులభము, చేయడం చాలా కష్టం అవుతుంది. రైతులకు ప్రాణాధారము నీరు గనుక, దేశముయొక్క క్షేమంకొఱకు, నీటిపారుదల ఏర్పాట్ల

యందే మంత్రిగారు దృష్టిని కేంద్రీకరించి రైతుల క్షేమంకొఱకు ఎక్కువ కృషి చేయాలని కోరుతున్నాను. ఈ విషయంలో—

మ॥ పరిపాలించుటలోని పీడనము లంబాళ్ళాత్యులీ యాంధ్రులన్
చిర మూర్ఛాయుతులట్లు చేయఁగను సంజీవింపఁగాజేసితి
జ్వరితన్ మాన్పి స్వరాజ్యమంది మహిమన్ ధాన్యంబు తూలించుటన్
చరితార్థంబగు నీదు నామమిలలో సంజీవరెడ్డి ప్రభూ ॥

మ॥ చిరకాలంబునకున్ ఘటించె మరలన్ శ్రీ రెడ్డి సామ్రాజ్యమీ
ధర, శ్రీనాధుని నాటికన్న మహిమందాఁగాంచి యాంధ్రం బువి
స్తరతం గాంచకయుండఁగానగునే శ్రీ సంజీవరెడ్డి ప్రభన్
మరలింపదగదే భవద్వశము వేమారెడ్డి సత్కీర్తులన్ ॥

AN HON. MEMBER :—Once more. పై పద్యము తిరిగి పాడ గోరుతాను.

MR. SPEAKER :—పద్యములు సభలో మరల పాడమనగానే పాడకూడదు.

SRI P. RAMASWAMI NAIDU :—పద్యం కనుక చదివాను. ఉప ముఖ్యమంత్రిగారిని ఇటువంటి కార్యములు ఎక్కువగా చేయాలని కోరుతు, అధ్యక్షులవారు నాకు ఈ అవకాశం ఇచ్చినందుకు వారికి నా నమస్కారములు తెలియచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాన.

SRI K. VENKATARATNAM :—అధ్యక్షా, ఉపముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ ఇరిగేషన్ డిమాండును నేను బలపరుస్తున్నాను. 17 మీడియము స్కీములు జూన్ నాటికి పూర్తి అవుతున్నాయని వారి ఉపన్యాసములో తెలియ జేసినారు. చాలా సంతోషకరమైన విషయమే. నాగార్జునసాగరు ప్రాజెక్టుకు రెండవ పంచవర్ష ప్రణాళికలో 82 కోట్ల రూపాయలు ప్రభుత్వం కేటాయించారు. ఈ సంవత్సరము బడ్జటులో దానికి 5 కోట్లకన్న ఎక్కువ కేటాయించలేదు. రెండవ పంచవర్ష ప్రణాళికలో 82 కోట్లు రూ॥లు ఖర్చు పెట్టుటకు నిర్ణయించారు ప్రభుత్వమువారు. కనీసం ఈ సంవత్సరపు బడ్జటులో దానికి 8 కోట్లఅయినా చూపిస్తే బాగుండేది. ఇది మొదటి సంవత్సరముఅని కేటాయించలేదో, బోర్డువారు అంగీకరించలేదో, కేంద్రప్రభుత్వం ఇవ్వలేదోగాని మొత్తంమీద చాలా తక్కువ కేటాయించినందుకు విచారపడుచున్నాను.

కృష్ణాజిల్లాకు, గోదావరిజిల్లాకు సంబంధించిన బుడమేరు, కొల్లేరు స్కీములు గురించి దాదాపు 70 సంవత్సరములనుంచి ఆందోళనచేస్తున్నప్పటికి, ఎన్నో లక్షల యకరాలలో పంటలు నష్టము అవుతున్నవని మొర పెట్టుకున్నప్పటికి, బుడమేరు రిజర్వాయరు స్కీము, దానికి సంబంధించిన ఇతర స్కీములకు, ఈ బడ్జెటులో డబ్బు ఏమీ కేటాయించలేదు. డైవర్షన్ కెనాల్ అనేది ఒక్కటే ఈ సంవత్సరము బడ్జెటులో చూపించాము అని ఉపముఖ్యమంత్రిగారు చెప్పారు.

ఈ బుడమేటినదికి వరదలు వచ్చినపుడు లక్షలకొలది ఎకరములభూమి సర్వనాశనమైపోతున్నది. 1925, 1933, 1939, 1940, 1945, 1947, 1949, సంవత్సరములలోవచ్చిన విపరీతమయిన వరదలవల్ల లక్షలకొలది ఎకరములభూమి నాశనమైపోయింది. ఆ భూములలో కనీసం ఒకబస్తా గింజలయినా పండకుండాపోయాయి. ఈ పథకమును అమలుపరచి ముంపుబాధను నివారిస్తారని అక్కడి ప్రజలు ఎన్నాళ్లనుంచో ఆశిస్తున్నారు. దాన్నిగురించి ప్రభుత్వానికి ఎన్నో విజ్ఞప్తులుచేసినారు. ఈమధ్య డిప్యూటీ ముఖ్యమంత్రిగారు బుడమేటి రిజర్వాయర్, డైవర్షన్ కెనాల్ ఈ సంవత్సరంలోనే అమలు జరుపుతామని శాసనసభలో చెప్పినారు. అందుకు ప్రజలు చాలా సంతోషించారు. ఆ ముంపుబాధకు గురిఅగుతున్న విజయవాడ, గన్నవరం, గుడివాడ, కైకలూరు తాలూకాలలోఉన్న రైతులు చాలా సంతోషించారు. కాని తరువాత ఏమిమాయ జరిగిందో పథకంమాత్రం అమలులోకి రాలేదు.

ఉపముఖ్యమంత్రిగారు రిజర్వాయరు స్కీమునుగురించి పరిశీలించామని, వరదలవల్లవచ్చిన నీరు రిజర్వాయరులో 7, 8 గంటలలోనే నిండిపోతుందని ఆకారణం చేతదానిని ఆపివేశామని diversion canal ఒకటే అమలు జరుపుతున్నామని చెబుతున్నారు. ప్రథమములో state టెక్నికల్ advisors మున్నగువారంతా బుడమేటి ముంపు నివారణపథకాన్ని పరిశీలనచేసి (1) బుడమేటి రిజర్వాయరు, (2) diversion canal, (3) flood tank, ఈమూడింటిని జతపరచి ఏకకాలమందు అమలుజరిపితేనే ఈస్కీము నెరవేరుతుందని, మురుగునీటి బాధ తొలగిపోతుందని స్పష్టంగా చెప్పారు. దానినే తరువాత State Flood Control Board వారు పరిశీలించి అమలుజరపాలని సలహా ఇచ్చి ఉన్నారు. ఫ్లడ్ కంట్రోలుబోర్డులో Chief Engineers ప్రభుత్వమువారి సెక్రటరీలు అంతా కూడా ఉండి అంగీకరించినారు.

Public works department Secretary గారు Technical Advisory Board లోనూ, Flood Control Boardలోనూ కూడా ఉన్నారు.

ఆతరువాత ఇండియాలో ఉన్న ఇంజనీర్లు ఫెడరేషన్ అధ్యక్షత క్రింద యీ పథ కాన్ని పరిశీలించి sanction చేసినారు. P. W. D. డిపార్టుమెంటు వెండర్సు పిలచారు—స్కీము అంతలో సిద్ధమై పని ప్రారంభించబోయేసరికి P. W. D. సెక్రటరీ యీ స్కీమును ఆపివేసి ఫైల్సు పంపించమని కోరారు. ప్రధానమంత్రిగారు, డిప్యూటీ ప్రధానమంత్రిగారు, ఇండియాలోని మేధావంతులయిన ఇంజనీరులు అంగీకరించినట్టి బుడమేటిపథకమగు యీ స్కీమును ఎప్పుడో 10 సంవత్సరముల క్రిందట మాజీ చీఫ్ ఇంజనీయరైన వెంకటాచారిగారు వ్రాసిన రిపోర్టు ఆధారంగా చేసికొని ఇది చేయుటకు వీలులేదు, ఆపివేయాలి అంటున్నారు. P.W.D.సెక్రటరీ. అర్థమేమిటి? దీనివల్ల హెచ్చు ఫలితంరాదు అంటున్నారు. వరద నివారణా పథకాలు ఆదాయాన్ని యిస్తున్నవా ? లేదా అని చూడగూడదు. ఇండియాలో వరదలతో సర్వనాశనముచేయుచున్న కోసీనది, గండకి, బ్రహ్మపుత్రా మున్నగునవి ఎన్నో ఉన్నాయి. వాటన్నింటికి కోట్లకోలది రూపాయలు సెంట్రలుగవర్నమెంటువారు ఖర్చుపెడుతున్నారు. వాటన్నింటివల్ల హెచ్చుఆదాయం వస్తోందా ? గ్రామాలన్నీ బాగుపడుతయ్ అని యీ వరద నివారణ పథకాల ప్రధాన ఆశయము. వరదలవల్ల సర్వనాశనమై పోతున్న గ్రామాలను కాపాడి, అక్కడి ప్రజలను అభివృద్ధిచేయడానికి, వారికి నష్టంలేకుండా ఉండుటకు మనం ఈస్కీములను అమలుజరపాలి. దీనివల్ల return రాదని ఒక P. W. D. Secretary గారు చెప్పినంతమాత్రాన డిప్యూటీ ముఖ్యమంత్రిగారు దీనిని ఆపివేయడం న్యాయంకాదు. ఆనాడు ప్రధానమంత్రిగారు, సెంట్రలు గవర్నమెంటు డిప్యూటీ ముఖ్యమంత్రిగారు, టెక్నికల్ అడ్వైసరు ప్యాసు చేసిన యీ స్కీమును P. W. D. Secretary గారు Composite State లో Chief engineer గా పనిచేసినవారు, ఆయన ఎప్పుడో దీనివల్ల return రాదని report వ్రాసినారని, ఆయన సలహా ప్రకారంగా దీనిని ఆపివేస్తున్నారు. ఇది ఏమి న్యాయమని నేను అడుగుతున్నాను. మనకు technical advisors వున్నారు. వారిసలహా తీసుకోకూడదా ? ఈ P. W. D. Secretary గారు మేధావంతులే అయి ఉండవచ్చును. అయినప్పటికి technical అడ్వైజర్సుకు సంబంధించి ప్యాసు చేసినదానిని, కేంద్రప్రభుత్వం pass చేసినట్టి దానిని, ఈనాడు ఆపివేయడానికి P. W. D. శక్రటరీగార్కి ఏమి అధికారమువున్నది ? ఈవిషయాన్ని డిప్యూటీ ముఖ్యమంత్రిగారు జాగ్రతగా ఆలోచించాలని మనవిచేయుచున్నాను. ఇప్పుడు బుడమేటి ముంపువల్ల ఒకలక్ష ఎకరములభూమి సర్వనాశనమైపోతున్నది.

మన గవర్నమెంటు యిరిగేషనుకు సంబంధించి Betterment Tax వేస్తామని చట్టం pass చేసినారు. డబ్బులేదంటున్నారుగాన బెటరుమెంటు టాక్సు క్రింద యకరానికి రు. 100/-లు యిస్తే లక్షయకరాలకు కోటిరూపాయలు వస్తుంది.

Sri K. Venkatarathnam] [19th March 1956

రు. 150/-లు వేస్తే కోటి-ఏబదిలక్షలు వస్తుంది. కావాలంటే జిల్లాలోనున్న M. L. A. లను హామీ యిస్తాము. దీనివల్ల return రాదని ఎప్పుడో ఎవరో చెప్పినారని ఆయన సలహా ఎందుకు పాటిస్తున్నారు, ఇట్లు అపుట చాలా అన్యాయమైన విషయం. ఇక్కడ ఉన్నటువంటి Chief Engineer ను పితామహుడుగా ఆంధ్ర రాష్ట్రంలో ఉన్న L. Venkatakrishna Iyer గారి సలహా మిగతా Chief Engineers యొక్క సలహా కాదని ఎక్కడో retire అయినట్టివారి సలహా తీసుకొని P. W. D. Secretary గారు రిజర్వాయరును రద్దుచేయడం చాలా అన్యాయము. యీ విషయముమీదనే మన చీఫ్ ఇంజనీయరుగారు తన ఆత్మగౌరవానికి భంగమనుకొని ఆయన resign చేశారనీ, దానిలో గవర్నరుగారు జోక్యం కల్గించుకున్నారనీ ఒకవదంతి ఉన్నది. ఇది నిజమో అబద్ధమో ఉపముఖ్యమంత్రిగారే సెలవివ్వాలి. ఈ బుడమేటి మురుగుస్కీమును అమలుపరచినట్లయితే ఎంతో అభివృద్ధి కల్గుతుందని ఆశిస్తున్నాము. ఈ ముంపుకు గురికాకుండా అక్కడి ప్రజలను, గ్రామాలను కాపాడవలసిందని ఉపముఖ్యమంత్రిగార్ని కోరుతున్నాను.

ఈ స్కీములనుగురించి మేము పరిశీలించినాము. పరిశీలించిన తరువాత దీనిని అమలు పరచుటకు వీలులేదు అని తేలింది అంటున్నారు. ఉపముఖ్యమంత్రిగారు కమిటీలో ఉన్నప్పుడు ముఖ్యమంత్రిగారు, ఉపముఖ్యమంత్రిగారు, Secretaries, Chief Engineers మున్నగువారంతా పరిశీలన చెయలేకపోయినారా? రాష్ట్ర కేంద్ర నిపుణుల సంఘము ప్రభుత్వాలు రెండు ప్యాసుచేసిన యీ బుడమేటి ముంపు నివారణ స్కీమును అమలుపరచుటకు ఏవో సాకులు చెప్పతున్నారని సర్కారుకు జిల్లా లంటేను, అందులో ప్రత్యేకముగా కృష్ణా జిల్లా అంటేను ఉపముఖ్యమంత్రిగారు శ్రద్ధ తీసుకోరని ప్రజలను కొనుచున్నారంటే ఆశ్చర్యమేమీలేదు.

The Hon. Sri N. SANJEEVA REDDI.—వెంకటరత్నంగారి అభిప్రాయం చెబుతున్నారు. అంతేకాని ప్రజలంతా ఏమీ అనుకోనుటలేదు.

Sri K. VENKATARATNAM:—బుడమేరు రిజర్వాయర్ విషయంలో ప్రజలు ఏమనుకుంటున్నారో పరిశీలించి మీరే చెప్పండి. Tenders పిలిచిన తరువాత ఎందుకు ఆగిపోయింది? ఇది తమరే చెప్పాలంటున్నాను. ఇది సామాన్యమైన విషయంకాదు. 5 తాలూకాలకు సంబంధించిన విషయం. లక్షల కొలది ఎకరాల భూమిని నాశనం చేస్తున్న వరదలను ఆపి, ప్రజలను రక్షించుటకొరకు చేయవలసినపని. దీనిని వెంటనే చేయమంటున్నాను. ప్రభుత్వం దగ్గర డబ్బు లేకపోతే సెంట్రలు గవర్నమెంటు యిచ్చే లోపల అడబ్బు ఖర్చుపెట్టి చేయండి. కావాలంటే అభివృద్ధి పన్ను levy వేయండి. నేను హామీ ఇస్తాను. అటువంటి

దేమీ చేయకుండా దీనిని ఆపివేయడం న్యాయం కాదు. డైవర్షన్ కాలువకు 38 లక్షలు ఖర్చు పెడుతున్నారంటే దానికి ఎవరు సంతోషిస్తారు ? అది ఎందుకు పనికివస్తుంది ? మీరందరూ కలిసి pass చేసినదానిని ఎవరో Secretary గారికి ఇష్టం లేకపోతే దానిని అమలుజరుపకుండా మీరుకూడా త్రోసివేయడం ఏమి న్యాయం అంటున్నాను. ఈ వరద నివారణ పథకాన్ని అమలుపరచినట్లయితే కొల్లేరులోకూడా 50 వేల ఎకరాల భూమి సాగులోకి వస్తుంది. ఈమూడు పథకాలు ఏకకాలమందే అమలు జరిపితే ముంపు నీరు తగ్గుతుంది. కొల్లేరులో 50 వేల ఎకరాలో, లక్ష ఎకరాలో సాగుచేయవచ్చును. దానివల్ల ప్రభుత్వానికికూడా ఆదాయంవస్తుంది. ఆ భూమినుండి betterment ద్వారాగాని, బీదవారికి ఇచ్చుటవలనగాని, వేలంవేసిగాని ప్రభుత్వంవారు ఆదాయం పొందవచ్చును. పైన ఉదహరించినటువంటివి ఎన్నో ఉన్నాయి. ఈనాడు diversion canal ఒక్కటే అమలుజరుపతామంటున్నారు. ఈ diversion canal ను అమలుజరిపితే ఏమీ ప్రయోజనంలేదని ప్రజలంతా అనుకొంటున్నారు. ఎవరయినా "మా గ్రామాలు మునిగిపోతున్నాయి" అని అర్జీలు పెట్టుకుంటే పరిశీలనచేసి ఆ స్కీములో మార్చవలసి ఉంటే మార్చండి. అంతేకాని sanction చేసిన తరువాత P.W.D. Secretary గారికి డిప్యూటీ ముఖ్యమంత్రిగారికి ఇష్టం లేదని, ఏవేవో సాకులుచెప్పి రాష్ట్ర కేంద్రములలోని ఇంజనీరుల మాటలను లెక్కచేయకుండా ఆపివేయడం చాలా అన్యాయం. ఈ విషయంలో మరొకసారి పరిశీలన చేసి, ప్రజలు దురభిప్రాయ పడకుండా ఉండేటట్లు చేయవలసిందని కోరుతూ విరమిస్తున్నాను.

SRI P. GURRAJU :—అధ్యక్షా, శ్రీ డిప్యూటీ ముఖ్యమంత్రిగారు సమర్పించిన Irrigation demand ను నేను బలపరుస్తున్నాను. కాని కొన్ని ముఖ్య సూచనలు సూచించదలచాను. నందికొండ, తుంగభద్ర మొదలైన పెద్ద ప్రాజెక్టులు సాధించడానికి ఎంత ప్రయత్నంచేశారో, అదేవిధంగా గోదావరిపై కూడా ఒక ప్రాజెక్టు నిర్మించడానికి విశేష కృషిచేసి సాధించవలసిందిగా కోరుతున్నాను. పెద్ద ప్రాజెక్టులకు ఎంత కృషిచేశారో అలాగే మిగిలిన ప్రణాళికలకు, చిన్నచిన్న irrigation పనులనుకూడా ఎక్కువ పట్టుదలతో చేయవలసిందని కోరుతున్నాను. మా ప్రాంతంలో "పెద్ద బాపన్నదొర చెరువు" అనే చెరువు ఉన్నది. షుమారు 200 సంవత్సరాల క్రితం త్రవ్వబడినటువంటి చెరువు అది. అప్పుడు 22 అడుగుల లోతు ఉండెడిది, ఇప్పుడు షుమారు 10 అడుగుల వరకు మేట వేసినది. 200 సంవత్సరాలనుంచికూడా దానిని ఏవిధమైనటువంటి మరమ్మతు చేయలేదు. కాబట్టి దానినికూడా దృష్టిలో ఉంచుకొని వచ్చే సంవత్సరమయినా

ఆ చెరువు రిపేరుకు కావలసిన estimates తయారుచేయించి, బాగు చేయించ వలసిందని కోరుతున్నాను. ఏలేరు reservoir గురించికూడా మంత్రిగారు చెప్పారు. కాని దానిని ఈ సంవత్సరం రెండో పంచవర్ష ప్రణాళికలో చేర్చి నట్లుగాకూడా కన్పించడంలేదు. ఈ ఏలేరు reservoir దాదాపు 10 వేల శత సహస్ర చతురపుటడుగుల నీరు నిలువచేసి 80 వేల ఎకరాలు సాగుచేయ గలిగినటువంటి ప్రాజెక్టు. దీనివల్ల చాలామంది రైతులకు ఉపయోగకరంగా ఉంటుందని మేముకోరగా ఇది ముంపు నివారణ స్కీములో చేరుతుందని సంజీవరెడ్డిగారు, ప్లానింగ్ మంత్రి కళా వెంకట్రావుగారు అన్నారు. కాని ఇది రెండో పంచవర్ష ప్రణాళికలోకూడా చేర్చబడినట్లు కనబడటంలేదు. కాబట్టి వెంటనే దీనిని రెండవ పంచవర్ష ప్రణాళికలో చేర్పించే ప్రయత్నం చేయించ వలసిందని కోరుతున్నాను. ఈ ప్రాజెక్టుకు 2 కోట్ల రూపాయలు ఖర్చుఅవుతుంది లక్షలకొలది ఎకరాలు సాగులోకివస్తుంది. ఇందుకుగాను రైతులుకూడా ఎకరానికి 250 రూపాయలవరకు ఇస్తామని చెపుతున్నారు. ఈ విషయాన్ని గతసంవత్సరం కూడా నేను మనవిచేసి ఉన్నాను. కాబట్టి ఈ ప్రాజెక్టును వెంటనే అమలు జరి పేందుకు ప్రయత్నం చేయవలసిందని ఉపముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను. దీనివల్ల ఎక్కువ లాభము కలుగుతుందనికూడా శ్రీ Deputy Minister గారు చెప్పారు. కాబట్టి Reserve bank నుంచి అయినా అప్పుతీసుకువచ్చి ఆ సొమ్ముతో నైనా వెంటనే నిర్మించవలసిందని కోరుతున్నాను. Reservoir area లో రెండు పంచదార ఫ్యాక్టరీలుకలవు. దానికి రైతాంగము చాలా పెట్టుబడిపెట్టి వ్యవసాయం చేస్తున్నారు. కాని నీటి Supply సరిగా జరగడంలేదు. ఈ రెండుఫ్యాక్టరీలకు కావలసిన చెరకు Supply చేయవలెనంటె ప్రాజెక్టు ముఖ్యంగా కావలసిఉన్నదని మనవిచేస్తూ ఈ అవకాశం ఇచ్చినందుకు Speaker గారికి నా అభినందనాలు అర్పిస్తూ విరమిస్తున్నాను.

SRI S. JAGANNADHAM :—అధ్యక్షా మహాశయా! ఉపముఖ్యమంత్రి గారు ప్రవేశపెట్టిన Irrigation demand ను బలపరుస్తున్నాను. కాని ఆంధ్ర రాష్ట్రంలో వెనుకబడిన జిల్లాల విషయంగాని, ముఖ్యంగా జమిందారీ ప్రాంతం లోని చెరువుల కాలువల మరమత్తుల విషయంగాని, Minor, Major irrigation విషయంగాని ఈ Budget సూచించలేదు. మా జిల్లాలో ఉన్నటువంటి నదులు, గడ్డలు, చెరువులు, కీటన్నిటిని మరమ్మతు చేయించమని Speaker గారిద్వారా మంత్రిగారికి మనవిచేస్తున్నాను. మా జిల్లాలో శారదానది, గోస్తనినది, యింకా కొన్ని గడ్డలు ప్రవహిస్తున్నాయి. కాని అవి వర్షాకాలము నాలుగుమాసములు ప్రవహించి మిగతాకాలములో ప్రవహించవు. చెరువులకు కాలవలకు మరమ్మతు

చేసినట్లయితే వర్షాకాలములో ఆ నీరును కాలవలద్వారా చెరువులలో నింపుకొని డిశంబరు తరువాత పండించేపంటకు ఉపయోగించుకోటానికి అవకాశంఉంటుంది. చెరువులు, కాలవలు మరమ్మత్తులు మొదలైన పనులు ప్రభుత్వం నిర్వహించవలసిన బాధ్యతఅయినప్పటికి ముఖ్యంగా మా జిల్లాయందు నీటి సౌకర్యమునకై ప్రభుత్వం ఎటువంటి శ్రద్ధవహించక పోవటంచేత ప్రజలకు చాలకష్టంగా ఉన్నది. ఇతర అభివృద్ధి జిల్లాలవలెనే మా జిల్లాలోకూడా Surcharge నీటితీరువ మొదలైన పన్నులు వసూలుచేసినప్పటికికూడా నీటి సౌకర్యం కల్పించకపోవడం చాలా అన్యాయమని Speaker గారిద్వారా Deputy మంత్రిగారికి మనవిచేస్తున్నాను. ఇంకొక విశేషం ఏమిటంటె విశాఖపట్టణం జిల్లాలోని చోడవరం తాలుకా, నర్సీపట్టణం, అనకాపల్లి, శృంగవరపుకోట, మొదలైన తాలూకాలలో చెరుకుపంటకు చాలా ప్రాముఖ్యంఉన్నది. చెరకుపంటకు డిశంబరు దాటినతరువాత జనవరి, ఫిబ్రవరి, మార్చివరకుకూడా నీరు ఉండడం అవసరం. రైతులు, Governmentకు చెల్లించవలసిన పన్నులకుగాని, వ్యవసాయ మదుపులకుగాని చెరకు సెస్సుమీద ఆధారపడి ఉంటారు. వాగులు సరిగా లేకపోవడంవల్ల సరైనపంట పండించనందున ఈ పన్నులు కట్టుకోవడానికి చాల బాధపడుతున్నారు. ముఖ్యంగా అవి జమీందారీ ప్రాంతంఅగుటచేత నదులకు, గడ్డలకు స్వల్పముగానైన డబ్బు ఖర్చుపెట్టినట్లయితే ఎక్కువ ఎకరాలలో పండించడానికి అవకాశంఉన్న ప్రదేశం కాబట్టి చెరువులు కాలువలు మరమ్మతు చేయించి రైతులకు నీటిసౌకర్యం కల్పించవలసిందని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

- SRI Y. CHANNIAH :—అధ్యక్షా, ఆంధ్రదేశములోని Delta areas లో ఎక్కువభాగము మా గుంటూరుజిల్లాలో ఉన్నది. మనము బ్రిటిష్ పరిపాలనలో ఉన్నప్పుడు వారు పంటలు పడించుటకు ఏర్పాటుచేశారుగాని మురుగునీరు పోవుటకు ఏర్పాట్లు చేయలేదు. మా రేపల్లె తాలూకాడెల్టాలో చివరి భాగము అవడంవల్ల వచ్చేనీరుకూడ చాలా వెనకబడివస్తున్నది. ఆ వచ్చిన నీరు పోవడానికికూడ మార్గాలు లేకుండా రైతులు అనేకబాధలు పడుతున్నారు అనేది మన ఉపముఖ్యమంత్రిగారి దృష్టికి తీసుకొనివస్తున్నాను. ముఖ్యంగా రేపల్లె, నిజాంపట్టణం రోడ్డులో నంగేడిరేవు, తాటికాయలరేవుదగ్గర వంతెనలు నిర్మించవలసియున్నది. అక్కడ వంతెనలు నిర్మించకపోవడంవల్ల, అది Metal road అయినప్పటికికూడా, నిజాంపట్నం, ఆ చుట్టుప్రక్కలఉన్న గ్రామాలకు పోవడానికి ప్రజలు చాలా బాధపడుతున్నారు. కనుక ఉపముఖ్యమంత్రిగారు ఇది దృష్టిలోపెట్టుకొని, తొందరగా ఆ వంతెనలు ఏర్పాటుచేస్తారని నేను ఆశిస్తున్నాను.

మా గుంటూరు జిల్లాలో నందికొండ ప్రాజెక్టుకు వారుచేసిన కృషికిమాత్రం మా గుంటూరు ప్రజలతరఫున వారిని అభినందిస్తున్నాను. ఈ అవకాశమిచ్చినందుకు అధ్యక్షులవారికి నా ధన్యవాదాలు అర్పిస్తున్నాను

Sri P. BAPAYYA :— అధ్యక్షా మహాశయా! ఉపముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టినటువంటి ఈ Irrigation demand నేను బలపరుస్తున్నాను. ఆంధ్ర దేశము ముఖ్యంగా వ్యవసాయకదేశము. నూటికి 80 మంది వ్యవసాయంమీద జీవిస్తున్నారు. అటువంటి వ్యవసాయానికి irrigation అంటె నీటిపారుదల సౌకర్యాలు ప్రధానము గనుక irrigation రైతులకు ఎంత ఆనందదాయకమో వేరేచెప్ప నవసరములేదు. అయితే మన ప్రథమ పంచవర్ష ప్రణాళికలో నీటిపారుదల సౌకర్యాలకొరకు కేటాయించిన డబ్బుఅంతా మనము ఖర్చుపెట్టుకోలేక పోవడం చాల విచారకరము. ఆవిధంగా ఖర్చుపెట్టలేకపోవడానికి కారణాలు ఉన్నాయని చెప్పుకొంటున్నాము. కాని సామాన్యజనానికి ఆ కారణాలేమిటో తెలియవు. వారు ఈ పనులన్నీ కొకుండ అట్లాగె నిలచిపోయినవని విచారపడడంతప్ప వారికి కారణాలతో పనిలేదు. మనప్రభుత్వము యీ విషయములో ఎక్కువ శ్రద్ధాసక్తులు చూపించలేదని నేను అభిప్రాయపడుతున్నాను. ఇంతకంటె కొంత ఎక్కువశ్రద్ధాసక్తులు చూపించి ఉండినట్లయితే ఇంకా అనేకపనులు ప్రథమ పంచవర్షప్రణాళికలోనే చేయడానికి అవకాశముండేది. పెద్దపనులకంటె ముఖ్యంగా minor irrigation పనులు, అనగా చిన్నచిన్న నీటిపారుదలపనులు రైతులను ఎక్కువగా ఆకర్షిస్తాయి. నాగార్జునసాగరువంటి పెద్ద multi purpose project ను మన ఉపముఖ్యమంత్రిగారు సాధించినందుకు చాలా సంతోషము. దానికి ఆంధ్రులందరు యెల్లప్పుడు వారికి కృతజ్ఞులుగా ఉంటారు. అయితే నాగార్జునసాగరువంటి పెద్దప్రాజెక్టులు వెంటనే ఫలితాలు ఇచ్చేవికావు. వాటి ఫలితాలు ఏ 10, 15, 20 సంవత్సరాలకో వస్తాయి, వాటికి అనేక stages ఉన్నాయి. కాని minor irrigation పనులు అటువంటివి కావు. ఇవి తక్కువడబ్బుతో వెంటనే ఫలితాలు ఇచ్చే అవకాశము కలిగినటువంటివి, కాబట్టి వాటి విషయంలో ఎక్కువ శ్రద్ధ తీసుకొన్నట్లయితే, చాలాసంతోషించేవాళ్లము. ముఖ్యంగా నా నియోజకవర్గము తిరువూరుతాలూకాలో అనేకమైన minor and medium irrigation schemes పెట్టడానికి అవకాశాలు ఉన్నాయి. గత బడ్జెటు సమావేశములోకూడ ఈ విషయము చెప్పాను. వెదుళ్లవాగు, కట్టలేరు స్కీములకు estimates కూడ తయారైనవి, అన్ని preliminaries కూడా అయిపోయినవి, కాని sanction మాత్రము నిలిచిపోయినది, అది ఎందుకు ఆగిపోయినదో నాకు అర్థంకాలేదు. రైతులు మేము

శిస్తులు ఎక్కువచేసుకొంటాము, betterment tax కూడ ఇచ్చుకొంటాము అని కలెక్టరుకు వ్రాసి ఇచ్చారు. కాని అవేవికూడ budget లో లేకపోవడం చాలా విచారకరము. ఇంకను అక్కడ అనేకమైన చిన్న చిన్న schemes ఉన్నవి. కొత్తూరు scheme అనేది ఒకటి కొంతవరకు investigation జరిగింది. తమ్మిలేరునుంచి మంకోలుకు ఒక channel proposal కూడ ఉన్నది. ఇవన్నీ కూడ కొద్దికొద్దిగా జరిగి అట్లాగే ఆగిపోయినాయి. అంతేకాకుండా, అవి జమీందారీ ప్రాంతాలు, అక్కడ జమీందారులు బాగుచేయించకుండా abandon చేసినటువంటి చెరువులు అనేకమున్నవి. వాటిని కొద్దిమొత్తాలతో repair చేయించినట్లయితే, కొన్నివేల ఎకరాలు ఆ యకట్టులోనికి రావడానికి వీలుంటుంది. ఈ విషయాలన్నీ ఉపముఖ్యమంత్రిగారు దృష్టిలో పెట్టుకోవలసిందని కోరుతున్నాను. ఈసందర్భంలో ఒక విషయము మనవిచేస్తాను. మొదటి జనరల్ యెన్నికలో మా నియోజకవర్గములో, ఒక కమ్యూనిస్టు అభ్యర్థి ఎన్నుకోబడ్డారు. గనుక కాంగ్రెసు ప్రభుత్వములో కమ్యూనిస్టు సభ్యుని ఏమి చేయలేదు. మాకేమి పనులు జరుగవని మన నియోజకవర్గానికి యెలా పనులుజరుగుతవని అప్పుడు ప్రజలు అనుకొని కొంత తృప్తిపడ్డారు. ఈ దఫాలోనే కాంగ్రెసు అభ్యర్థిని ఎన్నుకొన్నాము కాంగ్రెసు ప్రభుత్వములో నియోజకవర్గము మేలుకోరి, అయితేనేమి ఇప్పుడుకూడ ఏమి వారికి పనులు జరగడంలేదు. గనుక అలా అనుకొనడం పొరబాటని యిప్పుడు తెలుసుకొన్నారు. కాంగ్రెసు ప్రభుత్వంలో పక్షపాతంలేదు, కాంగ్రెస్ సభ్యుడు ఉండినా కమ్యూనిస్టు సభ్యుడు ఉండినా పనులు జరగటంలో భేదంలేదు, కాంగ్రెసు నిష్పక్షపాతమైనటువంటిదని కాంగ్రెసువారికి ఒక Credit కూడ వచ్చింది ఇది యొక సంతోషకారణంవల్ల సహాయంజరిగే అవకాశాలు కల్పించడంలేదు. కనుక చివరకు మంత్రిగారైనా ఇక్కడికివస్తే స్వయంగా చెప్పుకొంటే ఏమైనా సహాయం జరుగుతుందేమో మంత్రిగారిని ఇక్కడికి ఒకసారి తీసుకొని రావలసినదని నన్ను అడుగుతున్నారు. అటువంటి అవకాశంకూడ - ఇంకా దొరకలేదు. అందుచేత మన ఉపముఖ్యమంత్రిగారు మా నియోజకవర్గానికి ఒకసారి దయచేసి, ప్రజలు చెప్పుకునేటటువంటి కష్టనిష్ఠురాలు స్వయముగా వినవలసిందని కోరుతున్నాను. ఈ సందర్భంలో మరొక విషయం మనవిచేస్తున్నాను. కృష్ణాజిల్లా నందిగామా తాలూకాలో Munuperu extension channel అనేది ఉన్నది. అది 4 మైళ్లు 2 ఫర్లాంగులు పొడవు. - దానిక్రింద నాలుగులక్షల రూపాయలు ఖర్చుఅయింది. దానిక్రింద 2800 ఎకరాలు సాగుచేయాలి. అయితే ఇప్పటివరకు, 12 వందల ఎకరాలు మాత్రమే సాగుచేస్తున్నారు. తక్కినది ఎందుకు సాగుకు రావడంలేదని అడిగితే, రైతులు ముందుకు రావడంలేదని అని ఉద్యోగస్థులు చెప్పు

తున్నారు. కాని అది సరియైనటువంటిదికాదు. నేను ఈ మధ్యనే ఆ channel క్రింద ఉన్నటువంటి రైతులతో మాట్లాడడం తటస్థించింది. వారు ఆ channel సరిగా లేదని దాంట్లో చాలా లోపాలుఉన్నవని, Head sluice నీరు లాగడం లేదని, అందుచేత Tail end లో ఉన్నటువంటి గ్రామాలకు నీరు సరిగా రావడం లేదని 1954-55, 1955-56 సంవత్సరాలలో నీరు సరిగా అందక ఎకరాకు 4, 5 బస్తాలుమాత్రమే పండడం తటస్థించిందని అందుకుగాను ఆ ఆయకట్టు పెంపు చేసుకోడానికి రైతులు భయపడుతున్నారని చెప్పినారు. అందువల్ల ఈ విషయాలన్ని ప్రభుత్వము ముఖ్యంగా పరిశీలించి ఆ లోపాలన్నీ సరిచేయించి Channel క్రింద ఉండేటటువంటి భూమిఅంతాకూడ సాగులోనికి ఆయకట్టులో వచ్చేటట్లుగా చేయవలసిందని ప్రార్థిస్తూ సెలవుతీసుకొంటున్నాను.

SRI M. R. APPA RAO BAHADUR :—అధ్యక్షా, ఈ రోజున మన ఉపముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండు చాలా ఆమోదకరమైన డిమాండేనని అందులోఉన్న విషయాలు వారు సాకల్యంగా చెప్పారు. వాటిని నేను అంగీకరిస్తున్నాను. మన భారతదేశములోఉండే నీటిలో మన ఆంధ్రదేశములోఉన్న నీరు దాదాపు 15 వంతులు ఉన్నదనిన్నీ, అందుచేత భారతదేశములోకల్లా మన ఆంధ్రదేశమే వ్యవసాయములో చాలా ప్రాధాన్యము వహించింది. ఆ కారణము చేతనే మనకు నాగార్జునసాగర్ ప్రాజెక్టుఅనేది దేశములోకల్లా చాలా పెద్ద ప్రాజెక్టు ఏర్పడడము అవుతున్నది. ఇప్పుడు మనకు విశాలాంధ్ర రాబోయే సమయములో యీ ప్రాజెక్టును గురించి ఒక విషయము చెప్పవలసియున్నది. ఈ ప్రాజెక్టు విషయములో యిదివరలో రైతులము, మేముకూడ మంత్రిగారికి, చీఫ్ యింజనీరుగారికి చెప్పాము. అందుకు వారు ప్రోత్సాహిస్తామని అన్నారు. అది యేమిటంటే నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు ఎడమకాలవ కట్టలేరువరకూ ఏర్పాటు చేశారు. దానినే కృష్ణాజిల్లాలో తిరువూరు, నూజివీడు తాలూకాలలోనూ, తరువాత పశ్చిమ గోదావరిజిల్లాలోఉన్న చింతలపూడి, తాడేపల్లిగూడెం తాలూకాలలోఉన్న మెట్టప్రాంతాలకున్నూ నీరు పారుదలఅయ్యేటట్లుగా చేయమని వారితో చెప్పియున్నాము. ఇందుకుగాను ధర్మాజిగూడెములో ఒకసభకూడ ఏర్పాటు చేశాము. ఆ సభకు ఉపముఖ్యమంత్రిగారుగూడ హాజరైనారు. ఆ సభలో ప్రజ అందరూ యీ కాలవ విషయమైచెప్పగా, ఆ తాలూకాలలోని మెట్టప్రాంతాలకు గూడ యీ కాలవవచ్చే యేర్పాటు చేయిస్తానని ఉపముఖ్యమంత్రిగారు చెప్పియున్నారు. ఈ కాలవయొక్క capacity 11 వేల క్యూసెక్కులవరకూ నీరు సప్లయిఅయ్యేటట్లుచేశారు. ఈ నీరు 11 వేల క్యూసెక్కులకుబదులు 15, 16

వేల క్యూసెక్కులవరకూ ఏర్పాటుచేస్తేనే గాని చింతలపూడి తాలూకాలోని మెట్ట ప్రదేశాలకు నీరు పారుదల కాజాలదని ఇంజనీర్లు చెప్పారు. అందుచేత నీరుఉన్నా లేకపోయినా, యీ కాలవకు water capacity 15, 17 వేల క్యూసెక్కుల వరకూ నీరువచ్చేటట్లు ఏర్పాటుచేస్తే, గోదావరినదిమీద ప్రాజెక్టుకట్టినప్పుడు గోదావరినీటిని కృష్ణానదిలోనికి తీసుకునివచ్చి, అక్కడినుంచి ఆ నీటిని మద్రాసునగరు తీసుకునిపోయే స్కీము ఉన్నదని చెబుతున్నప్పుడు, అప్పుడు ఆ నీటిని మనము బాగా ఉపయోగించుకోవచ్చు. కాబట్టి యీ ఎడమకాలవకు Water capacity 15, 16 వేల క్యూసెక్కులవరకు ఉండేటట్లు ఏర్పాటు చేయవలసిందిగా మంత్రిగారిని కోరుతున్నాను.

ఇదిగాక బుడమేరు స్కీము ఒకటి ఉన్నది. ఈ స్కీముకుగాను ప్రభుత్వము 82 లక్షలు ఖర్చు పెట్టబోతున్నారని తెలిసింది. ఇందుకు చాలా సంతోషము. ప్రభుత్వాన్నిగూడ మనము అభినందించవలసియున్నది. ఈబుడమేరు నీటికి ఒక Reservoir కూడ కట్టినట్లయితే, అది flood ను ఆపడమేకాకుండా, బెజవాడకు దగ్గరగా ఉన్న మెట్ట ప్రాంతాలకుగూడా ఆ నీరు పారుదల చేయించుకోవచ్చు. వ్యవసాయానికి ఎంతో ఉపయోగకరముగా ఉంటుంది. ఇదిగాక మనకు తమ్మిలేరుకు ప్రాజెక్టు కట్టడముకూడ అవసరముగానే ఉన్నది. దీని క్రింద ఉన్న మెరక ప్రాంతాలుకూడ సాగుఅవుతున్నవి. Flood Protection Schemes లో యిది చాలా ముఖ్యమైనది. తమ్మిలేరు ప్రాజెక్టు విషయములో యీమధ్య Investigation గూడ జరిగింది. ఒక పర్యాయము దీన్ని ఉపముఖ్యమంత్రిగారుకూడ వచ్చి చూచారు. అది చూచిన తరువాత, వారు యీ విషయములోకూడ తగు శ్రద్ధ తీసుకుంటాననికూడ వాగ్దానము చేశారు. అవిధముగా వారు శ్రద్ధ తీసుకుంటున్నారు. కృష్ణా జిల్లాలో ఉన్న తిరువూరు నూజివీడు తాలుకాలలోని మెట్ట ప్రాంతాలు రాయలసీమలోని మెట్ట ప్రాంతాలు మాదిరిగా ఉన్నవి. ఈ ప్రాంతాలన్నీగూడ సాగుకావటానికి యాభై లక్షల రూపాయలు ఇవ్వమని కేంద్ర ప్రభుత్వాన్ని కోరినట్లుగా మంత్రిగారు చెబుతున్నారు. కృష్ణా జిల్లాలోని తిరువూరు, నూజివీడు తాలూకాలలోని మెట్ట ప్రాంతాలు అన్నీ పూర్వము జమీందారీ ఏరియాలోనివి. ఆ ఏరియాలలో చాలామట్టుకు పూర్వము జమీందార్లు త్రవ్వించిన చెరువులు ఎన్నో వున్నవి. ఈ చెరువులు అన్నీ మరమ్మతులు లేక పాడైపోయియున్నవి. వీటికి మరమ్మతులు వెంటనే చేయించవలసిన అవసరము ఎంతైనా ఉన్నది. ఈ చెరువుల మరమ్మతుల క్రింద కొద్దోగొప్పో ప్రతి సంవత్సరము ఖర్చుచేయవలసిన అవసరము వస్తూనేఉన్నది. యాభై లక్షల రూపాయలు అడిగామని చెబుతున్నప్పుడు [illegible]

సొమ్ము యీ మెట్ట తాలూకాలకే ఖర్చుచేయడము ముదానహామని అంటున్నాను. ప్రభుత్వము యీ ప్రాజెక్టులను ఏర్పాటు చేయటానికి కృషిచేస్తారని ఆశిస్తున్నాను. ప్రజలు, మనము అందరముకూడ ప్రభుత్వానికి తోడ్పడుతారని నమ్ముతూ, ఇంత టితో విరమిస్తున్నాను.

Sri P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా, ఈ రోజున మన ఉప ముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండు విషయములో నందివాడ ప్రాజెక్టును గురించి, శాయన్న ఛానల్ గురించి మాట్లాడటానికి ఒక కోత తీర్మానమును నేను ప్రతిపాదించియున్నాను. దీన్నిగురించి నేను కొద్దిగా మాట్లాడదలచి ప్రభుత్వము దృష్టికి కొన్ని విషయాలు తీసుకొనివస్తున్నాను. నందివాడ ప్రాజెక్టు ముఖ్యంగా మా శ్రీకాకుళం జిల్లాలో ఉన్న పాలకొండ, చీపురుపల్లి తాలూకాలకు ప్రధానంగా ఉపయోగపడుతుందని నేను మంత్రిగారికి మనవిచేస్తున్నాను. కారణము యేమి టంటే, గత ప్రకాశంపంతులుగారి ప్రభుత్వములో నారాయణపురం ప్రాజెక్టుకు foundation వేశారు. కాని నేను దానిని వద్దు అని చెప్పడములేదు. కాని, కొన్ని కారణములచేత కొంతమంది వ్యక్తులు యీ నారాయణపురం ప్రాజెక్టు రాకుండా ఉండాలనే ఉద్దేశ్యముతో ప్రభుత్వమువద్ద deputation వెళ్లారు. ఈ నారాయణ పురము ప్రాజెక్టు విషయములో చెప్పేది యేమిటంటే, యీ ప్రాజెక్టు నదికి ఎగువన కట్టేటట్లయితే, అది శ్రీకాకుళం తాలూకావరకే నీరు పారుదల అవుతుంది. కాని దాని నీరు చీపురుపల్లి తాలూకాలోగూడ కొంత భాగమువరకే పారుదల అవుతుంది. అట్లాకాకుండా నందివాడ ప్రాజెక్టు నదికి దిగువన కట్టేటట్లయితే పాలకొండ తాలూకా యావత్తున్నూ, తరువాత చీపురుపల్లి తాలూకాలో దిగువ భాగము, అంతా చేరి సుమారు యాభై వేల యకరాలకు నీరు పారుదలకు ఉపయోగిస్తుంది, నారాయణపురము కన్న ఎక్కువ భూమి సాగుఅవుతుంది, పైగా నందివాడది కట్టినట్లయితే అక్కడ రైతులుకూడ ప్రభుత్వము betterment tax వేసినా, మరి యింక ఏవిధమైన tax వేసినా, అంతాకూడ కట్టుకోటానికి సిద్ధముగా ఉన్నారు. ప్రాజెక్టు పని గూడ immediate గా ప్రారంభించటానికి ప్రజలు సహకరించటానికి సిద్ధముగా ఉన్నారు కొబట్టి, ఆ నందివాడ ప్రాజెక్టును ముందు ప్రారంభించండి అని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. మనము త్వరలోనే హైదరాబాదుకు వెళ్లబో తున్నాము. అక్కడ పరిస్థితులు ఏట్లా ఉండబోతాయో గనుక, యీ నందివాడ ప్రాజెక్టుకు ప్రజలుగూడ డబ్బు ఇవ్వటానికి, ఇంకా ఇతరత్రాగూడ సహకరించ టానికి సిద్ధముగా ఉన్నారు కొబట్టి, మనము హైదరాబాదు వెళ్ళేలోపలనే సంజీవ రెడ్డిగారి పేరుతో, ముందుగా దీనికి foundation వేయమని మంత్రిగారిని కోరు

తున్నాను, ఒకసారి foundation వేసివిడిచి పెట్టితే, తరువాత దీనిని ఎప్పటికైనా పూర్తిచేసుకోటానికి వీలుచేసుకోవచ్చును, కాబట్టి, ముందు యీనందివాడ ప్రాజెక్టుకు foundation వేయవలసిందని కోరుతున్నాను. నారాయణపురము ప్రాజెక్టుకు, యీ నందివాడ ప్రాజెక్టుకు ఎలాంటి సంబంధములేదు. నారాయణపురము ప్రాజెక్టు కట్టవద్దు అని నేను చెప్పడములేదని మాత్రము గుర్తించాలి. నారాయణపురం ప్రాజెక్టు వచ్చినా, నందివాడదికూడ కావలసినదే. కాబట్టి దీనికి ముందు మనము హైదరాబాదుకు వెళ్ళేలోగా foundation మాత్రము వేయవలసిందని కోరుతున్నాను.

తరువాత శీయన్న చానల్ విషయము నేను ఇదివరకే మంత్రిగారికి మనవిచేసియున్నాను. ఈ చానల్ క్రింద సాగుఅయ్యే భూములకు నీరు ఇస్తామని ప్రభుత్వము రెండు పంటలను చేరి శిస్తు వసూలు చేస్తున్నది. ఈ చానల్ క్రింద ఉన్న భూమి అంతాగూడా నందివాడ ప్రాజెక్టు క్రిందకేవస్తుంది. నందివాడ ప్రాజెక్టువస్తే, యీ చానల్‌కు చేయవలసిన పని యేమీలేదు. ప్రభుత్వము యీ చానల్‌కుగాను ఒక్క దమ్మిడీగూడ ఖర్చుచేయవలసిన పనిలేదు. ఈనాటి పరిస్థితులనుబట్టి యీ చానల్ క్రింద ప్రభుత్వము నీరు యిస్తున్నట్లుగా ఎకరమునకు 20 రూపాయల వంతున ప్రభుత్వం వసూలుచేస్తున్నది. కాని నీరు మాత్రము ఇవ్వడములేదు. ఈ విషయము మంత్రిగారు గమనించుచున్నారని అనుకుంటున్నాను. ఇచ్చేటటువంటి నీరు, రెండు పంటలకని శిస్తులు యిచ్చే రైతుల భూములకు అందడములేదు. ఈ సందర్భములో ఒక విషయము మాత్రము ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. ఇదివరకు యివి జమీందార్ల అధీనములో ఉన్నప్పుడు యీ కాలవకు కట్ట తెగిపోయిందనిగాని ఏ రైతుకైనా నీరు రావడములేదనిగాని జమీందారుకు చెప్పుకుంటే, అది అర్థరాత్రి వేళ అయినాసరే, జమీందారు ఇంజనీర్లను, సూపర్వైజర్లను పంపించి రాత్రిళ్లు పగళ్లు పనిచేయించి నీరు మాత్రము 24 గంటలలోగా రైతులకు, అందేటట్లు చేయించేవాడు అలాంటిది యీనాడు యీ estates ను ప్రభుత్వము స్వాధీనముచేసుకుని యిప్పటికి 7, 8 సంవత్సరాలు కావచ్చింది. రెండవ పంటకు నీరు రావటములేదు, సరికదా, శిస్తులుమాత్రము వసూలుచేస్తున్నారు. నీరువచ్చేటట్లుచేయండి అని ఎన్నిసార్లు ప్రభుత్వానికి మొరపెట్టుకున్నాగూడ, రైతులమొర ఆలకించడమేలేదు. అసలు మొదటిపంటకే నీరుచాలి, చాలకుండా ఉంటున్నది. అలాంటిది రెండవ పంటకు నీరు ఎక్కడినుంచి వస్తుంది ? మొదటిపంటకే నీరుచాలక ఎన్నోవేల ఎకరాలలోని పంటయేసరిగా అందడములేదు. రైతులు నష్టపడడము కనబడుతున్నది. అందువల్ల ఉపముఖ్యమంత్రిగారికి మనవిచేసేది యేమిటంటే, రేపు

రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మొదటి సంవత్సరములోనే అంటే first phase లోనే యీ నందివాడకు foundation వేసి పని ప్రారంభించండి. ఇతర ప్రాజెక్టులకు మంత్రిగారు ఏ విధముగా శ్రద్ధవహించి foundation వేశారో, అదేవిధముగా దీనికిగూడ శ్రద్ధవహించమని, వారి చేతులతోనే, దీనికి foundation వేయమని కోరుతున్నాను. అక్కడి ప్రజలకష్టములు సర్వకాలము తీరినట్లు అవుతుంది. ఏ కారణముచేతనో మా శ్రీకాకుళంజిల్లామీద వారు శ్రద్ధవహించడమే లేదు. ఎంతసేపటికి కృష్ణా గుంటూరు గోదావరీజిల్లాలమీద, కృష్ణా నది, గోదావరినదిమీద, వారి దృష్టిపడుచున్నదేగాని, మా జిల్లావైపుకే పడడము లేదు. ఎందుకంటే ఎంతసేపటికి కృష్ణానదిమీద, గోదావరినదిమీదనే ఎక్కువగా డబ్బు ఖర్చుచేయడము కనబడుతున్నది. ఈ విధముగా మేము ఎందుకు అనుకోవలసి వచ్చిందంటే—(Interruption) లేదండి. అంతా అక్కడే ఖర్చుచేస్తున్నారు. ఈ డబ్బుఅంతా ఆ జిల్లాలకే సరిపోతున్నది. ఆ డబ్బులో కనీసము సగమైనా మా జిల్లాక్రింద ఖర్చుచేయకూడదా ? ఇప్పుడు Krishna నదిమీద barrage కు గాను ఎంతఖర్చు చేస్తున్నారు ? కృష్ణానదిమీదకట్టే నందికొండ ప్రాజెక్టుకు 120 కోట్లు ఖర్చుచేయబోతున్నారు. ఈ సొమ్ముఅంతా ఒక్క ప్రాజెక్టుమీద ఖర్చుచేసి ఏ రెండు మూడు జిల్లాలకో ఉపయోగించేటట్టు చేసేబదులు, యీ సొమ్మును రాష్ట్రమంతటా అన్ని జిల్లాలలోను Minor irrigation projects తో సహా ఖర్చు చేస్తే, అన్నిజిల్లాలు సమానంగా బాగుపడటానికి వీలుఅవుతుందిగదా ! రాష్ట్రములోని ప్రజలు ఎక్కడచూచినా సంతోషిస్తారుగదా ? ప్రభుత్వము ఆ విధముగా ఎందుకు చేయకూడదో అర్థము కావడములేదు. వీటికి ప్రభుత్వము డబ్బులేదనిచెబితే, మేము దానికి ఒప్పుకోము. ఎలాగైనా ఉపముఖ్యమంత్రిగారు ఆ జిల్లాలయందే శ్రద్ధచూపిస్తున్నట్లు కనబడుతునేఉన్నది. ఇదికాదు అని వారు అనలేరు. ఎందుకంటే, వారు కర్నూలునుంచి మా ప్రాంతానికివచ్చినా, ఢిల్లీకివెళ్లినా బెజవాడలో దిగకతప్పదు. ఢిల్లీనుంచి బెజవాడకువచ్చి కర్నూలుకు రావలసిఉన్నా, బెజవాడలో దిగకతప్పదు, అటువంటప్పుడు బెజవాడవారికిలేదని ఎట్లా సమాధానము చెప్పగలరు ? కాబట్టి ఎటుపోవలసివచ్చినా, వారు బెజవాడలో దిగకతప్పేదిలేదు కాబట్టి కృష్ణా బారేజికి అయితేనేమి, యింకా కృష్ణానదికి, గోదావరినదికి అయితేనేమి, డబ్బు అక్కడ జాస్తిగానే ఖర్చుచేయవలసిన పరిస్థితి ఏర్పడుతున్నది.

ఇకపోతే నాగావళినది విషయము ఉన్నది. ఈ నదికి వరదలువచ్చి దీనిక్రింద భూములు అనేకసార్లు మునిగిపోవడము జరిగింది. అయితే పత్రికలలో మా జిల్లాసంగతి పత్రికలవారు వ్రాయనేవ్రాయరు కృష్ణా, గుంటూరు, గోదావరి

జిల్లాల విషయములంటే, అక్కడవారికి ఎక్కువగా propaganda జరుగుతుందని, ఆ జిల్లాలంటె ఎక్కువగా వ్రాస్తారు. ఇక మా జిల్లాలో అటువంటి propaganda లేదు గనుక వారు వ్రాయనేవ్రాయరు. నాగావళినదికి వరదలువచ్చి, ఎన్ని పశువులు కొట్టుకుని పోయినవో, ఎన్ని చచ్చిపోయినవో, ప్రజలు ఎంతమంది చచ్చిపోయినారో. ఎన్నిసార్లు ఎంతెంతవరకు ప్రజలు నష్టపడ్డారో, ఈ విషయమై పత్రికలలో యేమైనావచ్చిందా ? మేమువచ్చి చెప్పుకుంటేతప్ప, మా సంగతి విచారించేవారే ఉండరు. స్వయముగ వచ్చి చెప్పుకున్నాగూడ దిక్కు, దివాణము కనబడడము లేదు. నాగావళి వరదలవల్ల యిప్పటికి ఎన్నోవేల ఎకరాలు దిబ్బలువేసి పాడై పోయినవి. ఇదివరకు వరదలు వచ్చినప్పుడు, మనము మద్రాసు ప్రభుత్వములో ఉన్నాము. అప్పుడుకూడ యీ గోపాలరెడ్డిగారు, యీ సంజీవరెడ్డిగారు, యీ చంద్రమౌళిగారు మంత్రులుగానే ఉన్నారు. అప్పుడు వీరు అందరు చూడలేదా ? ఇంతవరకు ఆ దిబ్బలు తీయించే ఏర్పాటుచేశారా ? వాటిని గురించి ఆను కునేవారేలేరు. మంత్రులకు ఎంతసేపటికినీ గుంటూరు, కృష్ణా, గోదావరిజిల్లాల సంగతే మాట్లాడుతారు, ఆ జిల్లాలలో Flood control Boards చేశారు. ఆ నది మీద ప్రాజెక్టుకట్టాలి, యీ నదిమీదకట్టాలి, అనే విషయాలు ఉంటున్నవేగాని, మా జిల్లాయొక్క పరిస్థితులనుగురించి మంత్రులు ఎత్తుకోనే ఎత్తుకోవడములేదు. ఇందుకు మాకు చాలా విచారకరముగా ఉన్నది. మంత్రులకు ఎంతసేపటికినీ, కృష్ణా, గోదావరినదులుతప్ప వేరేనదులు వారిదృష్టిలో లేవుకాబోలు. ఉన్నవా, అని వారు ఆలోచించరు. అడిగినప్పుడు మాత్రము మీ నదులపేర్లుమాత్రము చాలా చక్కని పేర్లేగాని అక్కడ పనులుమాత్రము జరగడములేదు అని అంటారు. ఇంతవరకుచూస్తే ప్రయోజనకరమైనపనిమాత్రము ఒక్కటిగూడ జరిగింది కనబడదు. అందువల్ల నేను చెప్పేది యేమిటంటే, మాజిల్లాలోకూడ Flood control Board ను ఏర్పాటు చేసి, కొట్టుకునిపోయే గ్రామాలకైనా యికముందునుంచి వరదలతాకిడి తగలకుండా flood banks వెంటనే కట్టించవలసిందిగా ఉపముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను.

నేను యీ కోతతీర్మానము పెట్టడమునకు కారణము ప్రభుత్వాన్ని యీ డిమాండువిషయములో ప్రతిఘటించాలని కానేకాదు. మాజిల్లావిషయము మాట్లాడ టానికి అవకాశము కలిగించుకోటానికి మీలుగా, యీ cut motion ను తెచ్చాను. ప్రభుత్వము ఏది తలపెట్టినను, అది నిర్వహించుకోగలదు. కాబట్టి యీ రెండు కోట్లరూపాయలు వచ్చే అయిదుసంవత్సరాలమీద పంచిపెట్టి ఖర్చుచేయటానికి తల పెట్టేబదులు, ఏదో సామెతచెప్పినట్లు ముందు అన్నము ఉంటున్నప్పుడే భోజనము చేస్తే, తరువాత ఆకలిఅయినప్పుడు, యింకెవరైనా పెట్టుతారన్నట్లు, ముందు యీ

Sri P. Narasimhappa Rao] [19th March 1956

రెండుకోట్లలో మొదటిసంవత్సరములోనే జిల్లాల మీద medium minor projects క్రింద ఖర్చుచేస్తే, ప్రజలు వెంటనే పంటలుపండించి ఫలితము అనుభవించటానికి వీలుఅవుతుంది. లేకపోతే అయిదేళ్ల వరకూ నోళ్లు తెరచుకుని కూర్చోమని చెప్పడము భావ్యముకాదు.

ఇకపోతే మాజిల్లాలో రోడ్లపరిస్థితి బొత్తుగా బాగుగలేవు. ఇవిగాక యింకా యితరములైన works ఎన్నో చేయవలసిఉన్నవి.

MR. SPEAKER :—Civil works ను గురించిన డిమాండువస్తుంది అప్పుడు వాటినిగురించి మాట్లాడవచ్చు. ఉపన్యాసము త్వరగా ముగించండి.

SRI P. NARASIMHAPPA RAO :—ఇకపోతే లంచగొండితనము గురించి కొద్దిగా చెప్పదలచాను. ఈ లంచగొండితనము మాజిల్లాకు సంబంధించినంతవరకుచూస్తే చాలాభాగము తగ్గిందిగాని, ఇంకా P. W. D. లో మూసలిపిల్లులు ఇంకా ఉంటున్నవి. అవి ఇంకా నశించలేదు. ఎందుకంటే నేనుగూడ ఇదివరకు contract చేసినవాణ్ణేగనుక నేను చెప్పగలుగుతున్నాను. ఇదివరకు ఎక్కడో Supervisors లంచము తీసుకుంటున్నారని వదంతి ఉండేది. అలాంటిది యిది Executive Engineers వరకూ ప్రాకిపోయింది పోయినవారుపోగా, ఇప్పుడు మిగిలినవారు బాగానే పనిచేస్తున్నారుగాని, యీ డిపార్టుమెంటులో ఎట్లాగైనా లంచగొండితనము అనేది పోతేనేగాని దీనికి మోక్షము ఉండదు. ఇప్పుడు ప్రభుత్వము ఏదో silt clearance అనేపని చేయిస్తున్నారు. అయితే యిది ఎంత వరకు పనిచేశారు అనేది తెలుసుకోనివ్వకుండా, ఏదోకొంత కనబరచి, చివరరోజున నీరువదలడం జరుగుతున్నది. చేసినపని వున్నా లేకపోయినా డయరీలోమాత్రము లెక్కలు పూర్తిగా ఎక్కిపోతాయి. బిల్లుచేయడము మ్రింగివేయడముతప్ప మరేమి జరగడము లేదు. నీరు వదలడమువల్ల ఎంతపనిచేశారో తెలియనివ్వరు. అబద్ధపుబిల్లులు పంపి డబ్బు పంచుకుంటున్నారు. అసలు వారు చేసేది silt clearance కానేకాదు. కాలవకు నీరువిడవడమువల్ల యీపని చేశారోలేదో కని పెట్టడము కష్టము. దానికి Executive Engineer లాలూచీ ఉన్నదికాబట్టి ఇందులోనివిషయము బయటికిరావడములేదు. యిటువంటివి యింకా చెప్పాలంటే అనేకములున్నవి. ఇవి అన్నీ ప్రభుత్వముగమనించి, అరికట్టేటట్టుచేయాలి. ఇక మీదనైనా ప్రభుత్వము young men ను వేసిపనిచేయించితే, కొంతవరకు బాగుపడే పరిస్థితులు ఏర్పడుతాయి. కాబట్టి మంత్రిగారు నేనుచెప్పినవిషయములను అన్నీ గమనించి సహకరిస్తారని నమ్ముతూ యింతటితో విరమిస్తున్నాను.

* SRI P. SREERAMULU :—అధ్యక్ష మహాశయా! ఉప ముఖ్య మంత్రిగారిచే ప్రతిపాదింపబడినటువంటి ఈ Irrigation Demand ను నేను సమర్థించుచున్నాను. లక్షలాది ఎకరముల భూమి సాగుబడిలోనికి తీసుకువచ్చి ప్రజలు బహుళ ప్రయోజనములు పొందుటకు సాధనములైన వంశధార, నాగార్జున సాగర్, తుంగభద్ర ఎగువ కాలువలు వగైరా project ల పరిశీలన జరిపి, plan లు estimate లు తయారుచేయించి, అవి మంజూరయిన పిమ్మట అమలుజరిపే విషయంలో ప్రభుత్వం చూపుచున్న శ్రద్ధకు ప్రజానీకం కృతజ్ఞత తెలుపవలసియున్నది. మనకు స్వాతంత్ర్యంవచ్చి, ఆంధ్ర రాష్ట్రం ఏర్పడిన తరువాతకూడా Public Works Department లో క్రింద ఉద్యోగులు పూర్వంనుండి delta area లలో అవలంబించే పాత పద్ధతులనే అనుసరించుచు ఏవ్యవహారం, సత్వరంగా పరిష్కారం కానీయక ప్రజలను అనేక ఇబ్బందులకు గురిచేయుచున్నారు. ఉదాహరణకు, ఒకటి రెండు విషయాలు తమ ద్వారా ప్రభుత్వానికి మనవిచేయదలచాను. కృష్ణా Western Delta లో వరి పంటకు దాదాపు December ఆఖరువరకుకూడా నీరు supply కావలసియున్నది. వరి పంటకేకాకుండా Delta area లలో పండించే చెఱకు మొదలైన తోట భూములన్నిటికీకూడా దాదాపు March 15 వ తేదీవఱకూ కొంత నీరు supply కావలసియున్నది. అవసరం ఉన్నచోటూ, అవకాశం ఉన్నచోటూ మాత్రమే వేసవికాలంలో కొన్ని పంటలకు మాత్రమే నీరు సప్లయి చేయవలసియున్నది. ఈ వరిపంటకు నీరు supply చేసే విషయంలో, ప్రతి సంవత్సరంకూడా చివరి భాగంలో, అంటే November, December మాసాలలో రైతులంతా ఎంతో ఒత్తిడి చేస్తేనేగాని నీటి suppply సక్రమంగా జరగడంలేదని ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. నిన్న ప్రశ్నోత్తరాల కాలంలో ఉపముఖ్యమంత్రిగారు చెప్పిన జవాబులవల్ల ఒక విషయం తెలుస్తోంది. వేసవికాలంలో వరిపంటకు నీరు supply చేయడానికి నదిలో చాలినంత నీరు లేదని చెప్పియున్నారు. Long term crop కు December ఆఖరువఱకూ నీరు supply చేస్తే సరిపోతుంది. Second crop కు మాత్రం నీటి supply వేసవికాలంలో అవసరం అవుతుంది రైతులకు కావలసిన నీరు supply చేసి ప్రభుత్వం తద్వారా అదనపు ఆదాయం పొందడానికి ఎంతో అవకాశం ఉంది. ప్రతి విషయంలోనూ సత్వరంగా పరిష్కారం కాకుండా జాప్యం జరుగుతోంది అనడానికి ఒకటి రెండు ఉదాహరణలు చెబుతాను. నా నియోజకవర్గమైన దుగ్గిరాలలో, కొల్లిపర, చిలుమూరు, దంతలూరు, అత్తోట మొదలైన పెద్ద గ్రామాలున్నాయి. ఇవి పాత delta లో ఉన్న గ్రామాలు. ఈ గ్రామాలలో యున్న భూములకు మురుగు నీటిపారుదల సౌకర్యాలు కావలసియున్నదని చెప్పి కొన్ని సంవత్సరాలుగా దరఖాస్తులూ, రాయబారాలు జరిపి,

ప్రభుత్వాధికార్లవద్దకుపోయి చెప్పుకున్నారు. సాధారణంగా నవంబరు ఆఖరుకు కోతలకు కోవలసిన వరికోతలు, డిసెంబరు జనవరి మాసం ఆఖరువరకూ కూడా, కోతలు కాకుండా ఉండిపోయినవి చూచాను. అందువల్ల అక్కడ ఈ drainage facilities చాలా అవసరం. దీన్ని గుర్తించి స్థానిక అధికారులు ఇది సత్వరంగా పరిష్కారం చేసేటట్లు చూస్తారని సత్వరిత ఉత్తరువులు పంపిస్తారని ఆశిస్తున్నాను ఉమ్మడి మదరాసు రాష్ట్రంలో, రాజాజీ మంత్రివర్గంలో, Public Works Minister గా Yakub Hussain Bahadur గారున్నప్పుడు, ఒక drain sanction అయింది. అది, పెదపాలెం, పేరకలపూడి, చినపాలెం, వల్లభాపురం వగైరా గ్రామాలకు సంబంధించిన drain ఈ గ్రామాలపేర్లు మాత్రమే వుదహరించబడినప్పటికీ, యీ మురుగుపారుదల కాలువ ఎన్నో గ్రామాలకు సంబంధించియున్నది. ఆ drain యొక్క ప్రాముఖ్యతను, దాని అవసరాన్ని, దాని క్రిందవున్న ఎన్నో గ్రామాలు ప్రతియేట ముంపుకు గురియగుటచేతను, సదరు మురుగు కాలువ మంజూరు అయినసంవత్సరములోనే, దానిని list of government drains చేర్చబడినది. ఐతే 15 సంవత్సరములనుంచి దానికి చేయవలసిన మరమ్మతుల కవసరమైన estimate లు plan లు తయారుచేయడంగాని వాటిని finalise చేసి, ఈనాటివరకూ అమలుజరపడంగాని జరగలేదు దానికి సంబంధించిన ఆ files ఎక్కడున్నాయో, ఏ అధికార్ల యీ జాప్యము బాధ్యులో ప్రభుత్వం గుర్తించలేదు. ఈ అధికార్ల జాప్యమే, దీనికి కారణం. ఇది ప్రత్యేకముగా మురుగు కాలువ అయినప్పటికి, అక్కడున్న రైతులు దానికి అడ్డకట్టలువేసి బోదె కాలవలవలె ఉపయోగించి, ఈ drain కు ఆటంకపరుస్తున్నప్పటికీ స్థానికాధికారులు చూస్తూ, ఊరుకుంటున్నారు. List of Government drains లో ఇది చేరిఉన్నప్పటికీ దాన్నిగురించి ఏవిధమైన చర్యలు తీసుకోలేదు దీనికి కారకులు ఎవరో దర్యాప్తు చేయించవలసిందని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను ఈ పాత Delta area లలో చాలా సమస్యలున్నాయి. Krishna Western Delta కి 1930 సంవత్సరం ఆ ప్రాంతములో Lutman అని ఒక Executive Engineer ఉండేవారు. ఆయన హయాంలో కట్టబడిన తూములు చాలా చిన్నవిగా ఉండి పెద్ద కప్ప అందులో దూరితే బైటకు తిరిగి రావడానికి వీలులేనటువంటి తూములు అప్పట్లో వేయబడినాయి. ఈరోజు ఆయకట్టు అలాంటి తూముల క్రింద అభివృద్ధి ఐనప్పటికీ అదే సైజు తూములే ఈనాటివరకూ continue అవుతున్నాయి. ఆ తూములు పెద్దవి చేయించవలసినదనీ రైతులు ఎన్నిమార్లు విన్నపాలుచేసుకున్నప్పటికీ, ఇప్పటివరకూ remedy లేదు. ఇటువంటి ఉదాహరణలు వందల కొలదీ చూపించగలను. తరువాత Flood Control Scheme ను గురించి ఉప

ముఖ్యమంత్రిగారు ప్రస్తావించియున్నారు. కృష్ణానదికి కుడివైపున వైకుంఠపురంనుంచి సీతానగరంవరకూ దాదాపు 15 మైళ్ళ పొడుగున ప్రతి సంవత్సరం వరదలు వచ్చినప్పుడు అనేక గ్రామాలు వరదనీటిమయమై సస్యశ్యామలంగా ఉన్న అనేక భూములు మునిగిపోయి పంటలు పాడవడం దాదాపు ప్రతీ సంవత్సరము జరుగుతోంది. సత్తెనపల్లి, గుంటూరు తాలూకాలలో ఉన్న దాదాపు 40 గ్రామాలు ఈ ముంపుకు లోనై, రైతులకే, నష్టంకాకుండా ప్రభుత్వానికి శిస్తు remission వగైరాద్వారా కూడా ఎంతో నష్టం వస్తోంది. ఈ విషయం లోగడ budget speech లో చెప్పియున్నాను. Chief Engineer కూడా ఈ విషయం విపులపఱచారు. వైకుంఠపురంనుంచి సీతానగరంవరకూ కృష్ణానదికి కుడివైపున ఏటిగట్టు నిర్మాణం చేసే విషయం flood control schemes లో చేర్చిందీ లేనిదీ ఉపముఖ్యమంత్రిగారు వారి జవాబులో చెర్కొంటారని ఆశిస్తున్నాను.

మైనరు ఇరిగేషను స్కీములను గురించి నాకు ముందు తెలిపిన సోదర సభ్యులతో ఏకీభవిస్తున్నాను. మైనరు ఇరిగేషను పనులకు ఏ మాత్రం డబ్బు కేటాయించినా కూడా సత్ ఫలితాలను ఇవ్వగలదనే అభిప్రాయముతో ఏకిభవిస్తున్నాను. గాని జిల్లాలవారిగా ఈ మైనరు ఇరిగేషను స్కీములను గురించి మంజూరు చేసినది సక్రమముగా, సకాలంలో సంవత్సరం పూర్తిఅయేలోపల ఖర్చుచెయ్యక పోవడము జరుగుతున్నది. ఉదాహరణకు గుంటూరుజిల్లాలోనే రెండు సంవత్సరాల క్రితము, ఈ సంవత్సరముకూడా ఇచ్చినధనము వినియోగించకపోవడము ఆ డబ్బు lapse కావడము శోచనీయము. ఇట్లా కేటాయించిన డబ్బును వినియోగించక పోవడానికి, కారకులు ఏవరో తెలుసుకొని ఆ అధికారులమీద అవసరచర్య తీసుకొనవలెనని ప్రభుత్వానికి మీద్వారా మనవి చేస్తున్నాను.

SRI G. RAMU NAIDU :—అధ్యక్షా, మాది కొండప్రదేశము కాబట్టి అక్కడ కాశిపట్నం మురా తంగవరందగ్గర కొండఉంది. నీటికోసం 20, 30 మైళ్లు వెళ్లినా నీరు తాగడానికికూడాలేదు. , 200, 300 జనం అక్కడఉన్నారు. నుయ్యి కావలెనని ఇదివరకు మనవిచేసేను తీగలమాడ అని ఒక ఊరుఉంది, మంగమానివలస గ్రామంఉంది నీటికోసం గడ్డకుపోవలెను అక్కడకూడా నీరు దొరకదు. గత బడ్జటులో నుయ్యికావలెననిచెప్పేను. కొత్తూరుదగ్గర చట్టిగడ్డఉంది. కృష్ణాపురంనుండి కాలవవస్తుంది. ఆ భూమి కట్టక్రిందఉన్నది కాలువతీస్తే అక్కడ సుమారు 500, 600 ఎకరాల పొలము సాగుతుంది. కొత్తూరుకు సమీపములో రోడ్డుఒకటి ఉన్నది. దానికి మదుం కట్టవలెను. చిట్టిగడ్డకు సున్నతో కట్టిస్తే కొత్తూరు కృష్ణాపురం, పడికబందలో చాలా పొలం అగుతుంది. ఇంతవరకు మెట్టగాఉంటున్నది.

Sri G. Ramu Naidu] [19th March 1956

దముకుదగ్గర గడ్డఉన్నది. అది కరకవలస, సిరింగిపురం, తీగలమాడ పనసమానువలస, లక్షుంపురం 1000 ఎకరాలభూమి పొలము అగుతుంది. ఇప్పుడది మెట్టగాఉంది. కాలవవేస్తే అక్కడనుంచి పరిపండుతుంది. అక్కడనుంచి వాంపార్తిమురాగెడ్డ ఎద్ర మట్టువలస, గ్రామంఉంది. 200, 300 ఎకరాలభూమిఉంది. అక్కడ కాలువ ఉన్నది. పల్లంభూమిలేక రైతులుపంటలులేక చాలా పొందపడుతున్నారు. అక్కడనుంచి దలపతివలసకు పాతరోడ్డుఉన్నది. చాదమామిడిదగ్గర వరదకూడా ఉంది. పాతరోడ్డువద్ద చెరువువేస్తే దలపతివలన డంగిరిపుట్టు మాడగడావద్ద కొంత పల్లంచేస్తే 600, 700 ఎకరాలు అగుతుంది. కోణాపురంలో నీరు దొరకదు. మనుష్యులకు, పశువులకు త్రాగడానికికూడా నీరులేదు. ఊటఉన్నదికూడా ఎండి పోతున్నది. క్రిందటి బడ్జటు సమయంలోకూడా చెప్పేముగాని ఇంతవరకు ఏమీ శాంక్షనుకాలేదు. వొంతెరువుకు వురిశెల్లలో నూతినిగురించి చెప్పినాను. అక్కడ మనుష్యులకు పశువులకు నీరులేదు. ప్రజలు చాలా ఇబ్బంది పడుతున్నారు. కొత్తూరు, దముకుగడ్డ, సల్టిగడ్డ, నందనగుమ్మి కరకవలస భూములకు నీరువస్తుంది. సున్నంకట్టిస్తే 200. 300 ఎకరాల పల్లపుభూమి తయారుచేసుకోవచ్చును. ఏజన్సీ మెట్టప్రాంతాలను పల్లంచేసే పనులను వెంటనే శాంక్షను చేయించవలెనని కోరుతున్నాను.

*Sri P. GUNNAYYA :—అధ్యక్షా! పూజ్యులు సంజీవరెడ్డిగారు ప్రతి పాదించిన ఇర్రిగేషను డిమాండును హృదయపూర్వకముగా బలపరుస్తున్నాను. కాని ఇప్పుడు ఈ ఇర్రిగేషను విషయములో ప్రభుత్వం కొన్నికొన్ని జిల్లాలలో లక్షలు కోట్లుకూడా, ఖర్చుచెయ్య దలచుకున్నది. ఇందుకు సందేహం ఏమీ మాకు లేదుగాని ప్రస్తుతము మైనరు ఇర్రిగేషను స్కీములు చిన్నస్కీములను- త్వరలో చేయిస్తారని నేను కొన్ని సూచనలను తమద్వారాచేస్తున్నాను. శ్రీకాకుళం జిల్లా టెక్కలిడివిజనంత అధ్వాన్నమైనతాలూకు ఇంకొకటిలేదు. పాతపట్నంతాలూకాలో 2000 చెరువులు ఉన్నవి. అందులో 200 P. W. D. వారివి. రెండుసంవత్సర ములక్రితము తీసుకున్నారు. ఈనాటికికూడా ఏవిధమైన మరమ్మతులులేవు. ఇవిగాక పాతపట్నం తాలూకాలో గొట్టపల్లిగెడ్డ, బత్తిలిపాలవలసగెడ్డకు కనీసము రెండు రూపాయలు ఇస్తే వంశధార రిజర్వాయరు ప్రక్కన 200 గ్రామాలకు సౌకర్యము కలుగుతుంది అని అయిదారుసంవత్సరాలనుండి ఘనవిచేస్తున్నాము. గొట్టపల్లి బత్తిలి గడ్డమీద పనులను ప్రభుత్వంవారు త్వరలో తీసుకోవలెనని కోరుచున్నాను. పాత పట్నంతాలూకా జమీందారులను కొంత వెనుకతీసుకున్నారు. ఒక చెరువైనా మరామ్మత్తుచెయ్యలేదు. ఇవి వెంటనే మరామ్మత్తు చేయించి ఆతాలూకా ప్రజల

ఇబ్బందులు తొలగించుతారని ఆశిస్తున్నాను. టెక్కలితాలూకాలోకూడా పరిస్థితులు అధ్వాన్నముగా ఉన్నవని మంత్రిగారికి తెలుసును సబ్ కలక్టరుగారు ఉన్న ఊరు, చెరువులు మరమ్మత్తులులేక ప్రజలు ఇబ్బందిపడుతూ అక్కడిప్రజలు జమీందార్లు ఉన్నప్పుడే బాగా ఉన్నదని అనుకుంటున్నారు. పన్నులుమాత్రము తీసుకుంటున్నారు; చెరువులు మరామ్మత్తుచెయ్యడములేదని ప్రజలు ఆందోళనపడుతున్నారు. కాబట్టి ఈ విధమైనమాటలు ప్రభుత్వానికి లేకుండా గ్రామాలలో ఎంతశిస్తు తీసుకుంటున్నారో అంతైనా మైనరు ఇర్రిగేషను పనులక్రింద ఖర్చుపెట్టవలెనని ప్రభుత్వానికి మనవిచేస్తున్నాను. జంఘావతినదిని 20, 30 సంవత్సరాలనుంచి చూస్తున్నాము. 20, 30 లక్షలు ఖర్చుతో పార్వతీపురం తాలూకాకు వినియోగము అయ్యేటట్టు చేయించవలెనని మనవిచేస్తున్నాను మొన్న inspection కు వచ్చినప్పుడు ఏదో ఆర్డరుచేసారు. తరువాత Orissa ప్రభుత్వం అడ్డంకంపెట్టేరు. నందివాడస్కీము పంపించారు. జంఘావతిస్కీమును ప్యాసుచేయించి ఆతాలూకాలో ప్రజల ఇబ్బందులను తొలగించవలెనని ప్రార్థిస్తున్నాను.

మంత్రిగారి ఉపన్యాసములో గోదావరిజిల్లానుండి కూలీలను తీసుకొనివస్తామన్నారు నిజముగా మేము విచారించవలసిన విషయము. ఒకకోటి రూపాయల స్కీములుఇస్తే శ్రీకాకుళం జిల్లా కంట్రాక్టు ఉత్సాహముగా పనులుచేయించగలరు. గాని ఆ ఉత్సాహాన్ని చీఫ్ ఇంజనీరుగారు నిరుత్సాహపరచారు. డబ్బు ఉన్నవారు లేరా ? ఆ జిల్లాలో కంట్రాక్టర్లు లేరనా గోదావరి జిల్లానుంచి కంట్రాక్టర్లను తీసుకువచ్చారు. ఈ కంట్రాక్టర్లకు ఇంజనీర్లకుసంబంధం ఉన్నది. ఈ విషయము కంట్రాక్టర్లు చీఫ్ ఇంజనీరుకు చెప్పుకున్నారు. ప్రజలడబ్బు లక్షలు కోట్లు ఖర్చు చేస్తున్నప్పుడు ఆజిల్లాప్రజలకు ఆడబ్బు ముట్టేటట్లు చూడాలి. ఇప్పుడు అక్కడ రైతులను M. L. A. లను ఒక కమిటీగా వేసి ఇంజనీర్లు డబ్బును దుర్వినియోగం చెయ్యకుండా చూసేటట్లు చెయ్యవలెను. ఆకమిటీద్వారా ప్రభుత్వమువారు రిపోర్టులు తెప్పించుకొని పనులుచేయిస్తే బాగా ఉంటుంది, అని నేను అనుకుంటున్నాను.

ప్రతి Project విషయంలో ఒక చిన్న కమిటీనివేసి ఆకమిటీద్వారా ప్రభుత్వంవారు తగినటువంటిరిపోర్టును తీసుకొని, కావలసినపనిని అంతాచేస్తే బాగుంటుందని నేననుకొంటున్నాను. శ్రీకాకుళంజిల్లా ఎంత వెనుకబడిఉన్నదో మంత్రిగారికితెలుసు. ఈ budget seassion పూర్తి అయినతర్వాత శ్రీకాకుళం జిల్లాలో ఇంకొకమారు, టూరుచేసి మా టెక్కలి, పాతపట్టణం తాలూకాలలో వారు స్వయంగా తనిఖీచేసి, కావలసినటువంటిపనులను అక్కడిప్రజలకు కల్పించి మా యొక్క గౌరవాన్ని నిలబెట్తారని అధ్యక్షులవార్కి నేను వినయపూర్వకంగా మనవి చేసుకొంటూ నేను ఇంతటితో విరమించుకొంటున్నాను.

SRI P. KODANDARAMAYYA :— అధ్యక్షా! ఈDemandను నేను బలపరస్తున్నాను. ఈ శాఖను నిర్వహించే మంత్రిగారు, గోదావరివల్లను మా ప్రాంతంలో కురిసిన వర్షాలవల్లను విపరీతమైన వరదలువచ్చి నా నియోజకవర్గంలోని చెరువులు తెగిపోతే, ఒక్క నిముషముకూడా ఆలస్యం చేయకుండా వెంటనే అక్కడికి పరుగునవచ్చి వాటినన్నిటినీ బాగుచేసే ఏర్పాటులు చేసినందులకు వారికి నా వందనాలు అర్పిస్తున్నాను. తరువాత నా నియోజకవర్గమే కాకుండా, నా స్వగ్రామకు (నేను పుట్టినగ్రామము) 24 గో మైలులో ఒక "లాకు" ఏర్పాటు చేసినందులకు వారిని నేను ప్రత్యేకంగా వందనాలర్పిస్తున్నాను. మా జిల్లాలోని Agency ప్రాంతాలను, మెట్టప్రాంతాలను గురించి కొన్నివిషయాలు వారికి చెప్పవలసిన ఆగత్యముంది. పెద్ద స్కీములు, మధ్యరకపు స్కీములు, చిన్న స్కీములు అని విభజించి వీటిలో పెద్దస్కీములకే ప్రాధాన్యం ఇస్తున్నామని వారు మొట్టమొదటనే చెప్పారు. పెద్దస్కీము సంగతికూడా మాకుంది. గంగాగోదావరన్నారు పురాతనంనుంచీ గంగతరువాత గోదావరి. విశిష్టతగల జీవనది. ఈదక్షిణ దేశంలో గోదావరినదికంటే ఎక్కువగా నీ రొచ్చేనది, నీరాగేనది వేరేదీలేదు. అటువంటినదిలో, Cotton దొర ఒక్క అనకట్టకట్టారు. ఆ అనకట్టమూలాన మేమే తినలేదు, దేశానికి అంతటికీ యిచ్చాము. అక్కడ పండినపంట దేశానికి అంతా, మలబారుదాకా తాడేపల్లిగూడెంనుంచి రోజూపోతూనే ఉంటుంది. (ఊరికేనా ?) ఊరికేకాదు. ఊరికే ఇచ్చేదాతలు ఎవ్వరన్నాఉంటే చాలా సంతోషమే. అలాంటి గోదావరికి రామపాదసాగరం కట్టించేవిషయంలో ప్రయత్నాలు జరిగినాయి. దురదృష్టవశాత్తు అది ఇంతవరకూ నెరవేరలేదు. Flood control విషయంలో ఏదైనా చేయిద్దామని ఈ మంత్రివర్గంవారు చాలా ప్రయత్నిస్తున్నట్లు తెలుస్తుంది. ఇప్పూరువద్ద కట్టించాలని investigation చేస్తారని తెలుస్తున్నది. దానికి నా అభివందనములు, తెలియబరస్తున్నాను. నాకు రెండు interest లున్నాయి. ఈ గోదావరి జలంవృధాగా సముద్రంలో పడిపోకుండా ఆపడం ఒకటి, నదిగట్టునఉన్న భద్రాచలం, నూగూరు, పోలవరం, చోడవరం, పాలవంచ, హైదరాబాదుస్టేటులోని fertile lands, ఇండ్లు ఇవన్నీ మునుగకుండా ఉండేటటువంటి సాధనము మాకు కావలసియున్నది. దానికోసం నేను సెంట్రల్ గవర్నమెంటులోయుండే కోస్లాగారితో ప్రస్తాపనచేసినాను. ఆయన గోదావరికి రామపాదసాగరం ఒకచోటేకాదు, రెండు మూడుచోట్ల ఆనకట్టలు కట్టాలన్నారు. అదికాదయ్యా గోదావరినదికి supply channels ఉన్నాయి, శబరి ఇంద్రావతి, ప్రాణహిత, ఇత్యాది ఉపనదులున్నాయి. వాటికి రిజర్వాయర్లుకట్టి నీరుకొంత ఆపుదలజేసి మీరనుకొన్నటువంటి రెండు అనకట్టలుకట్టి పోలవరందగ్గఱ బారేజికట్టి

ఈ నీరునంత నిలుపుదలజేసినట్లయితే ఎక్కువ ముంపుఉండదు. రామపాదసాగరము రాములవారి పాదానికి తాక లేక పోయిన ఇవతల ఉండేటటువంటి కొండప్రదేశానికివచ్చే సావకాశము ఉంటుంది. అని చెప్పినందుకు ఇంజినీయర్ కోస్లాగారు 'నీవు చెప్పింది ఆలోచించదగిందే అని చెప్పారు.' ఈ మధ్య మంత్రిగారితోను చీఫ్ ఇంజనీయర్ గారితోను అ ప్రాంతాలకు స్వయంగా వెళ్లి చూచివచ్చాం అది తొందరగా జరగాలని ఆ ప్రాంతంతో ఈ గోదావరీనదియొక్క వరదల ఆపుదలకైన ఈ స్కీముకు ఏర్పాటు చేయించాలని కోరుతున్నాను. రెండవది ఏమిటంటే కొండవాసలున్నాయి. మాకు ఈ గోదావరికి పెద్ద ఆనకట్టకట్టేటప్పటికి ఇతర చిన్నవాటికంతాకూడ ప్రాధాన్యము ఇవ్వవలసిన అగత్యమున్నది. ఎందుచేతనంటే ఒక పెద్ద అనకట్టను నదికికట్టితే చిన్న చిన్నవన్నియు పోతాయి, రోడ్లన్నియు మునిగిపోతాయి, అనేకవిధములైనటివంటి నష్టములు ఏర్పడుతాయి అందుచేతను మొట్టమొదటనే పెద్ద అనకట్టలనుకట్టి తర్వాత చిన్న చిన్నవి కట్టడం ఒక అగత్యమైనటువంటి విషయమని నాకు తెలుసు. అయినాదానికి సంబంధములేని విషయాలు కొన్నిఉన్నాయి. అది ఏమిటంటే ఎఱ్ఱకాలువ స్కీము వేసినారు. దానికంతా ఏర్పాట్లుచేసినారు. అయితే కొండవాగులకు సంబంధించినటువంటి స్కీములున్నాయి. అవి రెండు ముఖ్యంగా కావలసిఉన్నాయి. ఒకటి జల్లేరుకు జీడిగుప్ప అను గ్రామమువద్ద ఒక ఆనకట్టకట్టించవలెను. నేను స్వయంగా వెళ్లి చూచాను. వారుకూడ వెళ్లిచూస్తే దాని విషయము వారికి బాగా తెలుస్తుంది. తర్వాతను వరదలవల్ల నిరంతరం చాలనీళ్లు వస్తుంది, పల్లపుకాలువకు 1. కొవ్వాడ, 2. లంకపల్లి కొండేపెదగ్గఱ ఒక ఆనకట్టకట్టించవలసిన అగత్యముఉంది. ఇవి రెండు చాల ముఖ్యమైనటువంటి అత్యవసరమైన విషయాలు చెరువులు, తదితర విషయాలు కూడా ఉన్నాయి. వీటివల్ల మెట్టప్రదేశాలకే కాకుండా ఇవతలఉండేటటువంటి జల్లేరు, వీట్లకు ఆనకట్టలు కట్టడంవల్ల జిల్లాకంతకుకూడా చాల సౌకర్యం కలుగుతుంది, ఇంకా రెండు విషయాలు ఉన్నాయి. పూర్వం కొల్లేరు చాలలోతుగ ఉండేది. ఈ మధ్య రెవిన్యూమంత్రిగారితో వెళ్లిచూచాను. అదంతా మెట్టవేసిపోయింది. మెట్టమీదనుంచి నీరు ఏలాపోతుంది. అందుచేత కొల్లేరునుకూడ త్రవ్వించవలసిన అగత్యంఉంది. త్రవ్వించిన మన్ను ఇవతల పోయిస్తే దాన్ని వేలంవేయిస్తే దానిడబ్బు దానిక్రింద రావడానికి అవకాశంఉంది. తర్వాత గోదావరిలో ఇసుకకూడ ఆ మాదిరిగనేఉంది. ఇసుకనుకూడా తీయించవలసిన అగత్యం ఉంది. తణుకుతో ఈ మధ్య మా అమ్మాయికి ఇల్లుకట్టిస్తే బంగారానికి ఎంత విలువఉన్నదో ఇసుకకుకూడ అంత విలువఉన్నదని తెలిసింది. కావున ఈ ఇసుకను తీసి డెల్టాతాలూకాలకు ఎగుమతిచేయించినట్లయితే చాలా డబ్బు రావడానికికూడ

Sri P. Kodandaramayya] [19th March 1956

అవకాశాలున్నాయి. ఈ మార్గాలన్ని పరీక్షించాలని నేను కోరుతున్నాను. మరొక్క విషయముంది గూటాల పంపింగ్ స్కీమని మా చెవులు బద్దలైపోతున్నాయి. ఈ గూటాలపంపింగ్ స్కీము మొన్న మంత్రిగారు వెళ్లుతూ మీరేకట్టుకుంటే మాకేమి అభ్యంతరంలేదన్నారు. తప్పకుండా కట్టుకుంటాం. వారధి ఎవరో కట్టారని Science advance కాని కాలంలో క్రోతులన్ని రాములవారికి వారధి కట్టితే ఈ చిన్న పంపింగ్ స్కీమును మేము కట్టుకోమా, కట్టించుకుంటాం అయితే ముందర ఒక రక్షణమాత్రం కావాలి. పెట్టుబడి పెట్టిన డబ్బు మాకు తిరిగి వచ్చే దాక పన్నును మేము వసూలు చేసుకొనే అధికారంఇస్తే వెంటనే వారికి ఒకదమ్మిడి ఖర్చు అక్కరలేకుండా తక్కువఖర్చుతో హెచ్చుగా చేసుకొంటామని మనవి చేస్తున్నాను.

*Sri G. SURYANARAYANA :—అధ్యక్ష మహాశయా, మన రాష్ట్రంలో మూడుకోట్ల డెబ్బయిలక్షల రూపాయలు minor, major irrigation scheme ల క్రింద ఖర్చుపెట్టాలని ప్రభుత్వం నిశ్చయించింది. ఈ ఖర్చు పెట్టడంలో విశాఖపట్నంజిల్లా ముందు తీసుకోవాలని ఉపముఖ్యమంత్రిగారు ప్రకటన చేసినందుకు చాలా సంతోషం. వారికి నా అభినందనలు. ఎందుకంటె మన రాష్ట్రంలో మనకు స్వతంత్రం లభించిన లగాయతు యింతవరకు విశాఖపట్నం జిల్లాలో అక్కడ ప్రజలశ్రేయస్సుకొరకు యింతవరకు ఏవిధమైనఖర్చులు పెట్టలేదు కాబట్టి యీనాటికి విశాఖపట్నం జిల్లా మన ప్రభుత్వదృష్టికివచ్చి యీ విశాఖ పట్నం జిల్లాను ముందు తీసుకోవాలని ప్రకటనచేసినందుకు అభివందిస్తున్నాను. ఇక పోతే విశాఖపట్నంజిల్లా పూర్వకాలంనుంచీ estate అయివున్నది. దానిలో estate వున్నంతవరకు ఏదో కొంతవరకు కొన్ని scheme లు చెరువులు, గడ్డలు ఇటువంటి నీటితీరువలు పూర్వం మహారాజులు కొద్దో గొప్పో మరమ్మత్తులు అక్కడ ప్రజానీకం ఆహారధాన్యాలను పండించుకోడానికి తగుసౌకర్యం చేసేవారు. ఇక estate abolition అయిపోయాయి. అప్పటినుంచికూడా మామూలుగా ఇటువంటి schemes వుండిపోయాయి. 1951 లో విశాఖపట్నంజిల్లాలో తుపాను సంభవించింది. దానివల్ల ఏటికాలువలు మేటలుపడ్డాయి. ఇంతవరకు నీటిసప్లయి లేక మాజిల్లాలో రైతు ప్రజానీకం అంతాకూడా ఆహారధాన్యం పండించడంలో వెనుకబడివున్నారు కాబట్టి యిప్పటికైనా ప్రభుత్వంవారిదృష్టికి వచ్చిందంటే చాలా సంతోషిస్తాము. 1952 నుంచి మద్రాసుప్రభుత్వం ఉమ్మడిగావున్న లగాయతు గంటి కొండ కడకొండ ప్రాజెక్టులు చంపావలి నదికి లోవ జగన్నాథపురందగ్గర Dam కట్టాలని ప్రభుత్వానికి పదేపదేవిజ్ఞప్తులు చేశాము. అదికాకుండా 1954 లో మనరాష్ట్ర

ముఖ్యమంత్రిగారు అప్పుడు ప్రకాశంపంతులుగారు, ఉపముఖ్యమంత్రి సంజీవరెడ్డి గారు, శృంగవరపుకోట తాలూకాకువచ్చి ఆ జిల్లాలోని పరిస్థితులంతా చూచారు. అప్పటినుంచికూడా M. L. A. లమంతా memorandum లు సమర్పించుకున్నాం. దానిమీద ఇంతవరకు ఏవిధమైన చర్యలు తీసుకోలేదు. ఈనాటికయినా విశాఖ పట్నంజిల్లా, దృష్టికివచ్చినందుకు అభినందిస్తున్నాను. కారణం ఏమిటంటే విశాఖ పట్నంజిల్లా చాలా వెనుకబడివున్నది. అక్కడ రైతులు ఆహారధాన్యాలు ఉత్పత్తి చేయడానికి నీటిసప్లయచేయాలని విజ్ఞప్తిచేస్తున్నారు. దానిలో ప్రతిగ్రామంలోను శృంగవరపుకోట, విజయనగరం, భీమునిపట్నంతాలూకాలలో ఎక్కువ చెరువులున్నాయి. ఒక్కొక్క చెరువుక్రింద మూడువందలు ఎకరాలు, 2 వందలు 3 వందలు అయిదేసివందలఎకరాలు మాగాణిభూములున్నవి. 1931 లో తుపానువల్ల చెఱువులు మేటలుపడినాయి. Estate manager కు దరఖాస్తులు పెట్టుకుంటే 50 వేలుదాటేక P. W. D. అంటున్నారు. అటువంటి పరిస్థితులు ఉన్నవి. యీ చిన్నచిన్న వాటికి 30, 40 వేలు దానికయేఖర్చులున్నాయి. ఈ చెఱువులు లోతుచేయించి, ఈ 3 తాలూకాలలో నన్న చెఱువులు బాగుచేయించి వెంటనే నీటిసౌకర్యం కలుగచేస్తారని దీనితో విశాఖపట్నం జిల్లానుపైకి తీసుకువస్తారని ఆశిస్తు ముగిస్తున్నాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ నాగార్జున సాగర్ project కు 120 కోట్ల రూపాయలు, మొత్తాన అవుతుందని చెప్పారు. అందులో యిది 10 సంవత్సరాలలో అవుతుందో లేదో తెలియదు. కాని పండిట్ నెహ్రూగారు చెబుతూ 5 సంవత్సరాలలో నీరు అందించబడుతుందన్నారు. ఆ ప్రకారంగా అంచనా వేసినప్పుడు 5 సంవత్సరాలలో యీనాడు యిచ్చినటువంటి ఒక కోటి 80 లక్షల రూపాయలతోటే పని ప్రారంభమవుతుందనీ మనం 2/3 వంతులు ఇచ్చుకోవలసిన అవసరం వున్నదనికూడా నాకు గుర్తుంది. అందువల్ల 2/3 వంతులలో ఒక కోటి 80 లక్షలు యిచ్చినట్లయితే యీ సంవత్సరానికి యీవిధంగా ఎన్ని సంవత్సరాలవుతుందో చాలా అనుమానంగా వున్నది. అందువల్ల యిది వెంటనే ప్రారంభించాల్సిన అవసరం వున్నది. చేస్తున్నారు. కాని వెంటనే దానికి ఆర్థికసౌకర్యం చేయాల్సిన అవసరం వున్నది మంత్రిగారిని వెంటనే చేయమని కోరుతున్నాను. మరొక విషయం. ఇది ఒక Board క్రింద నడుస్తున్నది. బోర్డు ఒకసారి నిర్ణయం చేసిన తరువాత మళ్లా పాత పద్ధతిలో అక్కడక్కడున్నటువంటి Secretariat level నుంచి కూడా ప్రతి కాగితాన్నీ కదిలించి ఆలస్యం చేయడంవల్ల పని చాలా కుంటుపడే స్థితి వస్తున్నది. అందువల్ల ఒకసారి Board కనుక ఒప్పుకుంటే Secretariat level లో ఆలోచించాల్సిన అవసరంలేకుండా ఏకా ఏకీన ఒప్పుకునే ఏర్పాటుచేసి

నుండియేపోయి సముద్రములో కలుస్తున్నవి. బందరువద్ద సముద్రమునకు 5 మైళ్ల దూరములో త్రాగడానికి నీరులేదు. నడవడానికిరోడ్లులేవు. తినడానికి తిండిలేదు. అక్కడ అయిదువేల ఎకరాలభూమి ఉన్నది. సరిహద్దు ప్రాంతములలోకి కాలువలు తీసుకువచ్చి వదలిపెట్టారు.

East bank channel ద్వారా వచ్చేకాలువలు ఉప్పుకాలువలోకి పోయేటట్లు చేసినట్లయితే 4, 5 వేల ఎకరాలు అక్కడ సాగుఅయ్యే అవకాశము ఉన్నది. 30, 40 వేల రూపాయిలు ఖర్చుపెట్టి ఆ పనులు చేయించినట్లయితే తద్వారా త్రాగడానికి, ఈ సాగుకు, నీటివసతులు కలుగుతాయి. దీనిని తప్పకుండా చేయించవలసిందిగా నేను ఉపముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను.

బందరు తాలూకాలో మంగినపూడికి కాలువలు రోడ్డుకు ఒకప్రక్కకువచ్చి ఆగిపోయినవి. ఆ రోడ్లుదాటి వాటిని అవతలకు మళ్లించినట్లయితే 2, 3 వేల ఎకరాలు సాగయ్యే అవకాశముఉన్నది. వాటి మురుగు సముద్రంలోకి పోతుంది. ఆ ప్రయత్నం చేసినట్లయితే తక్కువడబ్బుతో ఎక్కువలాభము పొందడానికి వీలుంటుంది. కాబట్టి దానినికూడా investigation చేయించాలని ముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను. ఈ సమస్యను జిల్లా ఇర్రిగేషన్ బోర్డు వారి ఎదుటకూడా పెట్టినారు. వారు ఆలోచిస్తాము అన్నారు. ఈ విషయములలో వెంటనే తగుచర్యలు తీసుకొని పనులు పూర్తిచేయించవలసిందిగా, అక్కడ ఇంజనీయర్లకు, అధికారులకు ఉత్తర్వులు జారీచేయించవలసిందిగా ఉపముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను.

SRI N. C. SESHADRI :—అధ్యక్షా, ఉపముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండులన్నింటినీ నేను బలపరుస్తున్నాను. ఈ సందర్భంలో రాయదుర్గము తాలూకాకు సంబంధించిన కొన్ని విషయములు మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను.

రాయదుర్గము తాలూకాలో 9 P. W. D. tanks ఉన్నాయి. అందులో 3, 4 కి హగ్రీనది నీరువస్తుంది. మిగిలిన అయిదింటికి వర్షములుకురిస్తే నీరు వస్తుంది. అది నిరంతరము క్షామమునకు గురియైన ప్రాంతం కాబట్టి, ఆ చెరువులలో మామూలుగా P. W. D. వారు కట్టించిన నాటినుంచి ఒక్కతూరికూడా సర్‌ప్లస్ అయినట్లుగా నాకు కన్పించడములేదు. అందులో ముఖ్యముగా సముద్రముఅనే చెరువు 9 వేల ఎకరముల అయకట్టుకట్టిన నాటినుంచి, ఈనాటివరకుకూడా సర్‌ప్లస్ కాలేదని తెలుస్తున్నది. ఇంజనీర్లదగ్గరకుపోయి, హగ్రీనదిలోనుంచి దీంట్లోకి నీరువచ్చే అవకాశాలు ఏమైనాఉన్నాయాఅని అడిగినాను. అవకాశములు ఉన్నాయికాని, మైసూరుస్టేటులోనుంచి 7, 8 మైళ్లు పొడుగున కాలువ తీసుకురావలయునన్ని వారు ఒప్పుకుంటారోలేదో తెలియదని చెప్పారు.

అదేవిధంగా ఏచెఱువులోకికూడ హగ్రానదినుంచి నీరుతీసుకుని రావలయునంటే మైసూరుస్టేటు అడ్డంవస్తున్నది. అందువల్ల మైసూరుస్టేటులోనుంచి కాలువలు త్రవ్వుకోవడానికి మైసూరుప్రభుత్వముతో శాశ్వతమైన ఒప్పందం చేసుకోవలసిందిగా ఉపముఖ్యమంత్రిగారిని కోరుతున్నాను.

భైరవానితిప్పప్రాజెక్టుకు 1956-57 బడ్జెటులో 48 లక్షల 71 వేల రూపాయలు కేటాయించారు. అది 1957 జూన్ నాటికి పూర్తిఅయ్యే అవకాశము ఉన్నదని చెబుతున్నారు. కాబట్టి దానివిషయంలో ఎక్కువశ్రద్ధవహించి ఇంకా ఎక్కువసబ్బును సప్లిమెంటరీ బడ్జటులో అయినా కేటాయించి 1957 జూన్ నాటికైనా తప్పకుండా రెండవపంటకు నీరువచ్చే ఏర్పాటుచేయవలసిందిగా కోరుచున్నాను. 3 సంవత్సరముల క్రింద ఆప్రాజెక్టుక్రింద '0 వేల ఎకరాలకు నీరుపారుతుందని అంచనా వేయబడింది. కాని ఇటీవల 2, 3 సంవత్సరములనుండి పారేనీటినిచూస్తే 3 లక్షల ఎకరాలవరకు సాగయ్యే అవకాశము ఉన్నదని అక్కడి ఉద్యోగస్తులు చెబుతున్నారు. దానికి ఉన్న right side canal ఇంకా 2 మైళ్లుముందుకుతీసుకునిపోయినట్లయితే ఇంకా 15 వేల ఎకరాలు అదనంగా సాగుచేయడానికి అవకాశము ఉన్నది. ఆ విషయమై ప్రభుత్వంవారు తగిన కృషిచేసి పథకాన్ని తయారుచేసి ఇంకా 2 మైళ్లు ముందుకుతీసుకొనిపోయే ప్రయత్నం చేయవలయునని కోరుతున్నాను. ప్రభుత్వం దీనివిషయంలో తగినశ్రద్ధ తీసుకొని, జూన్ నాటికైనా నీళ్లువచ్చే ఏర్పాటుచేసి సక్రమంగా వినియోగపరుచుకోడానికి ఏర్పాట్లు చేస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri B. V SIVAYYA :—అధ్యక్షా! ఇప్పుడు మంత్రిగారు ప్రతిపాదించిన Irrigation demand ను నేను బలపరుస్తూ కొన్ని ముఖ్యవిషయాలను ప్రభుత్వంవారి దృష్టికి తీసుకునివస్తున్నాను. కృష్ణా, పశ్చిమజిల్లా ప్రదేశాలకు నీటిసదుపాయములను అభివృద్ధిచేయాలనే పథకంతోటి, ఆనకట్టలను దృఢతరం చేయాలనే సంకల్పంతోటి కృష్ణాబారేజిని నిర్మిస్తున్నారు. ఈకృష్ణాబారేజీని నిర్మించిన సందర్భంలో అదనపునీటిని ఏఏప్రాంతాలకు ఎలా ఉపయోగించాలని ఈస్కీమును తయారుచేసినట్లు ? దానిని ఉపయోగించుటకుగాను, పెదనందిపాడు high level channel మరోప్రక్క గుంటూరు channel ఉన్నాయని చెప్పివున్నారు. గుంటూరు channel స్కీమునుకూడ అమలుపరుస్తామని చెప్పినారు. ఈ medium size projects కుగాను ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో 2 కోట్లరూపాయలను మాత్రమే కేంద్రప్రభుత్వంవారు కేటాయించినారని, 11 స్కీములను రాష్ట్రప్రభుత్వంవారు కేంద్రప్రభుత్వానికి పంపించారని మంత్రిగారు ఈ Demand ను ప్రతి

పాదిస్తూ చెప్పియున్నారు. కాని ఈ 11 స్కీములలోనూ గుంటూరు channel project ను ఎందుకు చేర్చివుండలేదో తెలియదు. medium size project లను కేంద్రప్రభుత్వంవారు, I. W. D. వారు investigation చేసినారు. వారి ఆలోచనలో నున్న projects నన్నింటినీ యిచ్చివున్నారు. ఏ ప్రాజెక్టుకు ఎంతఖర్చు అవుతుంది ? ఎంత ఆదాయం వస్తుంది ? ఎన్ని ఎకరాల భూమి సాగు అవుతుంది ? అనేదికూడా చెప్పివున్నారు. ఆ brochure లో చూసినట్లయితే ఇప్పుడున్నటువంటి medium size projects అన్నిటికంటే ఈ గుంటూరు channel scheme చాలా చౌకబారైనటువంటిదనీ, రెండుసంవత్సరములలోనే హెచ్చు ఆదాయం వస్తుందనికూడా అంచనాలప్రకారంగా తెలుస్తోంది. ఇటువంటి లాభసాటి అయినస్కీమును medium size projects లోచేర్చి కేంద్రప్రభుత్వామోదానికి ఎందుకు పంపించలేపో మంత్రిగారు శెలవిస్తారని ఆశిస్తున్నాను. పెదనందిపాడు చానల్ విషయంలో దానిని brochure లోచేరుస్తూ scarcity area అని, non-scarcity area అని విడగొట్టి, non-scarcity area లోనిస్కీమును చేర్చినారు దీనిని 2వ పంచవర్ష ప్రణాళికలో చేర్చడానికి వీలుందోలేదో తెలిసికొనగోరుచున్నాను. ఈస్కీమునుపయోగించే గ్రామాలన్నింటిలోకూడ దాదాపు 20, 30 గ్రామాలు మంచినీటికికూడా ఉపయోగించుకొంటాయి: వారు వర్షాధారమైన చెఱువులమీద నే మంచినీటికి ఆధారపడి ఉన్నందువల్ల సంవత్సరంలో దాదాపు 4, 5 మాసాలు 23 మైళ్లదూరంపోయి మంచినీరు తెచ్చుకోవలసిన అవస్థపడుతున్నారు కాబట్టి దీనిని scarcity area లోచేర్చి చాలాకోట్లధనం వెచ్చించి కృష్ణాబారేజి కట్టించి నీటిసౌకర్యములు కలుగజేసే ఒకపథకాన్ని తృప్తికరంగా సద్వినియోగం చేసుకోడానికి పెదనందిపాడు స్కీమును వెంటనే అమలుపరచడానికి ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను.

* SRI C. P. THIMMA REDDI :—అధ్యక్షా మహాశయా ! ఈనాడు మంత్రిగారు ప్రతిపాదించిన Irrigation Demand ను నేను మనస్ఫూర్తిగా బలపరుస్తూ కొన్ని ముఖ్యమైన విషయాలను మంత్రివర్గ దృష్టికి తీసుకొనివస్తున్నాను. కృష్ణానది కాని, తుంగభద్ర నదికాని కర్నూలు జిల్లాలోనుంచి వెళ్లుతూకూడా ఈ క్రింది ప్రాంతం నీటి పారుదల లేక చాలా అవస్థపడుతోందంటే చాలా విచారకరమయిన విషయం. సభ్యులు వారి వారి ప్రాంతాలలో పెక్కు అభివృద్ధి చెందుతూ ఆనందంగా ఉంటూ ప్రపంచమంతా అభివృద్ధి చెందుతూ ఉండగా మా ప్రాంతం చాలా హీనదశలో వుండంతో మాకు చాలా కష్టంగా ఉంది. ఇప్పుడు తెలంగాణా వారికి ఉన్న తైలివితేటలు రాయలసీమవారికి ఉన్నట్లయితే మద్రాసునుండి విడిపోతున్న సమయంలో కొన్ని షరతులు కోరివున్నట్లయితే మా షరతులను మన్నించి

ఉండేవారేమో. అప్పుడు మేము కృష్ణా - పెన్నారు ప్రాజెక్టు కట్టించమని కోరి ఉన్నట్లయితే మా ప్రాంతమంతా నీరు ప్రవహించి మంచి పంటలు పండేవి. మేము మా నాయకులు విశాలమైన దృష్టితో ఆలోచించి చేసినందువల్ల ఈనాడు మాకు ఈ అగచాట్లు రావడానికి అవకాశం ఏర్పడింది. ఆనాడు సిద్ధేశ్వరం, నందికొండ ప్రాజెక్టులను తీసుకువస్తామన్నారు. అది అమలు పెట్టడంలో సిద్ధేశ్వరం ఏమయిందో కాని నందికొండను మాత్రం అమలులో పెట్టినారు. సిద్ధేశ్వరం ప్రాజెక్టు కట్టుట లేదని ఆందోళనచేస్తే ప్రజలను తృప్తిపరచడానికి తుంగభద్ర High Level Channel వల్ల అనంతపురం, కడప జిల్లాలకు నీరు ప్రవహించేలా చేస్తున్నామనీ, నెల్లూరు జిల్లాకు నందికొండ ప్రాజెక్టుద్వారా ఏవోకొన్ని channels అమలు పరుస్తున్నామని చెప్పినారు.

మేము ఆందోళన చేయకపోవుటవలననో 'మా అసమర్థతవలననో' గాని మా ప్రాజెక్టు కట్టుటను నిర్లక్ష్యం చేసినారు. మేము చాలా అవస్థపడుతున్నాము. ఇప్పటి కైనా న్యాయం, ధర్మం ఆలోచించినట్లయితే ముందు మా ప్రాంతానికి నీరు ప్రవహించేలా చేయాలి. ప్రజాశ్రేయస్సును వదలిపెట్టి ఎన్నివిషయాలను వారు చూసు కుంటూంటే ఇది చాలా విచారకరమైన విషయం అని మనవిచేస్తున్నాను. ఇప్పటి కైనా న్యాయం ఆలోచించి సిద్ధేశ్వరం ప్రాజెక్టు పేరుతో అయినాసరే లేక యితర తుక్కు రిజర్వాయర్ అయినాసరే ఏవిధంగా అయిననూసరే ఇప్పుడు తుంగభద్ర హై లెవల్ చానల్ క్రిందకు నందికొండ ప్రాజెక్టు క్రిందకు రానటువంటి ప్రాంతాన్ని అభివృద్ధిలోకి తీసుకువస్తేనే తప్ప మాకు గత్యంతరం లేదని చెప్పి మనవిచేస్తున్నాను.

సమిష్టి మదరాసు రాష్ట్రంలో అరవలువారికి కావలసిన వసతులు కల్పించు కున్నారు. ఇక్కడ బ్రతుకు తెరువు నేర్చిన సర్కారువారు వారికి కావలసిన పనులను కొనసాగించుకున్నారు. ఎటొచ్చీ ఏమీ చేయలేని మా ప్రాంతం మాత్రం నానాటికీ వెనుకబడిపోతున్నది. ఆందోళన చేయడానికి మాకు సమర్థత లేదు. మేము ప్రభుత్వంవారిని అడిగితే K. C. Canal బాగుచేయిస్తున్నాముకదా? అని ప్రశ్ని స్తున్నారు.

SRI S. BRAHMAYYA :—అభివృద్ధి కార్యక్రమాలు ఏమైనా ఉంటే సూచించండి.

SRI C. P. THIMMA REDDI :—ఈ K. C. Canal ఎంతో కాలం నుంచో ఉన్నది. దాని క్రింద కొంత భూమి సాగుఅవుతున్నది. ఆ కాలువను మరమ్మతు చేయించినంత మాత్రాన అభివృద్ధి చేస్తున్నట్లుగా భావించరాదు. K. C. Canal కు సంబంధించిన original scheme లోనే 3 వేల cusecs నీళ్ళు

ప్రవహిస్తుందని, మూడు లక్షల ఎకరాల భూమి సాగుఅవుతుందని ఉన్నది. అంటే ముందు అనుకున్నట్లుగా 3 లక్షల ఎకరాల భూమికి నీరు ప్రవహించేటట్లు చేస్తున్నారు కాని వేరే అభివృద్ధి పథకాన్ని అమలుజరుపుటలేదని మంత్రివర్గంయొక్క దృష్టికి తీసుకొనివస్తున్నాను. K. C. Canal ప్రణాళికలో ఏవో కొన్ని లోపాలున్నాయని, దానివల్ల అనుకున్నంత భూమి సాగు అగుటలేదని ఎక్కడో leakage వుందని గుర్తించి దానిని సరిచేయడానికి మరమ్మతులు జరుపుతున్నారే కాని, కాల్వలో ప్రవహించే నీటిని అభివృద్ధి చేయుటకు గాని, సాగుఅయ్యే ఆయకట్టును పెంచుటకు గాని ఎటువంటి ప్రయత్నమూ జరుగుటలేదు. ఇప్పుడు జరుగుతున్నది కేవలం మరమ్మతు మాత్రమే కాని అభివృద్ధి క్రింద లెక్కవేయకూడదని మనవిచేయుచున్నాను. ఈ 4 కోట్లరూపాయలు ఖర్చుపెడితేనేగాని K. C. Canal మరమ్మతులు కావు అనే అభిప్రాయానికి మంత్రివర్గం ఎందుకువచ్చిందో బోధపడుటలేదు. ఇంజనీర్ల estimates ఇంత హెచ్చుగా ఎందుకు తయారుచేశారో ప్రజలకు తెలియడంలేదు. K.C. Canaకు 7 మైళ్ల భాగం సిమెంటుపూత పూసినంతమాత్రాన మాకు జరిగేదిఏమీలేదు. దానికి బంగారంపూత పూసిననూ రైతులకు ఏమీప్రయోజనంలేదు. కొన్ని చెరువులు త్రవ్వించి కాని, మరికొన్ని కాల్వలు త్రవ్వించికాని నీటివసతులు కల్పించేసినట్లయితే ప్రజలకు ఉపయోగకరమైన పనులుచేసిన వారవుతారు. ఒక్క కాల్వ మరమ్మతుకే ఇంతఎక్కువ డబ్బు ఖర్చుపెట్టడం అనవసరమనుకొంటున్నాను. మరొకవిధంగా ఈ డబ్బును సద్వినియోగంచేసినట్లయితే బాగుండేదని ప్రజలు అనుకొంటున్నారు. ఈ ప్రణాళిక వల్ల మా ప్రాంతం అభివృద్ధిలోకిరాదు. ఇది కేవలం మరమ్మతు చేయడమేనని మరొకసారి మనవిచేస్తున్నాను. ఈ మరమ్మతులు చేయడంలోకూడ ఎన్నో లోపాలు జరుగుతున్నాయి. కాల్వ అడుగుభాగంలో కొంతవరకు సిమ్మెంటుపూత పూస్తున్నారు. కొంతభాగంలో Cuddapah slabs వేస్తున్నారు. బహుశా సిమెంటు తగినంతదొరకుటలేదనుకుంటాను. ప్రభుత్వం లెక్కలప్రకారం ఈ రాళ్ళమందం 8½ అంగుళములకు తక్కువకాకుండావుండాలి. ఇటువంటివి దొరకని కారణంచేత కాబోలు 1½ దళసరిఉన్న 2 పలకలమధ్య కొంత సిమ్మెంటుపెట్టి వేస్తున్నారు. ఇట్టి Slabs అన్నికూడ ఒకేకొలతలుఉన్నవి దొరకుటలేదు. 1½ దళసరిగల పలకలు హెచ్చుగా దొరకవు. అన్నింటియొక్క వెడల్పు, దళసరి ఒకేకొలతలో ఉండవు. అందువల్ల కొన్నిచోట్ల ¼, ¾ అంగుళములు దళసరిగల slabs వేస్తున్నారు. ఇందువల్ల ప్రభుత్వం ఆశించిన ఆశయం నెరవేరదు. సిమ్మెంటు, పలకలను చాలా మందంగా ఉంచితేనేగాని కాల్వలో ప్రవహించేనీరు భూమిలోనికి యింకిపోవడం ఆగదు. పనికూడ అనుకున్నంత చురుకుగా జరగడంలేదు. గతసంవత్సరం ప్రారంభించిన పనులు ఆగిపోవుటవలన వాటినే ఇప్పుడు తిరిగి మొదలుపెట్టినారు

కాని ఒకేరకమైనటువంటి రాయిరావాలిఅంటే దానికి వెనుకగాని ముందుగాని ఎన్నోరాళ్లుతీస్తేతప్ప ఒకేసైజురాయిరాదు. సైజులో కొంతభాగము మాత్రమే ఉంటుంది ఆ విధంగా ఎంత అవస్థపడినప్పటికీ చాలా ఆలస్యము అవుతోంది. Department లో ఉన్నటువంటి వ్యక్తులు ఎంతమంది పనిచేస్తున్నారో అంతమంది కూలీలు పనిచేయడంలేదని మనవిచేస్తున్నాను గిట్టుబాటుకాదనే ఉద్దేశ్యముతో చాలామంది వెళ్లిపోయారు ఉన్నవారు ఆలస్యము చేస్తున్నారు దయచేసి జరిగే పనిమాత్రం బాగా జరిగేదానికొంకు technical గా ఇదిఅంతా ఆలోచించి Assistant Engineer గారు కూడా చాల జాగ్రత్త తీసుకొంటారని ఆశిస్తున్నాను. కాబట్టి అక్కడ ఉన్నటువంటి పని ఏ కారణంవల్లనైనాసరే ఆలస్యం కాకుండా కొద్ది సంవత్సరాలలో ముందుకు పోయేఅవకాశాలను ఇటువంటి పరిస్థితులలో తీసుకొచ్చి తొందరగా ముగింపుచేయాలని మనవిచేస్తున్నాను అంతో ఇంతో ధరలు వుండి రైతులు బాగుపడుతున్నటువంటి ఈ రోజులను వదలిపెట్టి ఎప్పుడో చేసేదానికంటే, ఇప్పుడు చేస్తేనే మంచిది K. C. Canal కట్టలమీదనుంచి పశువులు పోవడమనే ధర్మము ఒకటిఉన్నది K. C. Canal కు ఇరుప్రక్కల slope చేసేట్లయితే దానిలో నీరుత్రాగడానికి పోయే పశువులు అందులో పడిపోవడానికి అవకాశంఉంది పైగా, తిరిగి గట్టుపైకెక్కడానికి వీలులేదు అక్కడక్కడ మెట్లుపెట్టితేనేతప్ప లోపలఉన్న పశువులు బైటికి రావడానికి వీలు ఉండదు అందుకుగాను ప్రత్యేకంగా steps ను అక్కడక్కడ provide చేస్తేనేతప్ప వేరే అవకాశంలేదని Contractors చెప్పుతున్నారు. ఇటువంటి పరిస్థితులన్నీ దృష్టిలో పెట్టుకొని పశువులకు ఇబ్బంది కలుగకుండా ఏదైనా చేయాలని మనవి చేస్తున్నాను. ఇంకొక ముఖ్యవిషయం K. C. Canal water లో కొంత భాగము కుందునదికీ వదలుతున్నారు కుందు ఒక canal కాబోతున్నది. కుందుకు ఇరుప్రక్కల నీటికొరకై గ్రామాలు సృష్టింపబడివున్నాయి. కాని గ్రామం ఒక వైపుఉంటే భూమిఅంతా ఇంకోవైపుఉన్నది ఉదయంలేస్తే గ్రామస్థులు ఆ వైపునుంచి ఈ వైపుకు, ఈ వైపునుంచి ఆ వైపుకు పోవలసిఉంటుంది ఏటిలో ఎప్పుడూ 5, 6 అడుగుల నీ లోతునీరు ఉంటుంది. Bridge కూడా ఎక్కడాలేదు. అందువల్ల అవతలనుంచి ఇవతలివైపుకు పోవడానికి చాల కష్టపడుతున్నారు ఒకవదిన్నీ canal గా ఉపయోగిస్తున్నారు గనుక ప్రభుత్వంవారు 72 మైళ్లవరకు 4 కోట్లు రూపాయలు ఖర్చుపెట్టి, క్రిందివైపునకూడా అదేవిధంగా develop చేస్తే ఎన్నో కోట్లు మిగుల్చుకోవడానికి అవకాశంతగిలింది దీనిని దృష్టిలో పెట్టుకొని కేవలం ప్రజల సౌకర్యార్థమునకై అక్కడక్కడ బ్రిడ్జీలు కట్టవలెనని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI B. RAMA REDDI :—అధ్యక్షా, ఉపముఖ్యమంత్రిగారు ప్రవేశ పెట్టినటువంటి Irrigation పద్దుపై ఏదైన ఒక కోత తీర్మానం తేవడం మంచిదని అనుకుని ఒక కోత తీర్మానము యిచ్చాను ఇది కేవలం ప్రజలకు ప్రాణాధారమైనటువంటిపద్దు కాబట్టి దీనికి ఎంతఖర్చుపెట్టినను చాలదు. ఇప్పుడున్నటువంటి Demand కంటె ఎక్కువ మొత్తాన్ని ఖర్చుపెట్టాలనేది నా కోత తీర్మానం యొక్క ఉద్దేశ్యం. ఈ విషయంలో వెనుక ప్రకాశంగారి ప్రభుత్వం రాయలసీమ అభివృద్ధికొరకై చూపినటువంటి శ్రద్ధకంటె, యీ ప్రభుత్వానికి నా జోహారులు అర్పించలేకుండా ఉన్నాను ఇప్పటి ప్రభుత్వం చూపుతున్నటువంటి శ్రద్ధనుబట్టి చూస్తే ఆనాటిశ్రద్ధ యిప్పుడు తగ్గడానికి అవకాశం ఏర్పడుతోందని నాకు భయం కలుగుతున్నది

ఎందువల్లనంటే విశాలాంధ్రనిర్మాణమువిషయంలో తెలంగాణావారికి భస్మాసురవరాలన్నీ ఇష్టమువచ్చినట్లు ఇచ్చినారనే సందేహంకూడా ఉన్నది. మేమేదో వెనుకబడినప్రదేశమువాళ్లము మాకేదో అదిచేయాలి, ఇదిచేయాలి అంటూ అందరు మావైపునే యింతవరకూ మాట్లాడుతూవచ్చారు. ఇప్పుడు మాకు పోటీవచ్చింది. ఇక ముందునుంచి రాయలసీమవారము సవతితల్లిబిడ్డలమాదిరి అయిపోతామేమోననేభయం మాకు కలుగుతున్నది. "వెలుగు ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోమన్నట్లు," హైదరాబాదుకు పోకముందే రాయలసీమవారికి చేయగలిగినపనులన్నీ ముందుగానే చెయించవలెనని ఉపముఖ్యమంత్రిగారిని ప్రార్థిస్తున్నాను. మా నియోజకవర్గం గురించి నేను చెప్పకుంటాను. మా తాలూకాలో తగిలేరు ప్రాజెక్టును మధ్యమతరగతి scheme ను ఏర్పాటుచేసినారు. ఏమిమాట్లాడినా దానిని అడ్డంపెట్టుకొని మాట్లాడడం అలవాటైపోయింది దానివల్ల దాదాపు ఏ 30 పాళ్ల ఆదాయమో కలిగిందేగాని నిజం చెప్పాలంటే అది unremunerative scheme అని అందరు ఒప్పుకుంటున్నారు. చాలాకాలంనుంచి మా తాలూకాలో తడుకువాకప్రాజెక్టును గురించి ఆందోళన జరుగుతోంది. నిదానంగా చేసినందువల్ల Engineering department వారు ఇది ఎక్కువ లాభకరమైందని తగిలేరు ప్రాజెక్టుకంటె ఇది ఒకవిధమైనటువంటి assesment తెస్తుందని అభిప్రాయపడుతున్నారు తడుకువాక ప్రాజెక్టువల్ల మరొకలాభం ఉంది. రాజుపాలెం రాచెరువుఆనే చెరువుకు అదుపు ఎక్కువచేయబడుతూ ఉన్నది. అప్పుడు రెండుగ్రామాలు మునిగిపోయే అవకాశం కూడా ఉంది. అందువల్ల గోపవరంపల్లె, చిన్నపల్లెలోనివారికి పునరావాస సౌకర్యం కల్పించవలసిన బాధ్యత మనపై ఉన్నది కాబట్టి తడుకువాక ప్రాజెక్టు కట్టించినట్లయితే అక్కడ ఉన్నటువంటి భూములన్నీకూడా వారికి ఇచ్చేందుకు అవకాశం ఏర్పడుతుంది. తడుకువాకప్రాజెక్టు కట్టించినట్లయితే క్షామములో

భాధపడుతున్నటువంటి దానికిచుట్టుప్రక్కల 10 పల్లెల జనాభా బ్రతకడమేకాక 2.4 return ఇస్తూ అది గొప్పప్రాణాధారకరమైనదనికూడా అభిమానిస్తున్నారు. దయచేసి దానిని తక్షణమే detailed investigation చేయించి పని జరిపించే మార్గం చూడవలెనని స్పీకరుగారిద్వారా ఉపముఖ్యమంత్రిగారిని ప్రార్థిస్తున్నాను. మఠేరుప్రాజెక్టు అని ఇంకొకటివున్నది ఇదికట్టి దాదాపు ఎన్నిసంవత్సరాలయిందో నాకు తెలియదు దానికి ఒకవిధమైనటువంటి రూపంకూడాలేదు. ఈవిధంగా చెప్పుకోవలసినవి చాలావున్నాయి. వాటిలో ముఖ్యంగా లింగాల, చినపల్లిచెరువు, భూమిరెడ్డిపల్లె పెద్దచెరువుల repairs విషయమై, Chief Engineer గారు తగిలేరు ప్రాజెక్టుకొరకు వచ్చినపుడు, వారికి నేను మనవిచేశాను వారు వెంటనే Executive Engineer గారితో ఇది చిన్నస్కీము మంచిదిగాకూడ ఉన్నది, దీనిని కూడా తీసుకోవలసిందని oral గా ఉత్తరువు ఇచ్చినారు. దానికి ఇంతవరకు అతీ గతిలేకుండాపోయింది కాబట్టి వాటినికూడా బాగుచేయించవలెనని స్పీకరుగారి ద్వారా ఉపముఖ్యమంత్రిగారికి విన్నవించుకొంటున్నాను. తదుపరివాక, మఠేరు ప్రాజెక్టులను సత్వరమే detailed investigation చేయించి పని ప్రారంభించి నట్లయితే రెండుప్రాజెక్టులక్రిందవున్న ప్రజానీకముకూడా ప్రభుత్వానికి కొంతమటుకు సహాయంచేసేందుకు సిద్ధంగావున్నది. ఈవిషయంలో ప్రత్యేకశ్రద్ధవహించి ఇదివరకు మామీద చూపినప్రేమనే ఇకముందుకూడా చూపుతూ హైదరాబాదు పోకముందే, ఈసహాయం అయినా చేయవలెనని ఉపముఖ్యమంత్రిగారిని, Chief Engineer గారిని ప్రార్థిస్తూ ఇంతటితో నేను విరమిస్తున్నాను.

SRI B. APPA RAO :—అధ్యక్షా, Irrigation పద్దువిషయం మాట్లాడే టప్పుడు budget speech లో ప్రధానమంత్రిగారు చెప్పినవిషయమై ఉపముఖ్య మంత్రిగారికికూడా చాలాబాధతో చెప్పవలసివస్తున్నది. ఉపముఖ్యమంత్రిగారు తెరుగుజిల్లాలోని తరుగును భర్తీచేయుటకై చాలా కృషిచేశారు. ఎంతధైర్యవంతు లైనప్పటికినీ, తప్పుచేశామని గ్రహించుకొన్నపుడు పశ్చాత్తాపపడతారు. ఈరోజు ఉపముఖ్యమంత్రిగారు వారిభాషణలో దానిని చూపించారు. Minor irrigations విషయంలో కొంత అన్యాయం జరిగిందనే ధోరణి వారిభాషణలో నేను అర్థం చేసుకోగలిగాను. వారిభావాలలో దానిని ఎప్పుడైతే ప్రకటించారో అప్పుడే దానిని పూర్తిచేయడానికిగల సాహసం వారికి ఉన్నదని, కృషి చేస్తారని మా ఆశ. ముఖ్యంగా మూడు జమీందారీజిల్లాలలో, విశాఖపట్టణం, చిత్తూరు, శ్రీకాకుళం జిల్లాలు, శ్రీకాకుళానికి ఇంతకంటె ఎక్కువ తాపత్రయపడుతున్నారనే సంగతి నిజమే కావచ్చు, కాని డబ్బులేదు. డబ్బు తెచ్చుకొనేందుకు తీవ్రమై నటువంటిప్రయత్నం చేయాలి. శ్రీ లంక సుందరంగారు, పార్లమెంటు నియోజక

వర్గంసభ్యులు ఈమధ్య సంచారముచేస్తూ ఆంధ్రప్రభుత్వము విశాఖజిల్లాలవిషయమై శ్రద్ధతీసుకోవడంలేదు. Scheme లేమి పంపడంలేదు. ప్లానింగ్ కమిటివారికి పంపించేటటువంటి స్కీములవిషయంలో estimates పంపించడంలేదనికూడా వారు చెప్పారు. అదంతా portfolio నిర్వహిస్తున్నటువంటి ఉపముఖ్యమంత్రిగారికే తెలియాలి. స్కీములుమాత్రమే పంపించి estimates పంపించకపోవడం అనేది, చాలా అన్యాయమైనటువంటిదనే గాలిదుమారం విశాఖ జిల్లాలో లేగింది. ఒక్క విషయం ఉపముఖ్యమంత్రిగారు దృష్టిలో పెట్టుకోవాలి. మా జిల్లాలోకూడా అన్యాయం జరిగింది. అది చాలా తరుగుజిల్లా. మాజిల్లాలో ఉన్నటువంటి ప్రాజెక్టులన్నీ కలిపితే ఎంకోడబ్బు ఖర్చుకాదు ఎక్కువఫలితాలు ఇస్తాయనికూడా మంత్రిగారికి తెలుసు. వాటిలో వరద నివారణస్కీములనుకూడా కలుపవచ్చు. Minor Irrigation schemes, medium schemes ఎక్కువ. నా చిన్నతనంలో నేను క్రొత్తగా రాజకీయాలలో ప్రవేశించినపుడు శారదా రిజర్వాయరు విషయంలో ముందుకు బైలుదేరాను. చేతిలో కాంగ్రెసుజండాపట్టుకొని నెత్తిన గాంధిటోపీ పెట్టుకుని రాజగోపాలాచారిగారు రావడంతో మేము శారదా రిజర్వాయరు నినాదంతో బయలుదేరి ఉన్నాము.

శారదా Reservoir కు 1939 లోనే investigation జరిగింది. అది ఈవేళ ఆఫీసులో ఉంటున్నది. అది స్వల్పఖర్చుతో 5 తాలూకాలకు ఉపయోగపడుతుంది, విశాఖ జిల్లా కొరతను పూర్తి చేస్తుంది, అనే విషయము ఆ నివేదికలో ఉన్నదని నాకు బాగా జ్ఞాపకము, ఆ స్కీముకు District Engineer, భాగవతుల సుబ్బారావుపంతులుగారు నియమింపబడ్డారు అనుకొంటాను. యాకుబ్ హుశేన్ గారు వారిని నియమించారు, వారు investigate చేసి, అది స్వల్ప ఖర్చుతో ఎక్కువ ఫలితాలను ఇస్తుందని వారు చెప్పారు. అది అయిదు తాలూకాలకు, దక్షిణ ప్రాంతములో, విశాఖపట్నం మొదలుకొని తునివరకు అది ఉపయోగపడుతుంది. తాండవ, వరాహాకు కట్టలుకట్టి, దానిని శారదా Reservoir తో కలపకుండా, మీద శబరికివస్తున్నటువంటి నీరుకు అడ్డంకులు తొలగించి, శృంగవరపుకోట, గూడెము Agencies లో ఉన్నటువంటి ఆ నీరును దానికి తిప్పుకొంటె, అది యావత్ జీవనది అయిపోతుంది. అక్కడి నీరు ఇక్కడ గోదావరకివస్తే అది నిరుపయోగమవుతుంది. ఆ నీరును విశాఖ జిల్లాకు ఉపయోగించుకోవచ్చునని కూడ వారు అందులో చెప్పారు. నిజంగా ఆ ఏజెన్సీలలో చూస్తే, ఏదో అక్కడకూడ కొన్ని అడ్డంకులు తప్పితే, Eastern Ghats నుంచి ఆ కొండలమీదుగా ఎన్నో వందల మైళ్లు నుంచి నీరు వస్తూ ఇక్కడ గోదావరిలో కలుస్తూఉన్నది. అక్కడ చిన్నచిన్న అడ్డంకులు తొలగిస్తే, ఆ నీరును శారదాకు, వరాహాకు ఉపయోగించు

కోవచ్చును అనేటటువంటి అభిప్రాయము ఉన్నది. అది తక్కువ ఖర్చుతో చేయవచ్చును. దాన్నిగురించి ఉపముఖ్యమంత్రిగారు ముఖ్యంగా కృషిచేస్తారని ఆశిస్తున్నాను మా పార్లమెంటు నియోజకవర్గ సభ్యులు, శ్రీ సుందరంగారు చేసినటువంటి ఆ అభియోగాన్నే మేముకూడ నమ్మవలసియున్నది. ఇప్పటివరకు జాలము జరుగుతున్నటువంటి పనుల విషయంలో, నిజముగా వాటికి చేస్తున్నటువంటి కృషిని ఉపముఖ్యమంత్రిగారు ఈ సభద్వారా వెల్లడిచేస్తే, అక్కడ ప్రజలలో ఉన్నటువంటి ఆందోళన తొలగించిన వారవుతారు, ముఖ్యంగా ఇది వారికి తెలియాలి, తెలిస్తే వారు అది ఒప్పుకొంటారనుకొంటాను, ఇది బహిరంగ నగ్న సత్యము. చిత్తూరు జిల్లాలోకూడ కొంత పనిచేశారు స్వర్ణముఖి ఆనకట్టతో, అలాగునే శ్రీకాకుళంజిల్లాకుకూడ రెండవ పంచవర్ష ప్రణాళిక తాలూకు schemes పూర్తి కావలసియున్నది. అవి పూర్తి అయితే, శ్రీకాకుళం జిల్లా కొరతకూడ తీరుతుంది. అందుచేతనే, majors అయినటువంటి వారు minors అయినటువంటివారికి అన్యాయం చేయకుండా ఈ minor irrigation విషయాలు ఎక్కువ దృష్టిలో పెట్టుకొని కృషిచేసి న్యాయం చేకూరుస్తారని ఆశిస్తూ ఈ demand ను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను.

SRI N. SRINIVASA RAO.—అధ్యక్షా, అందరుకూడ చాలా ముఖ్యమైన సూచనలు చేశారు, గాని ఉపముఖ్యమైన సూచనలు ఏవికూడ ఉపముఖ్యమంత్రిగారికి చేయలేదు. అయితే నేను ఉపముఖ్యమైన సూచనే ఒకటి చేస్తున్నాను. సమయము ఎక్కువలేదు కాబట్టి త్వరలోనే ముగిస్తున్నాను. నేను జల్లేరునుంచి కొల్లేరువరకు సంబంధించినటువంటి ప్రతినిధిని, మా మిత్రులు జల్లేరు గురించి చెప్పారు, కాని జల్లేరుకు, కొల్లేరుకు మధ్య ఒక బ్రహ్మాండమైనటువంటి ఎర్రకాల్వ ఉన్నది. ఆ ఎర్ర కాల్వగురించి, మాత్రము చెప్పితే చాలుననుకొంటాను ఇంకా, ఉద్యోగుల విషయము, Telephone గుమస్తాల సంగతి, అనేక విషయాలు చెప్పాలని సిద్ధపడినాను. కాని పిరదాసి మాదిరి అయిపోయింది, నా పద్యాలు, నా శ్లోకాలు నాపద జాలమంతా భగ్నమైపోయింది. Budget Session లో కూడ time లేకుండా ఉంది అవన్నీ చెప్పడానికి. Irrigation మనదేశానికి చాలా ముఖ్యమైనది, గనుక ఈవిషయంలో నేను మాట్లాడడానికి Speaker గారు కొంత time ఎక్కువ ఇయ్యవలసిందని మనవిచేస్తున్నాను.

"ఎర్ర కాల్వ నీరు ఎగదన్నినందున -
బాపినీడు ప్రజలు భయముగొనె"

మా అల్లూరు బాపినీడు గారి constituency లో ఎన్నో కొంపలు దీనివల్ల మునిగిపోయినాయి.

"ఎఱ్ఱకాల్వ భీతి ఎంతయో తెలియంగ
అమ్మన్న రాజాను అడుగుడయ్యా"

ఆమె నియోజకవర్గములో చాలా కొంపలు మునిగిపోయినాయి.

"ఎఱ్ఱకాల్వ కొరకు ఎంత ఖర్చు అయ్యెనో
చంద్రమౌళిని ప్రశ్న చేయుడయ్యా"

మొన్న నే జరిగినటువంటి ఎఱ్ఱకాల్వ భీభత్సంలో ఎన్నో కొంపలు మునిగి దాదాపు లక్ష రూపాయలుకు పైగా నష్టము సంభవించింది. దానికిగాను Emergency Act క్రింద, 30 ఎకరాలకు పైగా ఇళ్ల స్థలాలు ఇచ్చేదానికి ఏర్పాటుచేశారు. Revenue Inspectors, ఇంకా special staff దీనికొరకై పనిచేస్తున్నారు. కాబట్టి నన్ను నేనే ప్రశ్నచేయుడం కాకుండా, చంద్రమౌళిగారిని మీరు ప్రశ్న జేయండి. ఈవిధముగా ప్రతి ఆరు మాసాలకు ఎఱ్ఱకాల్వ పొంగితే ఎన్ని లక్షల రూపాయలు ఖర్చుఅవుతుందో, అది జరుగకుండా కొన్ని లక్షల రూపాయలతో ఒకే సారి ఖర్చుపెట్టి ఈ ఎఱ్ఱకాల్వ ముంపు తగ్గిస్తే ఎంత లాభము ఉంటుందో అది high level లో, అనగా cabinet level లో చంద్రమౌళిగారిని ప్రశ్న చేయుడయ్యా, నన్ను ప్రశ్నించవలసింది ఇంకొకటి ఉన్నదనుకోండి.

"ఎఱ్ఱకాల్వ చరితమెంత ఉన్నదో
ఇంజనీర్ల నడుగుడయ్యా"

ఇంజనీర్లను అడిగినట్లయితే, దీనికి history ఎంత ఉన్నదో, దీని పుట్టు పూర్వోత్తరాలంతా వారు మీకు ఇస్తారని మనవిచేస్తున్నాను.

"భీకర స్వరూపమై భీభత్సమై
బుసలుకొట్టుచు ఆకాల్వ మెసలనీదు
వెంటనే దాన్ని మరమ్మతు చేయించుడయ్యా
పేరు నిల్చును సంజీవ ప్రముఖరెడ్డి"

దీన్ని నాదయుక్తంగా చదువలేదనుకొని మీరు తేలికగా తీసివేయకండి, ఈ కవిగారి మాటల్లో సత్యమున్నదని మనవిచేస్తున్నాను. నేను ఏ మోహనరాగంలోనో ఆలాపించగలను గాని ఇది దానికి place కాదు. కాబట్టి ఇక్కడ ఆలాపించలేను, కృష్ణావతారంగారు, నేను మా నియోజక వర్గాన్ని బాగుచేస్తామని ప్రజలు ఏదో అనుకొంటున్నారు. అటువంటి సావకాశము ఉంటే సంతోషిస్తాను. భగవంతుని దయవల్ల నేను డాక్టరును కాకపోయినందునను, lawyer ను కాకపోయినందునను, ప్రజాసేవచేయడానికి, ఏ ఖూని కేసుగాని పురుటి కేసుగాని నాకేమి అడ్డంలేదు. కాని ఒక విషయం మనవిచేసున్నాను.

"కృషితో నాస్తి దుర్భిక్షం
జపతో నాస్తి పాతకః"

మౌనేనా కలహం నాస్తి॥

అన్నారు. కాని "కృషితో నాస్తి దుర్భిక్షం" అనేది మాత్రం నాకు ఎక్కడ కన్పించడంలేదు, నేను నా నియోజకవర్గములో 24 గంటలు తిరిగి కృషిచేస్తున్నప్పటికి, దుర్భిక్షమే కన్పడుతున్నదిగాని సుభిక్షమెక్కడ కన్పించలేదు, అయితే, "మౌనేనా కలహంనాస్తి" అనేది ఒకటి మిగిలిపోయింది, ఎందుచేతనంటె, ముఖ్యమంత్రిగారు చిదానంద స్వరూపుడైన మౌనంగా ఉంటున్నారు కాబట్టి ఎంత విమర్శించినా, మా ఇద్దరికి కలహం రావడంలేదు, అందుచేత చివరిభాగం "మౌనేనా కలహం నాస్తి" అనేది ఒకటి మిగిలి "కృషితో నాస్తి దుర్భిక్షం" అనేపదము ఎగిరి పోయింది.

కనుక నేను ముఖ్యంగా ఈ ఎర్రకాల్వ విషయం ఈ పద్యరూపంలో దానిలో ఉండే గణాలను యతి ప్రాసలనుకూడ చూచుకొని, ఈ సమస్య ఎంత బరువుతో, ఎంత దుఃఖముతో ఎంత ఆవేదనతో కూడుకున్నదో, దాన్నంతటిని క్లుప్తంగా nut shell గా చెప్పాను. దానివెనుక దుఃఖసాగరాలు చాలా ఉన్నాయి. కనుక ఈ విషయంలో ప్రభుత్వము ప్రత్యేక శ్రద్ధ వహించి కృషిచేయవలెనని మనవిచేస్తూ, ఇంత తక్కువ అవకాశము ఇచ్చినందుకు అధ్యక్షులవారికి ఎక్కువ నమస్కారాలు తెలుపుతూ సెలవుతీసుకొంటున్నాను.

Sri P. VENKATASWAMI REDDI :—అధ్యక్ష మహాశయా, ఇటీవలనే వెంకటగిరి తాలూకాలో కోటవాకిళ్ల ప్రాజెక్టు నిర్మించినందుకు ప్రభుత్వమువారిని అభినందిస్తున్నాను. ఈ సందర్భములో ఈ శాఖామాత్యులగు సంజీవరెడ్డిగారు చెసినకృషికి ఆ ప్రాజెక్టుపౌరుల తరఫున వారికి కృతజ్ఞతాభివందనములు అర్పిస్తున్నాను. ఇదే సందర్భంలో ప్రభుత్వందృష్టికి ఒక ముఖ్యమైనటువంటి విషయం తీసుకురావలచినాను. నాగార్జునసాగరుతోపాటు వంశధార, తుంగభద్ర High level channel, ఈ రెండింటికి ఎంతో వ్యతిరేక ప్రచారము జరిగినప్పటికీకూడ, ఎంతో కార్యదీక్షతతో వీటిని నిర్వహించినటువంటి శ్రీ సంజీవరెడ్డిగారు సోమశిల ప్రాజెక్టు నిర్మాణానికికూడ పూనుకొంటారని నెల్లూరుజిల్లా ప్రజలందరుకూడ ఎంతో ఆశించినారు. కాని మా ఆశ ఈ నాటికి కార్యరూపము దాల్చలేదు. అయినప్పటికికూడ మేము నిరాశ చెందడంలేదు. వారు దీన్నిగురించి కూడ ఎక్కువ శ్రద్ధవహించి ఈ ద్వితీయ ప్రణాళికకాలములో, దానిని ఏ విధముగానైనా పునాదిరాయి స్థాపించడానికి కృషిచేస్తారని, ఆ జిల్లాపౌరుల తరఫున వారిని ముఖ్యంగా ఎంతో వినయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను. తరువాత minor

Sri P. Venkataswami Reddi] [19th March 1956

projects నిర్మాణానికిగాను కేంద్రప్రభుత్వమువారు ఇచ్చినటువంటి రెండుకోట్ల రూపాయలను వినియోగించే విషయంలో వెనుకబడిన ప్రాంతాలకు ప్రాధాన్యత ఇవ్వవలసిందని నేను ప్రభుత్వంవారికి మనవిచేస్తున్నాను. వెనుకబడిన ప్రాంతాలలో పెద్ద ప్రాజెక్టుల నిర్మాణం ఎప్పుడో జరిగినప్పటికికూడ అక్కడ కొండకాల్వలు అనేకము ఉన్నాయి. వాటికి స్వల్పంగా ఖర్చుచేసినట్లయితే, ఎక్కువ ఎకరాలు సాగుఅయ్యేదానికి అవకాశముంటుంది. ఉదాహరణకు, కోటవాళ్ల ప్రాజెక్టుకు ఒకలక్ష, పదివేల రూపాయలుమాత్రమే ఖర్చుఅవుతుందిగాని దానివలన అయిదువేల ఎకరాలు సాగుఅయ్యే అవకాశముంది. అదేవిధంగా అక్కడ అనేక కొండ కాల్వలు ఉన్నాయి. వాటన్నిటికి స్వల్పంగా ఖర్చుచేసినట్లయితే, ఎక్కువ ఫలితాలు వచ్చేటటువంటి పరిస్థితులు ఉన్నాయి. కాబట్టి, Minor irrigation projects నిర్మాణానికి ఈ రెండుకోట్ల రూపాయలు వినియోగించే విషయంలో, వెనుకబడిన ప్రాంతాలకు ప్రథమస్థానము ఇవ్వవలసిందని నేను మనవిచేస్తున్నాను.

తరువాత ముఖ్యంగా జమీందారీ ప్రాంతాలలో Food Production Department అని ఒకదాన్ని ఏర్పాటుచేశారు. ఈ నీటి వనరులను ఏర్పాటుచేసే సందర్భంలో, కాని execution, irrigation రెండూకూడ ఆ Department కే ఉన్నందువల్ల కాలయాపన చాలా జరుగుతూఉన్నది. పని చురుకుగా జరగడం లేదు. ఆ Department వారుకూడ Investigation చేసేదానికి Special division ను ఏర్పాటు చేయవలసిందని అనేకసార్లు ప్రభుత్వానికి సూచించి ఉన్నారు. Chief Engineer గారుకూడ దానిని సిఫార్సు చేసిఉన్నారు. దానిని ప్రభుత్వంవారు చాలా కాలమునుంచి చూస్తూనే ఉన్నారు. కాని ఈనాటికి కూడ దానిని sanction చేయలేదు, ఈ జమీందారీ ప్రాంతాలలో నీటివనరుల విషయం ముఖ్యంగా శ్రద్ధవహించవలసిన అవసరంఉన్నది. కాబట్టి ఈ investigation కు special division ను ఏర్పాటు చేసేదానికి ప్రభుత్వము తప్పకుండా పూనుకోవలసిందని మనవి చేస్తున్నాను.

మరొక విషయముఉన్నది. జమీందారీ ప్రాంతాలలో Food production department వారు పనిచేసేవిషయములో వారు మామూలుపద్ధతి కాకుండా ఏ పద్ధతి అవలంభిస్తున్నారోగాని, మా వెంకటగిరి -తాలూకాలో అలివిరి చెరువు అని, నిండలి చెరువుఅని రెండు చెరువులుఉన్నవి. ఇప్పటికి మూడు సంవత్సరముల క్రిందటనే ఉపముఖ్యమంత్రిగారికి యీ చెరువులను గురించి విన్నవించుకోవడము జరిగింది. అప్పుడు వారియొక్క special instructions మీద ఆ చెరువులను repair చేస్తున్నారు. కాని యింతవరకు ఆ చెరువులకు పడినగండ్లు పూడ్చటము, చెరువులను రిపేరుచేయడము కానేలేదు. రిపేరుచేయడములోను, గండ్లను పూడ్చి,

చెరువులను బాగుచేయడములోనూ చాలా కాలవిలంబనం జరుగుతున్నది. బ్రిటిషు వారి హయాములో కాలవిలంబనం జరిగినట్లుగా, మనకు ప్రజాప్రభుత్వము వచ్చిన తరువాతగూడ, చెరువులను మరమ్మతు మరుసటి సంవత్సరము పంటలు పండించ టానికి వీలుగా రిపేరుచెయడము కన్పించలేదు. పనులు త్వరత్వరగా జరిపించకపోతే రైతులకు పంటలులేక ఎంతో నష్టపడడము సంభవిస్తున్నది. జమీందారీలు రద్దు చేసి, ప్రభుత్వము స్వాధీనము చేసుకుంటే, ప్రజలకు ఎంతో లాభదాయకముగా ఉంటుందని ఆశించాము కాని లాభదాయకము బదులు నష్టదాయకమే కనబడు తున్నది. ఒక సంవత్సరములో యీ చెరువులు రిపేరుచేయించి, నీటివసరులు కల్పిస్తే, రైతులు పంటలుపండించుకోటానికి వీలుఉంటుందిగాని సంవత్సరాలకొద్దీ కాలవిలంబనంచేస్తే, రైతులు ఎంతనష్టపడుతున్నారో, ప్రభుత్వము గ్రహించినట్లు లేదు. ముఖ్యంగా చెప్పాలంటే, నిందలిచెరువు అనేది బొత్తుగా ఎండిపోయింది. ఈ చెరువులు వరదలవల్ల గండ్లుపడి పాడైపోయినవి, యిది వెంటనే రిపేరు చేయించ మని యిప్పటికి మూడు సంవత్సరాలక్రిందట మంత్రిగారినికోరితే, వారు special instructions యిచ్చినప్పటికినీ, రిపేరు పూర్తికాలేదు, గండ్లు పూడ్చలేదంటే, యిది చాలా శోచనీయముగా ఉన్నది, కాబట్టి యిప్పటికైనా ఉపముఖ్యమంత్రి గారు యీ విషయములో సత్వరచర్య తీసుకుంటారని, చెరువులు వెంటనే రిపేరు చేయిస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

SRI G. RAMASWAMI REDDI :—అధ్యక్షా. ఉపముఖ్యమంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండుసందర్భంలో మంత్రిగారిదృష్టికి కొన్ని ముఖ్యమైనవిషయాలు తీసుకొనిరాదలచాను. నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రభుత్వంవారు కట్టబోతున్నారు, దానివల్ల దానికిచెందిన రైతాంగము బాగుపడవచ్చునని రైతులు ఎంతోమంది ఆశిం చారుకాని, తీరాచూస్తే యీప్రాజెక్టువల్ల రైతాంగానికి ఫలితము త్వరలో అందుతుందని భావించటానికి వీలులేకుండ ఉన్నది. ఈప్రాజెక్టుయొక్క second phase లోనూ, third phase లోనూ పులిచింతల ప్రాజెక్టుగూడ కట్టబోయేటట్లున్నా, ఆప్రాంతములోనిభూమి సుమారు ఒకటిన్నర లక్షో, రెండులక్షలో ఎకరాలు యీ ప్రాజెక్టులక్రింద మినహాయించడము కనబడుతున్నది. దీనివల్ల నందికొండప్రాజెక్టు యొక్క సత్ఫలితమును పొందటానికి అవకాశము కలిగించక ఏవో కొన్ని కారణ ములు చూపుతూ, ఆ నందికొండ ప్రాంతపురైతాంగముమీద చిన్నచూపుచూడడము న్యాయముకాదు. ఇదివరకు యీ విషయములో Chief Engineer గారికి అనేక సార్లు అక్కడప్రజలు చెప్పుకోవడముకూడ జరిగింది. నందికొండ ప్రాజెక్టుకు సంబంధించిన రైతాంగముయొక్క కష్టములు, అభివృద్ధి వారు గ్రహించివుంటారను కుంటున్నాము. నందికొండ ప్రాజెక్టు త్వరలోకట్టించి, ప్రజలకు దానియొక్క

Sri G. Ramaswami Reddi] [19th March 1956

ఫలితము అందజేయటానికి కృషిచేయవలసిందిగా వారితో మొరబెట్టుకున్నారు. కాబట్టి ఉపముఖ్యమంత్రిగారు యీ నందికొండప్రాజెక్టుకు సంబంధించిన రైతాంగము యొక్క మొర బాగా ఆలోచించి ముఖ్యంగా గుంటూరు, సత్తెనపల్లి తాలూకాలలో అందుబాటులో ఉన్న మెట్టప్రాంతాలను దాని ఆయకట్టులో చేర్పించి, నీరును ముందుగా పారుదల అయ్యేటట్లు చేయవలసిందని ప్రార్థిస్తున్నాను.

అదేమాదిరిగా ఉండవల్లినుంచి వైకుంటపురంవరకు పొర్లుకట్టలువేయటానికిని, కంకట్టగూడ వేయటానికి కోరుతూ గతబడ్జటు సమావేశములోనే శ్రీమేకా కోటిరెడ్డిగారు, శ్రీరాములుగారు మొదలైనవారందరు మంత్రిగారిదృష్టికి తీసుకొనిరావడము అయింది. దానికి సంబంధించినంతవరకు estimates గూడ తయారైనవి. గాని యింతవరకు దానిని అమలుజరుపలేదు. దాని ఫలితముగా అక్కడ కట్టలు వేయకపోవడమువల్ల, ఆప్రాంతపుప్రజలు దాదాపు ఇరవైగ్రామాలరైతులు ప్రతిసంవత్సరముకూడ వారికి ఉన్నటువంటి వేలకొలది ఎకరాలు నదీగర్భములోకిపోవడము తటస్థిస్తున్నది. కాబట్టి మంత్రిగారు యీ విషయము Chief Engineer గారితో పూర్తిగా చర్చించి, యిప్పుడువాటికి estimates అన్నీ తయారుగానే ఉన్నవి కాబట్టి కేంద్రప్రభుత్వం వారికి వరదనివారణస్కీముక్రింద సిఫార్సుచేసి, తక్షణ చర్యతీసుకోవలసిందిగా కోరుతున్నాను. ఈ విజ్ఞప్తి నేను సుమారు రెండుమూడు లక్షల ప్రజలతరఫున మంత్రిగారికి విన్నవిస్తున్నాను. ఇది ఆప్రజలయొక్క ఏకైక కోరికగనుక, ప్రజాప్రతినిధిగా నేను యీ విషయమును మంత్రిగారిదృష్టికి తీసుకొని వస్తున్నాను.

ఇదిగాక వైకుంఠపురమువద్ద lift irrigation స్కీము ఒకటి ఉన్నది. దానినిగురించి రెవిన్యూడిపార్టుమెంటువారిద్వారా ప్రభుత్వదృష్టికి ఆ ప్రాంతపు ప్రజలు తీసుకునివచ్చారు. ఎకరానికి నూరు రూపాయలచొప్పున యివ్వటానికి ప్రజలు సిద్ధంగాఉన్నారు. ఈ స్కీమును ప్లానింగుక్రిందకు తీసుకొని అమలుజరిపించండి. లేకపోతే పబ్లికువర్క్సు డిపార్టుమెంటువారిద్వారాగానైనా యీ lift irrigation పెట్టించి, ప్రజలకు సౌకర్యాలుకలిగించండి అని కోరుతూ ప్రభుత్వమువద్దకు ఎన్నో సార్లు రాయభారాలుకూడ పంపడము జరిగింది. కాని ఇక్కడ ప్లానింగువారు కాని, P. W. D. వారుకాని, అది ఎవరికి సంబంధించిఉంటే వారు యీ స్కీమును వెంటనే take up చేసి, అమలుపెట్టించమని కోరుతున్నాను. ఇదేవిధముగా కృష్ణానదీప్రాంతములో, నీటివసరులులేని మెట్టప్రాంతాలలోని రైతులు అతివృష్టి అనావృష్టివల్ల పంటలుపాడైపోయి, ఆర్థికదుస్థితిలో మునిగితేలుతున్నారు. అటువంటిచోట్లలో యీ విధమైన lift irrigation స్కీములను ఏర్పాటుచేస్తే, ప్రజ

లకు ఉపయోగముగా ఉంటుంది. మంత్రిగారు యీ విషయములో శ్రద్ధతీసుకుంటా
రని ఆశిస్తున్నాను.

తరువాత పబ్లికు వర్క్సు డిపార్టుమెంటులో జరిగే దుబారాఖర్చును ప్రభుత్వము అరికట్టవలసి ఉన్నది. ఈ దుబారాఖర్చు ఎన్ని విధములుగా జరుగుతున్నదో సంజీవరెడ్డిగారికి తెలుసును అనుకోను, గాని, వారికి తెలియకుండానే ఎన్నోఖర్చులు జరుగుతున్నవి. ఈ డిపార్టుమెంటువారు ఏర్పాటు చేసే కంట్రాక్టర్ల ద్వారానే అనేక విధాలుగా డబ్బును దుర్వినియోగము జరుగుతున్నది. కాబట్టి మనలో మిత్రులు కొంతమంది సూచించినట్లుగా, ఏఏ ప్రాంతాలలో యీ పనులు జరుగుతూఉంటున్నవో, ఆ ప్రాంతపు నియోజక వర్గములకు సంబంధించిన శాసనసభ్యులతో ఒకకమిటీని ఏర్పాటుచేస్తే, కంట్రాక్టర్లతో ఈడిపార్టుమెంటువాళ్ళకు లాలూచీలుగాని, డబ్బు దుర్వినియోగము చేయడముగాని తెలుసుకోవటానికి అవకాశము ఉంటుంది. లంచగొండితనముగూడ లేకుండా రూపుమాసి పోతుందనిగూడ మంత్రిగారికి తెలియజేస్తున్నాను. కాబట్టి యీ కమిటీని ఏర్పాటు చేసే విషయము ఆలోచించమని మంత్రిగారిని కోరుతున్నాను. కమిటీ వేసినందువల్ల ప్రభుత్వానికి నష్టముకలగదు. ప్రభుత్వము డబ్బు దుబారాకాకుండా చూడటానికి వీలుఅవుతుంది. పనులుగూడ అజమాయిషిచేసి సక్రమపద్ధతులలో జరిపించటానికి వీలవుతుందని కమిటీని ఏర్పాటుచేయమని మనవి చేస్తూన్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—కమిటీ అనేది లేకుండానే శాసనసభ్యులైనవారు అలాంటివి గమనించి నా దృష్టికి తీసుకునివస్తే నేను చర్యతీసుకోటానికి సిద్ధముగా ఉన్నాను. కమిటీఅనే పేరుపెట్టినట్లయితే, సభ్యులుకూడా ఆ దుర్వినియోగాలన్నీ నా మాదిరిగానే కనుక్కొనలేరు. కనుక కమిటీఅనేది అవసరములేకుండానే, మీరు, నేను, అందరమూకూడా యీ దుర్వినియోగాలను, దుబారాను, లంచగొండితనమును పట్టుకుని, అరికట్టడానికి ప్రయత్నము చేద్దాము.

SRI P. SATYANARAYANA:—అధ్యక్షా, నీటిపారుదల విషయములో ఆంధ్రదేశానికి రాబోయే ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మొత్తంఖర్చు 27% కేటాయించబడింది. భారతదేశములో ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నీటి పారుదలకుగాను 17% మాత్రమే ప్రత్యేకించినప్పుడు ఆంధ్రరాష్ట్రములో 27% వరకూ కేటాయించుకోవడమనే విషయము చాలా సబబే. ఈ విషయములో మాత్రము ఎవరూకూడ విమర్శించటానికి అవకాశములేదు. ఒకవేళ కేటాయింపుల విషయములోగాని, దానిని ఖర్చుచేసే విషయములోగాని అన్యాయము జరిగింది అనేటట్లయితే, కేంద్రప్రభుత్వము మనకుయిచ్చే Amounts లోనే, అన్యాయము

జరిగిందని మాత్రము చెప్పవచ్చు. కేంద్రప్రభుత్వమే మనకు అన్యాయముచేసిందని చెప్పుకోటానికి మనకు మూడు కారణములు కనబడుతున్నవి. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మొత్తమువిూద రెండుకోట్ల పదిలక్షల ఎకరాలు సాగులోనికి తీసుకొని రావాలని మన ప్లానింగుశాఖవారి draft report లో సూచించబడింది. రెండుకోట్ల పదిలక్షల ఎకరాలు భారతదేశములో మొత్తమువిూద సాగులోనికి రావాలనిఅంటే, ఆంధ్రదేశములో అయిదులక్షల ఎరాలకులోపలనే మనము వ్యవసాయములోనికి తీసుకునివస్తున్నాము అన్నమాట. మనము నాలుగులక్షల ఎనభై నాలుగువేల ఎకరాలుమాత్రమే సాగులోనికి తీసుకొనిరాగలుగుతున్నాము. భారత దేశములోని జనాభాలో మనము 1/18 వంతు ఉంటున్నప్పుడు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద మనము సాగులోకి తీసుకునివచ్చే క్రొత్తభూమి 1/42 వ వంతు మాత్రమే ఉన్నది. దీనిని కేంద్రప్రభుత్వము జాగ్రత్తగా గమనించి మనకు ఎక్కువకోటాయిచ్చి ఉండవలసింది. నీటివసతుల విషయములో భారతదేశములో ఉన్న మొత్తము నీటివనరులలో మనకు 1/7 వ వంతుఉంటే, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద మనము 1/42 వ వంతువరకు మాత్రమే మనము ఉపయోగించుకోటానికి అవకాశము యిచ్చారు. కేంద్రప్రభుత్వము మనకు ఉదారంగా డబ్బు యివ్వకపోవడమువల్ల మనకు అన్యాయము జరిగిందని తెలుసుకోవాలి. మనకుఉన్న 116 కోట్ల రూపాయలలో 27% వరకూ irrigation కోసము తీసుకోవడము అనేదానికి వినుయోగించటానికి అవకాశముఉన్నది. కేంద్రప్రభుత్వంవారు నంది కొండ మొదలైన పెద్ద ప్రాజెక్టులకు ఇతర చిన్న ప్రాజెక్టులకు యిచ్చేయావత్తు డబ్బుకు మార్వాడీలాగు డబ్బుయిచ్చిన రోజునుంచి మనలను వడ్డీఅడుగుతున్నారు. ఇది చాలా దారుణమని చెప్పవచ్చు. ఈ రకమైన దృక్పథమును మన పరిశ్రమల విషయములో కేంద్రప్రభుత్వమువారు చూపుతున్నారాఅంటే, అదేవిూ కనబడదు. టాటాకంపెనీయొక్క ఉక్కు కర్మాగారమును అభివృద్ధిచేయమనికోరుతూ, అయిదు సంవత్సరములపాటు వడ్డీ లేకుండా పదికోట్లరూపాయలు తీసుకోమని చెప్పారు. ఇది గాక Caltex company తీసుకొనివచ్చి విశాఖపట్టణములో ఒక oil refinery కోసము ఒక factory ని కట్టమనిచెప్పి, అయిదేండ్లవరకూ Income tax కట్టనవసరములేదని అన్నారు. పైగా దానికి కావలసిన Machinery అంతా దిగుమతి చేసుకుంటే దానిమీద import duty వేయము అనిచెప్పారు. ఈ విధంగా యింకా ఏవేవో హామీలుకూడ యిచ్చారు.

కేంద్ర ప్రభుత్వం ఒక రాష్ట్ర ప్రభుత్వానికి వ్యవసాయ అభివృద్ధికోసం ఇచ్చే మొత్తాలకు మార్వాడీవలె ఇచ్చిన రోజు దగ్గరనుంచీ కూడా పక్కా వడ్డీ తీసుకుంటున్నారు. ఇది ఎంత మాత్రం సమర్థనీయం కాదు. ఇల్లాంటి విషయాలలో

కేంద్ర ప్రభుత్వంతో మనం గట్టిగా చెప్పవలసియుంటుంది. ఈ సంవత్సరం నీటి పారుదలకు కేటాయించిన మొత్తాన్నిగురించి ఉపముఖ్యమంత్రిగారు ఒక policy వివరించారు. ఈ 5 సంవత్సరములకూ కేటాయించిన-నీటి పారుదల స్కీములకు-అయ్యే ఖర్చులో medium projects కీ minor irrigation కూ ఖర్చు పెట్టవలసిందే కాని ఈ సంవత్సరం పెద్ద project ల మీద ఎక్కువ డబ్బు ఖర్చు పెడుతున్నాం కనుక, చిన్న project లకుకూడా ఈ సంవత్సరమే ఖర్చుపెడితే తరువాత వచ్చే రెండు, మూడు సంవత్సరాలూ మనం ఏమీ ఖర్చు పెట్టడానికి వీలుండదు. అందుచేత వాటిని వాయిదా వేశాం అన్నారు. ఈ policy ని తిరగతోడడమే న్యాయంగా కనిపిస్తోంది. ఇది నేనే చెప్పడంలేదు కేంద్ర ప్రభుత్వంకూడా చెబుతోంది. కేంద్ర ప్రభుత్వం రెండవ పంచవర్ష ప్రణాళికను ఒక expanding economy క్రింద రూపొందిస్తామని చెప్పి, దానికోసం అవసరమైతే నోట్లు గుద్ది 400 కోట్ల రూపాయిలు వెదజల్లుతామన్నారు. ఆ inflation లో 5 సంవత్సరాలకీ ఎల్లా వస్తుందంటే సంవత్సరానికి 12 వందల కోట్లయితే 2 కోట్లన్నర నోట్లు మాత్రం అచ్చువెయ్యాలి. కాని ప్రథమ సంవత్సరంలోనే 400 కోట్లు అచ్చువేస్తామంటున్నారు ఉత్పత్తిని ఎక్కువచేసి, economy ని expand చేసి, ప్రజల కొనుగోలు శక్తిని ఎక్కువచేస్తే ఒక విధమైన economic chain action ఒకటి బయల్దేరుతుంది. దాన్ని దృష్టిలో పెట్టుకుని మన దేశముఖ్ గారు 400 కోట్ల రూపాయిలు ప్రథమ సంవత్సరంలోనే inflation తీసుకువస్తానని చెబుతున్నారు. ఆ సూత్రాన్ని పురస్కరించుకుని మనంచూస్తే irrigation పద్ధంతా ఉత్పత్తికోసం మనం ఖర్చుపెట్టేపద్దు. ఈ ఉత్పత్తికోసం ఖర్చుపెట్టేపద్దుల విషయంలో మనంకూడా కేంద్ర ప్రభుత్వం తీసుకున్న ధైర్యమైనటువంటి వైఖరి తీసుకుని ఈ సంవత్సరం ఎక్కువగా ఖర్చుపెట్టి ఉంటే చాలాబాగుండేది. ఈవిషయంలో మన policy ని కొంత మార్చుకుంటేనే బాగుంటుందని నా అభిప్రాయం. అనేక అసమానతలు కల్గినటువంటి ఆంధ్ర దేశంయొక్క వ్యవసాయ వ్యవస్థలో చాలా complications ఉన్నమాట వాస్తవమే. ఒక ప్రాంతానికి ఎక్కువ డబ్బిస్తే మరొక ప్రాంతం వారికి కోపం వస్తుంది. క్రిందటి బడ్జటులో వ్యక్తిగతంగా చాలా కఠినంగాకూడా మాట్లాడారు. మొత్తం సమాజానికి న్యాయంగా ఉండే ధోరణిలోనే ఒక చిన్న సూచన చేయదలచుకున్నాను. వెనుకబడిన ప్రాంతాలకు, famine areas కి న్యాయం కలుగజేయవలసినదే. ఉదారంగా ఉండవలసిందే. సందేహంలేదు. Guaranteed water supply లేక జూదంమాదిరిగా వర్షంమీద ఆధారపడి పెట్టిన పెట్టుబడికూడా రాక దివాలా వేసేటటువంటి పరిస్థితులుకూడా కొన్ని ప్రాంతాలలో ఉన్నాయి. ప్రకృతి గర్భంలో అనేక వనరులున్నాయి. కాని వాటిని

Sri P. Satyanarayana] [19th March 1956

మనం సక్రమంగా వినియోగించడంలేదు. ఇది తక్కువ వ్యయంతో ఎక్కువ ప్రయోజనాన్ని తక్షణం పొందగలిగేటటువంటి schemes ఉన్నాయి. ఆ schemes రాష్ట్రంయొక్క ఆర్థిక వ్యవస్థను దృఢపర్చుకోడానికి. ప్రజల కొనుగోలు శక్తిని పెంచడానికి వెంటనే ఉపయోగపడతాయి. తూర్పు గోదావరి జిల్లాలో ఏలేరు project ని గురించి మిత్రులు గుర్రాజుగారు మనవిచేశారు. మొన్ననే సంజీవరెడ్డిగారుకూడా అక్కడకు వెళ్లివచ్చారు. రెండు కోట్ల రూపాయిల ఖర్చుతో మూడు సంవత్సరాల time లో పూర్తిఅవుతుంది. ఒక లక్ష ఎకరాలకు పైగా ఆయకట్టు క్రింద వస్తుంది. ఈ project విషయంలో మిగతా project ల విషయంలో ఏ మార్గమైతే అనుసరిస్తున్నారో దాన్ని అనుసరించనక్కరలేదు. ఇతర project ల విషయంలో ఆయకట్టుకు ఇచ్చిన ఐదు సంవత్సరాలకుగాని betterment levy వేయం అంటున్నారు. కాని ఈproject విషయంలో అట్లాకాదు. మీకు కావాలంటే ఈ సంవత్సరం మీరు వాగ్దానంచేస్తేఈ సంవత్సరంనుంచే betterment levy ఇవ్వడానికి అక్కడ రైతాంగం సిద్ధంగా ఉన్నారు. ఈ project కు అయ్యే ఖర్చంతా 20 సంవత్సరాలలో సమానవాయిదాలలో తీర్చాలని ఒక విధానం మీరు ఏర్పర్చుకున్నారు. 20 సంవత్సరాలు అక్కరలేదు. మీరు 1౦ ఏళ్ళలో తీర్మానం కావాలంటే ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు. అందువల్ల ఈవిషయంలో న్యాయం కలుగజేయడం చాలా అవసరం. ప్రజలయొక్క తోడ్పాటు, సహకారం పూర్తిగా ఉంటుంది. రెండో పంచవర్ష ప్రణాళిక సంతృప్తికరంగా అమలుజరుగుతుంది. దేశ నిర్మాణం కోసం ప్రజలు ఉత్సాహంగా ముందుకురావాలి. అప్పులు ఇవ్వాలి. National savings పద్ధతి ఒకటి, Women's savings పద్ధతి ఒకటి, small savings పద్ధతి ఒకటి. మనం ఆ సేతు హిమాచలం పర్యంతం దేశం అంతా బాగుచేస్తున్నాం. దానికి మీరు ధన సహాయం చేయండంటే 100 కి 5 మంది మాత్రమే, అంటే అపారమైన చైతన్యం కలవారు మాత్రమే సహాయం చేస్తారు. కేవలం రాష్ట్ర పునర్నిర్మాణంకోసం ఖర్చుపెడుతున్నాం, దానికోసం సహాయం చెయ్యండంటే 100 కి 20 మంది ముందుకువస్తారు. మీ జిల్లాకోసం మీ region లో పునర్నిర్మాణానికి మేము గట్టిగా పనిచేస్తున్నాం, దానికోసం ఇంత డబ్బు allot చేస్తున్నాం మీరు ధన సహాయం చెయ్యండి అంటే 100 కి 75 వరకూ సహకారం వస్తుంది. పెద్ద capital accumulation కి ఒక మంచి వనరు. ఈ వనరు వినియోగించుకోవడంలో మన ప్రభుత్వం వెనుకపడిందని చెప్పకతప్పదు. ఎక్కడెక్కడ తక్కువ మొత్తంతో ఎక్కువ ప్రయోజనాన్ని తక్షణం అవసరమున్న areas ఎక్కడున్నాయో వేరే జాబితా వ్రాసి అక్కడ ఈ వైఖరి కనుక అనుసరించినట్లయితే తప్పకుండా మనం ముందుకు పోవడానికి

పావకాశం ఉంటుందని చెప్పి నా అభిప్రాయం తరువాత ఈ ఏలేరు project విషయంలో Planning Commission కు కూడా మేము పంపించాం. వారు తప్పకుండా అంగీకరిస్తారని ఆశిస్తున్నాం. అది రాగానే ఈ బడ్జెటులో కాకపోయినా ముందువచ్చే budget లో నైనా దాన్ని ప్రవేశపెడతాం అనేమాట చెప్పారు. చాలా సంతోషం కాని ఇదివఱకు Planning Minister గారు తదితర మంత్రులు ఆ ప్రాంతానికి వచ్చి meeting లలో మాట్లాడినప్పుడు వాగ్దానాలు ఇచ్చారు కనుక ఈ budget లోనో token grant గా నైనా కొంత ఇచ్చి సంతృప్తిపరిస్తే చాలా బాగుంటుందేమోనని నేననుకుంటున్నాను. ఇదివరకు బడ్జెటు సమావేశంలో కొన్ని ప్రమాదకరమైన అంశాలను ప్రభుత్వ దష్టికి తీసుకువచ్చాం, కాని వాటి విషయంలో investigation వినా జరగలేదు. ఈ విషయం ఇదివరకు బడ్జెటులో నే చెప్పడమైనది. రమణక్కపేట ప్రాంతములో 5, 6 గ్రామాలు పూర్తిగా మునిగిపోతున్నవి, ఎకరాకు 16, 17 బస్తాల పంటకు అవకాశంఉన్నాగూడా ప్రతి alternate సంవత్సరముకూడా ఒకబస్తా అయినా ఇంటికిరాకుండా పూర్తిగా మునిగిపోవడమువల్ల ఎకరం 200, 300 రూపాయలకుకూడా అమ్ముకునే పరిస్థితులు వస్తున్నవి. కొనడానికి చాలా చిక్కగాఉన్నది. చేను పడిచిపెట్టడముకూడా జరుగుచున్నది. ఆ విధముగా కొన్నివేల ఎకరాలు పాడుఅగుచున్నవి. అతి స్వల్పమైన పెట్టుబడితో ఒక చిన్న ముంపు నివారణ స్కీముచేస్తే, సముద్రానికి ఒక కాలువ త్రవ్వితే సరిపోతుంది. లక్షరూపాయలకన్న ఎక్కువకాదు. దానిని Investigate చేయించి Estimate చేయించవలెనని మేమంతా చెప్పినాముగాని ఇంతవరకు ఏ విధమైన చర్యతీసుకొనలేదు. ఇలాంటి స్వల్ప విషయాలలోకూడా నిరాదరణగా ఉండడము బాగాలేదు. ఈ రెండవప్లాను విషయములో ప్రజలకు ఎక్కువ ఉత్సాహము కలుగదు. అనుదినకృత్యములలో చెయ్యవలసినవి అనేకముఉన్నవి. అవికూడ డిపార్టుమెంటువారు సరిగా చెయ్యడములేదు. Silt పెరుగుతూఉంది. పొరుదల ఎక్కువ కావడము, గ్రామాలను ముంచడము జరుగుతూఉంది. అందుచేత మనము కేవలము రూపాయలు కేటాయించి వ్యవహారదృష్టితో మాత్రము కాకుండా దినందినచర్యలలో సరిఅయినపద్ధతిలో జరగడములేదు. సరిఅయిన అజమాయిషీ ఉంటేనేగాని ముందుకు పోలేమని మనవిచేస్తున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—అధ్యక్షా మహాశయా ! ప్రత్యేకముగా నేను ప్రత్యుత్తరము చెప్పకొనవలసిన విషయములు కొద్దిగానే ఉన్నవి. ఇక ఆయాతాలూకాలలో తమ తమ నియోజవర్గాలలో జరుగవలసిన పనుల విషయములను గురించి గౌరవసభ్యులందరు చెప్పినారు. వీటి విషయమై తప్ప

కుండా ఆలోచిస్తాము. కాని ప్రతిశాసనసభ్యుడు నా నియోజకవర్గములో ఏమి కార్యక్రమము జరిగింది అని అడిగితే నేను మీకు సమాధానము చెప్పలేను. ఒక్కొక్క శాసనసభ్యుడు తన నియోజకవర్గములో ఒకటో రెండో ప్రాజెక్టులు కావాలనికోరితే, అవి కట్టడము మొదలుపెడితే శాసనసభ్యులు ఎంతమంది ఉన్నారో, అన్నికోట్ల రూపాయలు ఖర్చుచేయవలసి ఉంటుంది అని Demands కు కేటాయించిన మొత్తములన్నీ ఖర్చుపెట్టినను, ఎన్నిసంవత్సరాలకు ఆ కార్యక్రమము సాగించగలమో శాసనసభ్యులందరు గమనిస్తే అన్ని ప్రాజక్టులు ఒకే పర్యాయము తీసుకొనలేము, కొద్ది కొద్దిగా మాత్రము తీసుకొనగలుగుతాము అని అర్థము చేసుకొనగలుగుతారు. గానిజనరల్ గా 2, 3 ముఖ్యమైన విషయాలు కొందరు మిత్రులు సూచించారు. వాటికి సమాధానము చెప్పమనికూడా కోరినారు. ముఖ్యముగా సత్యనారాయణరాజు గారు డిబేటును ప్రారంభముచేస్తూ పెద్దస్కీములకు డబ్బుతగ్గించి మీడియము స్కీములకు ఖర్చుపెట్టాలని అన్నారు. పెద్ద ప్రాజక్టులు ఏ 12, 14 ఏండ్లకో పూర్తిఅవుతాయి, ఏమి ప్రయోజనములేదు, కాబట్టి నందికొండ డబ్బు తగ్గించి చిన్నవాటికి పెట్టమని అనరు. గాని ఇన్నికోట్ల రూపాయలు ఖర్చుపెట్టి వాటికి మనము వడ్డీఇచ్చుకుంటున్నాము. ఈ ప్రాజక్టు పూర్తిచెయ్యడము కొన్ని సంవత్సరాలు పడుతుంది. నిదానంగాచేస్తే రాష్ట్రం మొత్తంమీద కష్టపడవలసి ఉంటుంది. ఎంతనిదానముగా జరిగితే, రానున్న ఫలితముకూడ అంతనిదానము అవుతుంది. అది Sound policy అవుతుందోకాదో, ఆ విషయము వీలైతే పునరాలోచించవలెను. వీలైతే ప్రారంభించిన ప్రాజక్టులు ఎంతత్వరగా పూర్తి అయితే అంతత్వరగా ఫలితమునిస్తుంది. దానికి వృథాగా వడ్డీ ప్రభుత్వం చెల్లించుకొనే అగత్యంకూడ తగ్గుతుంది. ఈ ఉద్దేశముతోనే మేము ప్రారంభించిన ప్రాజక్టు డబ్బు చేతిలోఉంటే మాత్రము అతిత్వరలో పూర్తిచేయవలెనని మేము ముందుకు పోతున్నాము. వెంకటేశ్వరుగారు మైసూరుకు మన రాష్ట్రానికిఉన్న లావాదేవీల విషయం చెప్పారు. ఈ మధ్య మైసూరు శాసనసభలో హనుమంతయ్యగారు మాట్లాడుతూ "మేము మాత్రము తుంగభద్ర ఎగువకాలవకు ప్రతికూలరమా ? మేము అనుకూలురమే మాకంటె ముందే ఆంధ్రప్రభుత్వం Investigate చేసింది. కాబట్టి ఇంకా మేము దానిని పరిశీలనలో ఉంచాము." అని ఏదేదో మాట్లాడారు. ఆంధ్రరాష్ట్రం రాకముందే మొదటి 80 మైళ్లు మద్రాసు ప్రభుత్వంవారే Investigate చేసినారు. ఆ 80 మైళ్లుమాత్రము కర్నాటక ఏరియాలోఉంది. హగరినదినుంచి దిగువభాగం మన స్టేటులోఉంది. హగరినుంచి హోస్పేటవరకుఉన్న ప్రాంతము మద్రాసు ప్రభుత్వం Investigate చేసిపెట్టేరు. కాబట్టి వారి ప్రాంతములోనికి పోవలసిన అగత్యం మరకు ఏమీ

కలుగలేదు అక్కడనుంచి దిగువ వరకు కడప, జమ్ములమడుగువరకు కావలసిన Investigation నిమిత్తమై ప్రత్యేకమైన సిబ్బందిని పెట్టి ఆంధ్రరాష్ట్రము ఏర్పడిన తరువాత కొద్దినెలలలోపల పూర్తిచెయ్యవలసివచ్చింది. నందికొండతో సమానముగా High level కాలవ తీసుకొనవలెను అనేవాద నేకాక ఈ Estimate తో సహా ఆ Estimate కూడా ప్రభుత్వానికి అందచెయ్యాలనే ఉద్దేశంతో ఆంధ్రరాష్ట్రప్రాంతములోఉన్న భాగానికిమాత్రము స్పెషలు ఇంజనీరును ప్రత్యేకించి, ఆ కార్యక్రమము జరిపాము. కర్నాటకప్రాంతములో పూర్వమే Investigation ఆయిపోయింది మద్రాసు ప్రభుత్వం Time లోనే. మరి వారిని అడుగవలసిన అవసరం ఎక్కడ ? ఆంధ్రరాష్ట్రములో ఏదో ప్రాజక్టు Investigate చెయ్యడానికి వారి అనుమతి ఎందుకో నాకు అర్థంకాలేదు. తనకు ఆక్షేపణలేదని నానుమంతయ్యగారు చెప్పితే ప్రత్యేకమైన పద్ధతిని సూచించారు. ఆ పద్ధతిని అంగీకరిస్తే ఈ ప్రాజెక్టు మనకు అవసరము లేదనుకుంటాను. "రెండు ప్రత్యేకమైన రాష్ట్రాలు, ఆంధ్ర కర్నాటక రాష్ట్రాలు ఈ తుంగభద్ర ఎగువకాలువకువచ్చిన నీరు సమముగా పంపిణీ చేసుకొనవలెను అన్నారు. అంటే, బళ్లారి మూడు తాలూకాలకు నీరుఇస్తే ఆ మూడు తాలూకాలలో పారేనీరు, తరువాత మిగిలిన రాయలసీమ ప్రాంతములలో కడప, అనంతపురం, కర్నూలులో పారేనీరు సమానముగా ఉండవలెను అన్నమాట. ఈ ప్రాజక్టును మన ఆంధ్రరాష్ట్రము వచ్చినతరువాత సృష్టించుకొన్నదికాదు. మద్రాసు ప్రభుత్వము, ఏదో కాంగ్రెసువారు చేసినది కాదు. 1905 సంవత్సరములో 50 సంవత్సరములక్రితము మెకంజీగారు వేసినది. ఈనాడు తు. చ. తప్పకుండా Detailed estimates చేయించాము. మెకంజీగారు Detailed చేసిన ప్లానులలో మార్పులు ఏమీచెయ్యలేదు. నీరు ఆ రెండు తాలూకాలకు సగంకావలెను, మిగిలిన మూడు జిల్లాలతో సమానముగా నీరుకావలెనని కోరడములోనే ఈ ప్రాజెక్టువద్దు అని చెప్పినట్లు అవుతుంది. కాబట్టి మేము Planning commission కు Submit చేసిన Plan కు ఒప్పుకొనవలెనని చెప్పాము. ఆంధ్రరాష్ట్రమువారు పంపిన ప్లాను న్యాయంగా సక్రమంగా ఉన్నదని అంగీకరించడమే కాకుండా మైసూరు ప్రభుత్వాన్ని ఒప్పించడానికి వారు కృషి చేశారు. ఒకటి రెండు పర్యాయములు ప్లానింగు కమిషనుతోటి, మైసూరు ప్రతినిధులతోటి మనము సమావేశంఅయినాము. ఈ చిన్న విషయాన్ని అంగీకరించకుండాఉంటే తుంగభద్ర ఎగువకాలవకు నేనుమాత్రం వ్యతిరేకినా, హగంవరకు మాత్రము దానిని త్రిప్పుకుందాము, 60 మైళ్లు త్రిప్పుదాము మాకు అర్థం నీరు కావాలి. ఉంటూఅంటేఆ యన Idealist కావచ్చునుగాని ఆంధ్రరాష్ట్రంమాత్రము అంగీకరించడానికి వీలులేదని చెబుతున్నాను.

ఇక బత్తిన రామకృష్ణారెడ్డిగారు ప్రతి తాలూకాలోను ప్రాజక్టులకు కొంత ఖర్చుపెట్టాలని, శాసనసభలోని వారినిఅడిగి ఇవి చేస్తే చాలా సంతోషముగా ఉంటుందని అన్నారు. అలా చేయించవలెననే నాకు ఆశ. రామకృష్ణారెడ్డిగారిని రమ్మని ఇంకా కొన్ని లక్షలరూపాయలు ఖర్చుపెట్టాలనిఉంది. 21 మందిని రమ్మని మీకు ఆశకల్పించి, మీకు కావలసిన ప్రాజక్టులు ఎన్ని అని మీచేత చెప్పించుకొని ఒకటీ చెయ్యలేకపోతే అప్పుడు మీరంతా ఎంతబాధపడుతారో మీరే ఆలోచించండి అని అడుగుచున్నాను.

SRI B. RAMAKRISHNA REDDI :—ప్రతి మెంబరుకు ఇర్రిగేషను స్కీమ్సుఉంటవి ; 5 లక్షల 10 లక్షలవి సభ్యులందరిని సంప్రతిస్తే ఈ చిన్న స్కీములకు 10, 15 కోట్లు అవుతుందేమో. పైనుంచి అప్పుచేస్తే ప్రతి నియోజక వర్గానికి చెయ్యవచ్చును.

THE HON. SRI N. SANJEEVA REDDI :—మీరుచెపితే చెయ్యకూడదని కాదు. అన్ని నియోజకవర్గాలలోను సమానముగా చెయ్యవలెను. చిన్న చిన్న Minor irrigation పనులుఉన్నవి. అవి రివెన్యూ, అగ్రికల్చరు డిపార్టు మెంటువారు చెయ్యకల్గినవి.

రామస్వామినాయుడుగారు ఏవో పద్యాలు చెప్పేరు నాకు అర్థంకాలేదు. వేగావతిదగ్గర ఆనకట్టకడితే చాలా గ్రామాలకు ఉపయోగపడుతుందన్నారు. ఒక పర్యాయము నన్నుకూడా తీసుకొనిపోయి చూపించారు. 1954 లో శ్రీకాకుళం జిల్లాకు వేగావతిపైన రెండు ప్రాజెక్టులు వేసినాము ; వారది దగ్గర ఒకటి కరివలస దగ్గర ఇంకొకటి. రెంటిని ఇంజనీర్లు పరిశీలనచేసి కరివలసను ఎన్నుకున్నారు. వారదికి ఏమీ అడ్డంలేదు. చిన్న ప్రాజక్టు అది అది ఏమీ బ్రహ్మాండమైన ప్రాజక్టు కాదు. చిన్న ఆనకట్టకట్టడముకూడా పరిశీలనలో ఉన్నది. దానినివచ్చే Stage లో తీసుకునే అవకాశంఉంది. తవ్వినకాలవ ఉందికూడా ఆనకట్టకట్టడము గురించి త్వరగా పరిశీలించి రెండవ ప్రణాళికలో చేర్చడానికి వీలుఉంటుందేమో తప్పకుండా చూస్తాను.

కాకాని వెంకటరత్నంగారు మాట్లాడిన దానికి సమాధానము చెప్పకూడదని నేను అనుకుంటున్నాను వారు ఉద్రేకపడితే మనముకూడా ఉద్రేకపడం మంచిది కాదేమో. వారు ఏమైనా Motives ను impute చేస్తే మనం [illegible] మంచిదికాదు.

ఇలాంటి ప్రచారము చేశారు. మూడేళ్లుగా చేశారు, చేశారు, చేశారు. కొంతవరకు ప్రజలు నమ్మేరు, ఇప్పుడు నమ్మే పరిస్థితులలో లేరు ప్రజలు. కృష్ణా, గుంటూరు జిల్లాలకు సంజీవరెడ్డి వ్యతిరేకుడు. అంటే, కృష్ణా బారేజికి కోట్లకొలది డబ్బు ఖర్చు అగుతూ ఉంటే చూస్తునే ఉన్నారు ప్రజానీకం. శాంక్షను లేకుండా, డబ్బు లేకుండా కృష్ణా భారేజిని ఏవిధముగా ఎట్లా ప్రారంభించేసినామో ప్రజానీకం తెలుసుకున్నారు. కృష్ణా, గుంటూరు ప్రాంతాలకు నందికొండ ఎంత ఉపయోగపడుతుందో తెలుసుకున్నారు. ఈ తుంగభద్ర నీరు కృష్ణాలో లక్షల ఎకరాల రెండవ పంటకు ప్లానింగు కమిషను వద్ద కృషిచేసింది, సంపాదించింది అని తెలుసుకున్నారు. సంకుచితతో ప్రచారముచేసినా క్రష్ణా గుంటూరు ప్రజలు ఈనాడు నమ్మేటట్లులేదు. ఏమి చెప్పినా ఒప్పించలేని సంకుచితమైన ప్రజానీకం వారివెంట ఉంది. ఆ ప్రజానీకాన్ని ఒప్పించడానికి నేను తలచుకోలేదు.

బుడమేరు విషయములో సెక్రటరీగారు ఏమోచేశారు అన్నారు. సెక్రటరీలు ఉండేది కొట్లాడుకోడానికా? ఎందుకు ఈ సెక్రటరీలను మనము తెచ్చిపెట్టుకోవడం. ఇటువంటి పొరపాట్లు జరిగితే పరిశీలనచేసి చెప్పడానికేనా. బుడమేటి నీరు కృష్ణలోని పంపడానికి diversion scheme పెట్టినాము.

Diversion scheme బుడమేటినంతా కృష్ణలోనికి కలుపుతూ ఉంది. ఆ diversion scheme ప్రాంతానికి పై భాగంలో రిజర్వాయర్ కట్టాలని అనుకొంటున్నారు. అది irrigation schemes క్రింద తీసుకొంటే ఎవరికీ ఆక్షేపణ లేదు. రిజర్వాయరు కట్టించవచ్చు. నీటిపారుదల సరఫరా చేయించవచ్చు. ఏమైనా చేయవచ్చు. Irrigation scheme అంటే Engineer చెప్పినా మరెవరు చెప్పినా మనం ఒప్పుకోవాల్సిందే. 150 లక్షల రూపాయలు ఖర్చుబెట్టితే మూడువేల ఎకరాలు దానివల్ల సాగుఅవుతుంది. Flood control కు కొద్ది మైళ్ళ క్రింద అంటే అయిదారు మైళ్ళ క్రిందనే diversion scheme పెట్టుతున్నాం కాబట్టి, reservoirలో నిలిచే నీరుకూడా ఈ diversion కాల్వద్వారా కృష్ణలోకి వెళ్లిపోవడానికి అవకాశముంది.

Diversion Channel పెట్టినతరువాత పైననే రిజర్వాయరు కట్టడంలో అర్థమేలేదు అని మాకుతోచిన point ను Secretary గారే మాకు చెప్పారంటే, వారిని నేను అభినందిస్తున్నాను, సంతోషిస్తున్నాను, గర్విస్తున్నాను. అలాంటి Secretary ఉన్నందుకు ఇల్లాంటి సంకుచితమైన దృక్పథము కలుగచేస్తున్నప్పుడు నేను విచారపడివలసివస్తుంది. (Interruption) I have nothing to hear from him, Sir. I refuse to hear. కాబట్టి నా Secretary నాకా సహ

హామీ ఇచ్చినందుకు సంతోషిస్తున్నాను. ఆ సలహాకే Finance department వారు, ముఖ్యమంత్రిగారుకూడా అంగీకరించారు. అందరము అంగీకరించాము. ఇక రిజర్వాయరును irrigation scheme క్రింద తీసుకోవాలని అనుకొంటున్నాము. ఇంతటితో వదలిపెట్టలేదు దీనిని. 200 మైళ్ళనుంచి వచ్చి బుడమేటిలోపడే చిన్న చిన్న branch rivers ఉన్నాయి. ఆ scheme పరీక్షచేసి, కోటి యాభై లక్షల రూపాయలను ఖర్చుపెట్టి 3,000 ఎకరాలకు నీరు సరఫరా చేయడానికన్నా ఇంకా రిజర్వాయరులను ఎక్కడనో పైభాగంలోనో దిగువనో కట్టి వాటిద్వారా ఈ కోటి యాభై లక్షలు ఖర్చుపెట్టి మూడువేల ఎకరాలు కాదు, పదివేలు, పాతికవేలు, ఇంకా ఎక్కువ భూమి Irrigate చేయడానికి వీలవుతుందేమో investigate చేయమని ఉత్తరవు చేశాము. ఇది ఎవరో ఎప్పుడో కృష్ణా, గుంటూరు జిల్లాలపైన సంజీవరెడ్డి గారికి అభిమానంలేదు అని అంటారన్న భయంతో చేసినపనికాదు. నాకు అభిమానం ఉంది. నన్ను విశ్వసించే ప్రజానీకము లక్షలాదిమంది ఆ జిల్లాలలో ఉన్నారనికూడా నాకు తెలుసు. ఆ జిల్లా ప్రజల ప్రతినిధి అయినటువంటి పుతుంబాక శ్రీరాములు లాంటివారు ప్రజానీకము అభినందిస్తున్నారన్నప్పుడు నాకు చాలా సంతోషముంది. ఉన్నారు అభినందించేవాళ్లు. తరువాత అప్పారావుగారు నాగార్జునసాగరు ఎడమ కాలువ గురించి చాలా మంచి ప్రయత్నం చేస్తున్నారు. నాగార్జున సాగరం ఎడమ ప్రక్క కాలువ 11 వేల cusecs లకు మాత్రం ఇప్పుడు ఏర్పాటు చేయబడింది. అది ఇంకా కొంచెము పెద్దగచేసి కనీసము, 14, 15 వేల cusecs ల నీళ్లు అయినా తీసుకోవడానికి వీలైతే చాలా వెనకబడిన ప్రాంతంగా కనబడుతున్నట్టి నూజివీడు, చింతలపూడి తాలూకాలకుకూడా నీరు తీసుకొనిపోవడానికి వీలౌతుందని, వారు వారి మిత్రులు గట్టిగా ప్రయత్నంచేస్తున్నారు. 1954 వ సంవత్సరములో ప్రకాశంగారి మంత్రివర్గం ఉన్నప్పుడు అక్కడక్కడా పెద్ద సమావేశాలను జరిపి నన్నుకూడా తీసుకొనిపోయి, వారియొక్క ప్రజలయొక్క అభిప్రాయాలను తెలియజేశారు. నేను సలహాచేసినమీదటనే, అప్పారావుగారు, పేట బాపయ్యగారు మొదలైన పెద్ద పెద్దలందరు Nagarjunasagar Control Board వారు Dam site దగ్గర సమావేశమవుతున్నప్పుడు, అక్కడకువచ్చి ఈ కాలువయొక్క ఆవశ్యకతను గురించి నాకేకాదు. మిగిలిన సభ్యులందరికీ తెలియజేసారు. ఇది రెండు రాష్ట్రాలకు సంబంధించినది. కేంద్రప్రభుత్వంయొక్క ప్రతినిధులుకూడా అందులో ఉన్నారు. Planning Commission వారు అంగీకరించిఇస్తే తప్ప ఈ కాలువ స్వరూపాన్ని మార్చడానికి మా కెవ్వరికి అధికారంలేదని తెలియజేసినమీదట ఈ పెద్దలందరు అక్కడున్నటువంటి మిగిలిన సభ్యులకుకూడా విషయాన్ని బాగా విపులంగా చెప్పి Planning Commission వారిని. ఇంకా ఒత్తిడిచేసి ఒప్పించి, మార్పించు

కోవడానికి కృషిచెయ్యాలి. రెండు ప్రభుత్వాలు ఇప్పుడు చెయ్యాల్సి ఉంటుంది. మన అదృష్టవశాత్తు విశాలాంధ్ర రాష్ట్రముకూడా రాబోతూఉన్నది కాబట్టి రెండు ప్రభుత్వాలు అనేమాట ఇక 6 నెలల్లో తగ్గిపోతుంది. అంతలోపల ఈ కాలువ త్రవ్వేదేమీలేదు. ప్రమాదము జరిగేదేమీలేదు. కాబట్టి మీరు, మీ పట్టుదలను మానకుండా కృషిచేస్తే, ఈ సంజీవరెడ్డి ఉండనీ ఎల్లయ్య ఉండనీ, పుల్లయ్య ఉండనీ మీరు కోరుతున్న కోర్కెమాత్రం సవ్యమైంది, న్యాయమైందనికూడా నాకు తెలుసు ఏ నాటికో ఒకనాటికి అదిఫలిస్తుందని మీతో సమానంగా ఆశిస్తున్నాను. ఇక నరసింహ అప్పారావు నందివాడను గురించి విశాలాంధ్ర రాకమునుపే, పునాదిరాయి వేయమన్నారు. ఆంధ్రరాష్ట్రం వచ్చినతరువాత పునాదిరాయి వేయడం విషయంలో నేనింతవరకు ఒక ఆచారం పెట్టుకున్నాను. Complete గా administrative sanction అయిపోయి Engineer లు పని ప్రారంభించిన తర్వాత తప్ప నేను పునాదిరాయి ఎప్పుడూ వేయలేదు. కొన్ని ప్రాజెక్టులకు పునాదులు వెయ్యడానికిపోతే అప్పటికప్పుడే సగం work అయిపోయింది. మూడు నాలుగు లక్షలరూపాయల పనికూడా అయిపోయింది. గత సంవత్సరం, నేను నెల్లూరుజిల్లాలో నక్కలగండి ప్రాజెక్టుకు పోయినప్పటికే సగం రిజర్వాయరుకూడా కట్టివేశారు. ఆ రకంగా పునాదిరాళ్లువేస్తే బాగుంటుందిగానీ ఇప్పుడే పని ప్రారంభం కాకముందే పునాదిరాయి వెయ్యడంఅంటే, పునాదిరాయి వేసేఖర్చు అప్పారావుగారు పెట్టుకొంటారా ? ప్రభుత్వానికేమీ నష్టముండదు. కానీ, వేసినరాయిమాత్రం శాశ్వతంగా అక్కడేఉంటే అది వారి ప్రతిష్టకుగానీ నా ప్రతిష్టకుగానీ తగినదిగా ఉండదు. Sanction అయినతరువాత చేయించుకోవడానికి ప్రయత్నంచేసి డబ్బుప్రయత్నంచేసి, కృషిచేద్దాము మనము. ఇది మన కృషికిమించినదేమీకాదు. ప్రయత్నంచేసి సాధించుకొందాము. ఇక మిగిలిన మిత్రులు రామినాయుడుగారు, ముఖ్యంగా వెనుకబడిన కొండవారిని గురించి గున్నయ్యగారు చాలా విషయాలు చెప్పారు. Tank restoration గురించి కోదండరామయ్యగారు అభినందించారు, చెరువులంతా తెగిపోతే వెంటనే అక్కడికి పోయినానని పోకుండా నేనేమి చేయగలను. నేను కాలువగట్టున కూర్చున్నాను, మీరు రాకపోతే నేను కాలువగట్టునుంచి కదలను అని జాబువ్రాస్తే అప్పుడు విధిలేక అక్కడికి పోవలసివస్తుంది. కోదండరామయ్యగారి పట్టుదల నాకు తెలుసు. ఈ కమ్యూనిష్టులు జెయిల్లలో ఉన్నప్పుడు వాళ్ళతోబాటు నేను కోదండరామయ్యగారు కలిసిమెలసి ఉండిన కాంగ్రెసువాళ్ళము మేము యిద్దరమే. అప్పుడు వారెంత పట్టుదలమనిషో నాకు బాగా తెలుసు. మంచి అనుభవముకూడాఉంది. కాబట్టి మీరు వచ్చేవరకు కాలువగట్టున చెట్టుక్రిందకూర్చుంటున్నాను, అని జాబువ్రాశారు.

కాబట్టి ఈ వరదల్లో ఆ కాలువగట్టు కూడా తెగిపోతే మరి గతేమికావాలి. ఒక శాసనసభ్యుడు తప్పిపోయే ప్రమాదముంది. అందువల్ల వెంటనే అక్కడికిపోయి ఆ చెరువులన్నీ మరామత్తులు చేయడం జరిగింది. దానికి వారు సంతోషాన్ని వెలిబుచ్చారు. ఒక్కరైనా ఆ విషయం చెప్పినందులకు చాలా సంతోషిస్తున్నాను. గోపాలకృష్ణయ్యగారు నాగార్జునకొండను గురించి డబ్బు ఇంత తక్కువ ఖర్చుతో వీలౌతుందా అని సందేహం వెలిబుచ్చారు. సరిగ్గా అదే విషయాన్ని నాగార్జున సాగరు Control board వారు ఆలోచించి ప్లానింగుకమిషన్‌వారికి తెలియజేసారు అంత తక్కువ నే నేమిచెప్పను. ఈ Point లు మా దృష్టిలో లేక పోలేదు. ఎన్నేండ్లవుతుంది ఇంతకొద్దిగా పెట్టితే ? ఈ రకంగా పెట్టితే First five years కాదు గదా ten five years లో అయినా నీళ్లు ఇవ్వగలుగుతామా, లేదాఅన్న Point మా దృష్టికి వచ్చింది. ఈ ఆంధ్రరాష్ట్రప్రభుత్వమే గాదు. నాగార్జున కంట్రోలుబోర్డు ఈ విషయాన్ని చూచి Delhi ప్రభుత్వానికి, ప్లానింగు కమిషనుకు తెలియజేసారు. So let us await what they will do.

SRI D. KONDAIAH CHOWDARY :—అధ్యక్షా, మాకు మాట్లాడడానికి అవకాశంలేదు కాబట్టి మంత్రిగారిని నాగార్జునసాగరం విషయంలో కొంత Information అడుగుతున్నాను. ఇప్పుడు నెల్లూరుజిల్లాకు రెండవదశలో నీరు ఇస్తామంటున్నారుగదా ? ఈ నీళ్లు అసలు రెండవదశలో రావని చెప్పి కొందరు ప్రచారంచేస్తున్నారు. అందువల్ల చాలా ఆందోళనగాఉంది. ఈ రెండు దశలు ఒకేదశలో కలుపుతారా ? లేక ఆ రెండుదశలు లేకుండా మీరేమైనా సెలవిస్తారా అని అడుగుతున్నాను.

THE HON. SRI N. SANJEEVA REDDI :—ఈ రెండు దశలుగా ఖర్చుచేయదలచినాము. ఇది అంతాకూడా "Complete project is one unit" అని Planning Commission వారంటున్నారు. కాబట్టి మనం వారు చెప్పింది విశ్వసించాలి. ఖర్చులకుగాను రెండుగా భాగించడమనేది తప్పా ? First stage, second stage అని Project అంతా నెల్లూరివరకు పోయినప్పుడే పూర్తి project అని వారంటున్నారు. దానిని మనం విశ్వసించకతప్పదు. ఇక వెంకట శివయ్యగారు మాట్లాడుతూ medium schemes కూడా కొన్ని గుంటూరు జిల్లాలో కావాలన్నారు. పెదనందిపాడు ఛానల్ చాలావరకు పరిశీలన జరిగిపోయుంది. అదేం కొత్తదికాదు. నేను రెండేళ్లుగా చూస్తున్నాను. అది మంచి paying scheme కాని ఉన్న రెండుకోట్లలో పెద్దనందిపాడుకు 60, 70 లక్షలు ఇచ్చేస్తే ఇంకా మిగిలిన చిన్న చిన్న project లను కట్టడానికైనా వీలవు

తుందా ? కాబట్టి గుంటూరు స్కీముఅని, అదని, ఇదని ఏమో అనేస్తున్నారు. అవి neglected areas కావుగా. పోనీ neglected areas అన్నా అయితే, మా తాలూకాలు, మా జిల్లాలుఅంతా neglect చేసినావు అని అన్నాసరే. నందికొండ, కృష్ణాబారేజి నీళ్లు వచ్చినప్పుడు ఆ నీటిని ఎక్కడో ఒకచోట ఉపయోగించాలిగా ? కృష్ణాబారేజి కట్టినప్పుడు దాదాపు 70, 80 వేల ఎకరాలకు నీరు వస్తున్నప్పుడు ఆ నీటిని ఉపయోగించుకోకుండా ఎక్కడికి పోతాం ?

కాబట్టి వారు కోరినా కోరకపోయినా ఆ కాలువ వెడల్పు చేయడమో లోతు చేయడమో చేసి ఆనీటిని వాడడానికి రైతులకు వసతులు కల్పించాలి. అక్కడ ఏమీ సందేహాలు పెట్టుకోవద్దు. వారు చెప్పిన రూపంలో రాకపోవచ్చు పెద నందిపాడు channel అనకపోవచ్చు. Guntur channel అని పేరుపెట్టనచ్చు ఈ కృష్ణా barrage వల్ల ఎక్కువగా సాగులోనికి తేగలిగిన భూమిని తేవడానికి మాత్రం ప్రయత్నాలు జరుగుతాయని నేను వారికి హామీయిస్తున్నాను.

ఇక బీసెట్టి అప్పారావుగారు మాట్లాడుతూ లంక సుందరంగారు వచ్చి ఏదో ప్రచారం చేశారన్నారు. Elections దగ్గరకు వస్తున్నాయి మరిప్పుడు ప్రచారం చేయకపోతే ఎట్లా? ఇన్నాళ్లు ఢిల్లీలోనుండి యిప్పుడయినా ఆయనను రావద్దంటారా? వారు యిలాంటి ప్రచారం సాగించే, పోయినతూరి స్వతంత్రుడుగా ఎన్నికయినారు. ఇలాంటి ప్రచారంచెస్తూనే వుంటారు. Estimates పంపలేదు, యివిలేవు అవి లేవు అని మీరొక పర్యాయం secretariat కు రండి. శారద, వగైరా ప్రాజక్టుల తాలూకు estimate లు ఉన్నాయి. estimates పంపినవన్నీ చేస్తారని కాదు. కాని వారి ప్రచారం సత్యదూరమని చెప్పడానికి estimates చూపించగలము. ప్రజానీకానికి నిజము చెప్పడానికి ఆ ప్రచారాన్ని ధైర్యంగా ఎదుర్కొగలరని ఆశిస్తున్నాను.

SRI B. APPA RAO :—మీరు చెబితే చాలు మాకు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—తిమ్మారెడ్డిగారు మాట్లాడుతూ కృష్ణా తుంగభద్రలు యిక్కడనుంచి పోతూనే వున్నాయి, ఈ నీటిని యిక్కడ వాడకుండా నాగార్జునసాగరు అంటున్నారు, ఇక్కడ కావలసినటువంటి సిద్ధేశ్వరం project ఏమయినది అన్నారు ఈ సిద్ధేశ్వరం project రెండు రాష్ట్రాల మధ్య నున్నది. అటుప్రక్కనున్న రాష్ట్రానికి దానిపై అభిమానంలేదు. రెండు రాష్ట్రాలు ఒకే రాష్ట్రంగా వున్నప్పుడు సులభంగా తీసుకురావడానికి వీలుంటుంది. ఇప్పుడు సిద్దేశ్వరం project కట్టాలని మనం అంటే వద్దని వాళ్లంటారు. వాళ్లకు మునిగే భూమంతా అక్కడవున్నది, పంట పండించుకునే భూమి యిక్కడ వున్నది.

నందికొండ అట్లా కాదు. ఏమీ మునిగేదిలేదు నందికొండ అనే చిన్న పల్లెటూరు తప్ప యింకో గ్రామం మునగదు. రెండు భాగాలవారికి ఉపయోగపడుతుంది. సిద్ధేశ్వరం దీనితో కలిపితే చాలా కష్టాలకు గురవుతుంది. అందుకనే నాగార్జున సాగర్‌తో దీనిని కలుపలేదు. నాగార్జున సాగర్‌తో కలిపింది తుంగభద్ర ఎగువ కాలువ. రెండూ సమానంగా సాధించుకోగలం. సిద్ధేశ్వరం విశాలాంధ్ర వచ్చిన తరువాత సులభంగా సాధించుకోగలమనే విశ్వాసం నాకున్నది. అప్పుడు ఎవరు మంత్రిగా వున్నాసరే-అలాంటి సావకాశం మీకే వస్తుందేమో! సిద్ధేశ్వరం project మరచిపోలేదు. సిద్ధేశ్వరం project గోదావరి project investigation second plan లో వున్నది. Preliminary work-చేయటానికి కొన్ని లక్షలు ప్రత్యేకించబడినవి. సిద్ధేశ్వరం గోదావరి project పేర కొన్ని లక్షలు ప్రత్యేకించినాం. రెండో పంచవర్ష ప్రణాళికలో ఆ కార్యక్రమం చేసుకుంటే తరువాత మూడవ పంచవర్ష ప్రణాళికలో వీలవుతుందేమో అనుకుంటున్నాను.

ఎర్ర కాలువ గురించి శ్రీనివాసరావుగారు చెప్పారు. ఎర్ర కాలువ తమ్మిలేరు బుడమేరు ప్రాజక్టులన్నీ అవుతేనే కొల్లేటికి ముంపునుంచి రక్షణ. Flood Control Schemes క్రింద యివన్నీ చేర్చినామని తెలుసు. శ్రీనివాసరావుగారికి తమ్మిలేరు, ఎర్ర కాలువలను investigate చేయడానికి ప్రత్యేక సిబ్బంది వున్నది. బుడమేరు యిదివరకే ఎక్కువగా investigate అయినది కాబట్టి immediate sanction చేయించి పని ప్రారంభించబోతున్నాము. ఇక తమ్మిలేరుకు diversion వీలులేదు. తమ్మిలేరుకు Reservoir కట్టి ఆ నీటిని వాడుకోవాలనే తప్ప అది ఇంకెక్కడికో divert చేసి యింకో నదిలోకి పంపించడానికి వీలులేని పరిస్థితులున్నాయి. ఎర్ర కాలువైనా అంతే. కాబట్టి ఎర్రకాలువకు, తమ్మిలేరుకు ఎక్కడైనా reservoirs కట్టించి ఆ నీటిని ఎక్కువగా ఉపయోగించుకొని తద్వారా కొల్లేటి.కొచ్చే ముంపును తగ్గించడానికి ప్రయత్నంచేయాలి. మూడు reservoir లే కాదు యింకా ఉప్పుటేరు కాలువ వెడల్పు చేయాలి. ఉప్పుటేరు వెడల్పుచేసి సముద్రంలోకి నీటిని పంపాలి. దానికొక comprehensive scheme వున్నది. దీంతో flood control scheme ఒకటి ఢిల్లీకి పంపించాము. దానికి detailed investigation యింకా జరుగుతున్నది. ఊరికే పేర్లు పంపించాము ఇదంతా చేస్తే తప్ప కొల్లేటికి flood control చేయలేమని. ఏదయితే పంపుతామో అది బలవంతంచేసి sanction చేయించుకోడానికి వీలుంటుంది. ఎర్రకాలువ, తమ్మిలేరు యివికూడా తీసుకోగలుగుతాం అని ఆశిస్తున్నాను. ఇక ఏలేరు విషయం నేను చెప్పవలసిన అవసరం లేదు. చెప్పానప్పుడే, చాలా మంచి scheme చేర్చుకోవలసినదే అని,

SRI P. SREERAMULU :—Flood control scheme క్రింద పై కుందరపురంనుంచి సీతానగరంవరకు కృష్ణకు కుడికరకట్ట నిర్మాణం విషయమై తమకు విజ్ఞప్తిచేసి వున్నాను, ఆ విషయమై జవాబు చెప్పగోరుతాను.

THE HON. Sri N. SANJEEVA REDDI :—నేను యిప్పుడేమీ సమాధానం direct గా చెప్పలేను. On the spot తెలియదు, short notice question వేయండి. Information తెప్పించి చెబుతాను. రామస్వామిరెడ్డి గారు నాగార్జున సాగరుకోసం ఎలుగెత్తి అరిచినా యేమీ కేటాయింపు కాలేదని విచారపడు తున్నారు. నాగార్జున సాగరుకోసం అనంతపురం వాళ్లుకూడా ఆందోళన చేశారు. ఆంధ్ర దేశం అంతా నాగార్జునసాగరు కావాలన్నారు. Psychological feeling తప్ప యింకేమీలేదు. నాగార్జునసాగరు అనేది ఒక national project. ఈ నీటి విషయం ఎక్కడెక్కడకు పోతాయో యింకా decision తీసుకోలేదు. వీలయినన్ని ప్రాంతాలకు సరఫరా చేయాలనే ప్రయత్నంచేస్తాం. ఇప్పుడే ధైర్యంగా యీ ప్రాంతానికి వస్తుందని యింకా చెప్పడానికి వీలులేదు. Planning Commission వారు మనలను సరిగా చూడడంలేదని డబ్బు సరిగ్గా కేటాయించలేదని సత్యనారాయణగారు చెప్పారు. నాకుకూడా అదే భావంవున్నది. కాని మేము అంత గట్టిగా చెప్పడానికి కష్టంగా ఉన్నది. అందులోనూ యిది 116 కోట్లకు దిగుతుందేమో. పోనీ, 125 కోట్లయినా వుందా అంటే అదీలేదు. అది 116 కోట్లకు తగ్గింది. Irrigation పనులన్నీకూడా కుదించుకోవాలి-తగ్గించుకోవాలి. Industries విషయంలో Ferro manganese ఉత్పత్తికాక manures విషయం ఏద యినావచ్చిందా అంటే అదికూడాలేదు. అని విచారపడుతున్నాం. విచారపడడం తప్ప అంతకన్న నేను ఎక్కువచెప్పడం సబబుకాదనుకుంటాను. రెండుకోట్లు త్వరగాఖర్చుపెట్టమన్నారు. Deficit finance వస్తుందికదా కొన్నినోట్లు కట్టలు మనమీద పారేయరా అన్నారు. రెండుకోట్లు ఖర్చుచేయడం ఎంతసేపు. కాని దీనిలో ఎన్ని ప్రాజెక్టులు వస్తాయి. ఇంకా Spill over schemes, Medium schemes వున్నాయి. రాళ్లపాడు, పెన్నారు, భైరవానితిప్పయివి 6 Months one year లో Complete అవుతున్నాయి. The staff will be released by the end of this year సుందరయ్యగారు రాళ్లపాడు Scheme ను త్వరగా పూర్తిచేయమన్నారు. Help చేస్తాం అన్నారు డిల్లీలోని మిత్రులు. త్వరగా పూర్తి చేయాలని అనుకుంటున్నాను. Spill over schemes లో Engineers stuck up అయివున్నారు. ఎంతోమంది retired people ను తీసుకుంటున్నాము. We are still feeling the dificulty. కొంచెం breathing time కావాలి. ఆరునెలలలో Hyderabad తో merge అయిన తరువాత అక్కడ Staff చూచు

కోడానికి వీలవుతుంది. లేదా Hurry up చేస్తే Wastage ఎక్కువ కావచ్చు. ఆరుమాసములలో వచ్చే ప్రమాదం ఏముంది ? Next year చేయాలనికాదు. తరువాత సోమయాజులుగారు చీటీ వ్రాసిపంపించారు. "మాట్లాడడానికి అవకాశం రాలేదు, విశాఖపట్నంజిల్లా గురించి ఏమయినా ఖర్చుపెడుతున్నారా" అని. విశాఖపట్నంజిల్లాలో Last time కొన్ని Schemes పంపించాము. Delhi లో approve అయిరాలేదు. ఈ సంవత్సరం కొన్ని approve అయివస్తాయి. పంప, తాండవ, వరాహ యివన్నీ పంపించాము. రెండుకోట్ల 70 లక్షలవరకు పెద్ద ప్రాజెక్టులేని ప్రాంతములలో యీ డబ్బు ఖర్చుపెట్ట నిశ్చయించుకున్నాం. విశాఖపట్నంజిల్లాలో పెద్ద ప్రాజెక్టులులేవు. ఎంతవరకు వీలవుతుందో చూడాలి. పంప, వరాహ, తాండవ యివన్నీ చూచాను. వాటికి Technical details చూడడానికి Engineers వున్నారు వాటివన్నీ Investigate చేస్తున్నారు. final estimates పంపించాలి Approval లభించగానే అవి ప్రారంభించడానికి వీలవుతుంది. ఇన్నివున్నాయి. ఊరకనే సంజీవరెడ్డిగారు యిది ప్రారంభించలేదా అనుకుంటే అన్నీ ఒకరోజు ప్రారంభించలేమా ? నాకేంనష్టం ? ఈ అడ్డంకులన్నీ తీర్చుకొని ఈ పర్యాయమైనా విశాఖపట్నంలో కనీసం 2, 3 ప్రాజెక్టులయినా ప్రారంభించగలుగుతామని ఆశిస్తున్నాను. ప్రయత్నంమాత్రం చేస్తాను.

ఏమైనా అందరూకూడా చాలా constructive గా సలహాలు ఇచ్చారు. మనం ప్రజలయొక్క విశ్వాసముపైన ఆధారపడిఉన్నాము కాబట్టి మన local problems చెప్పకతప్పదు. All India out look గా ఉండాలనే మిత్రులు వెంకటేశ్వర్లుగారుకూడా మానందిగామ ఏమి అయింది? మానందిగామ ఏమి అయిందని అంటారు. ప్రతివారు మా ప్రాజెక్టులు ఏమైనాయి, మా ప్రాజెక్టులు ఏమైనాయి అని అంటున్నారు. అన్ని ప్రాంతాలలోను, అన్ని తాలూకాలలోను, అన్ని నియోజకవర్గాలలోను ఉన్న ప్రాజెక్టులన్నింటినీ ఒకేసారి ప్రారంభించలేమని వారికి తెలుసు. తెలిసి అయినా, ఈరకంగా constructive గా సలహాలిస్తూ ఈ డిమాండును సంపూర్ణంగా బలపరచినందుకు, నేను మిత్రులందరిని అభినందిస్తూ, దీనిని ఏకగ్రీవంగా అంతా ఆమోదించాలని, అధ్యక్షులవారిద్వారా కోరుతున్నాను.

Sri K. VENKATARATHNAM —అధ్యక్షా, ఈ బుడమేరు రిజర్వాయరును ఇర్రిగేషన్ స్కీము క్రింద గాక, వరద నివారణస్కీము క్రింద మంత్రులు, కేంద్ర ప్రభుత్వం అంతాకూడా పరిగణించారోలేదో తెలవిస్తారా ?

19th March 1956]

THE HON. SRI N. SANJEEVA REDDI :—Loan amount నుంచి ఏ ప్రాజెక్టుకు కేటాయించలేదన్న సంగతి మీకు తెలుసును. Loan amount నుంచి డబ్బు కేటాయించకపోయినా ఏ stage లో అయినా తీసుకోవచ్చును. ఇక్కడ రాష్ట్ర బడ్జటు balance కావడానికి దీనికి సంబంధంలేదు. రాష్ట్ర బడ్జటు అయితే income ఎంతో, balance ఎంతో ఆలోచించుకొని ఖర్చుపెట్టాలి. దీనికి అట్లా అవసరములేదు.

SRI B. RAMA REDDI :—అధ్యక్షా, బద్వేలు తాలూకా సంగతి ఏమి చేశారు.

THE HON. SRI N. SANJEEVA REDDI :—రామారెడ్డిగారు ఇప్పుడు ప్రతి పక్షంలో ఉంటూ, వారి ప్రాంతానికి ఒక ప్రాజెక్టు, రెండు కమ్యూనిటీ డెవలప్‌మెంట్ బ్లాకులు సంపాదించుకున్నారు. ఇంకా ప్రాజెక్టులు కావలయునంటున్నారు. ఏదో సామెత చెప్పినట్లు ఒకటి యిస్తే, ఇంకొకటి ఇవ్వమని, ఏమీ ఇవ్వనినాడు నాకొకటి ఇవ్వమని అడుగుతూ ఉంటారు. బద్వేలు తాలూకా చాలా వెనుకబడి ఉన్న ప్రాంతమే. అందుకు నేను ఒప్పుకుంటాను.

SRI M. SATYANARAYANA RAJU :—ప్రతిపక్షములో ఉన్నవాళ్లకు తక్కువ వస్తాయా?

THE HON. SRI N. SANJEEVA REDDI :—ప్రతిపక్షము వాళ్లకే ఎక్కువగా ఇస్తుంటాము. ప్రతిపక్షం తరఫున ఉన్న ప్రజలలో పనులుచేసే వారిని మా ప్రక్కకు ఆకర్షించుకుంటాము. క్రిందటి పర్యాయము అప నేచేశాము.

SRI T. LAKSHMINARAYANA REDDI :—అధ్యక్షా, గోదావరి ప్రాజెక్టులగురించి ఏమీ చెప్పలేదు. అవి ఏ స్థితిలో ఉన్నాయో చెబుతారా ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—సిద్ధేశ్వరముతో కూడా చేర్చి, ఈ గోదావరి ప్రాజెక్టులకుకూడా కొంత ఖర్చుపెరుతున్నాము. Investigations ఇచ్చంపల్లిలోనా లేక ఇపూరులోనా అని తగాదా ఉన్నది. ఇపూరు నేను చూశాను. ఇచ్చంపల్లి ఇంకా చూడలేదు. మనకు విశాలాంధ్ర రాబోతున్నది తరువాత వచ్చినవారు పరిశీలనచేస్తారు. ఎక్కడ ప్రాజెక్టుకట్టాలో వారు నిర్ణయిస్తారు. గోదావరిమీద ప్రాజెక్టులు కట్టనిదే ఆంధ్రదేశం అభివృద్ధిచెందినదని అనుకోవడానికి వీలులేదు. అదివస్తే తగాదాలన్నీ సమసిపోతాయి. వారి తాలూకాకు సత్తెనపల్లితాలూకాకుకూడా నీరు పారించుకోవడానికి వీలుంటుంది.

Sri C. K. SUBBARAYADU .—అధ్యక్షా, తుంగభద్ర నీటిపంపకము విషయంలో మైసూరు ప్రభుత్వంతో అగ్రిమెంటుకువచ్చి సమస్యలు పరిష్కారమైనట్లుగా అనంతపురంలో మంత్రిగారు ఒక పర్యాయము చెప్పారు. అవి ఏ Basis మీద అయినావో సెలవిస్తారా ?

The Hon. Sri N. SANJEEVA REDDI :—పత్రికలలో పడిన వార్తలేగాని, నాకుకూడా ఏమీ తెలియులేదు. ఇంకా రిపోర్టువేసే నాకుకూడా రాలేదు. అదివస్తే దాని విషయం తేలుతుంది. నేడో రేపో రావచ్చును.

Mr SPEAKER .—I now put the cut motion (No 329) to the Vote of the House

The question is .

| | Rs. |
|---|---|
| To reduce the allotment of Rs. 1,38,65,400 for Irrigation by ... ... | 100 |

(For the abnormal delay to promote L.C Es. to the Upper Grade in the State).

The motion was lost.

Mr. SPEAKER .—I now put the cut motion (No. 335) of Sri S Vemayya to the vote of the House .

The question is :

| | Rs. |
|---|---|
| To reduce the allotment of Rs. 1,38,65,400 for Irrigation by ... | 100 |

(To urge Government to take up the excavation of Kanupur and Kavali canals now).

The motion was lost.

Mr. SPEAKER —I now put the motion (No. 336) of Sri Pillalamarri Venkateswarlu to the vote of the House.

The question is

| | Rs. |
|---|---|
| To reduce the allotment of Rs. 1,38,65 400 for Irrigation by ... | 100 |

(To discuss the failure of the Government to make provision for the execution of Tungabhadra High Level Canal Scheme).

The motion was lost.

SRI P. NARASIMHAPPA RAO :—Sir, I beg leave of the House to withdraw the cut motion (No. 357) moved by me.

The cut motion, was, by leave of the House, withdrawn.

MR. SPEAKER —I now put the cut motion (No. 367) of Sri M. Satyanarayanaraju to the vote of the House.

The question is :

| | | Rs. |
|---|---|---|
| To reduce the allotment of Rs. 1,38,65,400 for Irrigation by | ... | 100 |

(For the failure of the Government to implement Irrigation facilities to Cheepurupalli Taluk).

The motion was lost.

MR. SPEAKER :—I now put the main motion to the vote of the House.

The question is :

" That Government be granted a sum not exceeding Rs. 1,38,65,400 under Demand VIII—Irrigation "

The motion was carried and the grant was made.

DEMAND No. XXXIV—CAPITAL OUTLAY ON IRRIGATION.

MR. SPEAKER —The question is .

" That Government be granted a sum not exceeding Rs 5,17,29,600 under Demand XXXIV—Capital Outlay on Irrigation."

The motion was carried and the grant was made.

MR SPEAKER . I now put the cut motion (No. 390) of Sri Pillalamarri Venkateswarlu to the vote of the House.

The question is :—

To reduce the allotment of Rs. 1,80,00,000 for Capital Outlay on Multipurpose River Schemes by ... Rs. 100.

(To discuss the failure of the Government to make adequate provision for the execution of Nagarjuna Sagar Project).

The motion was lost.

MR. SPEAKER : I now put the cut motion (No. 391) of Sri M Nagi Reddi to the vote of the House.

The question is .—

To reduce the allotment of Rs. 1,80,00,000 for Capital Outlay on Multipurpose River Schemes by ... Rs. 100.

నాగార్జనసాగరు ప్రాజక్టును ఒకేదశలో తీసుకొనుటకు కుడికాలువ భోస్లా కమిటీ సూచించినట్లు, నెల్లూరు, గుంటూరు జిల్లాలలో అత్యధికభూమి సాగులోకి వచ్చునట్లుచేయుట గురించి చర్చించుటకు.

The motion was lost.

MR. SPEAKER .—I now put the main Demand to the vote of the House.

The question is :—

"That Government be granted a sum not exceeding Rs. 1,80,00,000 under Demand XXXVIII–Capital Outlay on Multipurpose River Schemes."

The motion was carried and the grant was made.

The House then adjourned to meet again at 8-30 a.m., on Tuesday the 20th March, 1956.

# APPENDIX

19th March 1956]

(*VIDE* ANDHRA LEGISLATIVE ASSEMBLY STARRED QUESTION No. 869 BY SRI V. VISWESWARA RAO, M.L.A.,)
(at page 35 supra)

| | *Name of the district.* | | *Particulars of tax collected during* 1954 *to* 1955. | *Particulars of tax collected from* 1-4-1955 *to* 31.12-1955 |
|---|---|---|---|---|
| | | | Rs. | Rs |
| 1. | Srikakulam | ... | 1,45,128 | 1,15,482 |
| 2. | Visakhapatnam | ... | 1,19,449 | 95,141 |
| 3. | East Godavari | ... | 2,07,082 | 1,62,100 |
| 4. | West Godavari | ... | 2,82,293 | 1,83,287 |
| 5. | Krishna | ... | 3,32,779 | 2,52,905 |
| 6 | Guntur | ... | 3,48,484 | 2,68,657 |
| 7. | Nellore | ... | 2,34,003 | 1,79,911 |
| 8. | Cuddapah | ... | 1,42,220 | 1,15,782 |
| 9. | Kurnool | ... | 2,12,181 | 1,57,585 |
| 10. | Anantapur | ... | 1,47,949 | 1,06,586 |
| 11. | Chittoor | ... | 2,16,780 | 1,74,168 |